# విషయసూచిక.



## ప్రథమఖండము.



## ద్వితీయఖండము.

# కాలసర్పము.



## ఉపక్రమణిక.



### స్వేచ్ఛ.

"నీ కేల నీభయము? నీ కేల నీసందేహము !! నీ కేల నీయాలోచనము !!!......

ఇప్పుడు మాత్ర మేమిలోపమువచ్చిన దని యడుగుచున్నావా ?

నీ కేమి వెఱ్ఱియా ? పిచ్చియా ? నీ కేమి లోపము వచ్చినదో నీవు గ్రహింపలేకుంటివా? నీకిప్పుడు స్వేచ్ఛావరోధము గలుగలేదా? ఇంతకంటె లోప మింకేమి గావలయును?

ఒక కీటకము నించుక బట్టుకొమ్ము. అది యేమి చేయునో జూడుము. గిజగిజ కొట్టుకొని యెట్లైన బయటబడుటకై బ్రయత్నింపదా ? అది యెందుల కట్లు బ్రయత్నించునో గ్రహించితివా ? స్వేచ్ఛానిరోధము సంభవించు నేమో యను భయముచేతనే గదా ?

పంజరములో బడి పాలు, పండ్లు, మిఠాయి దినుచున్న శుకముగూడ సమయము జిక్కినచో బారిబోవుటకే సంక

ల్పించుకొని యుండుటెందుచేత ? ఎన్ని మిఠాయిలు తినినను, ఎన్ని పాలు గ్రోలినను నది సంతసించుచున్నదా ? చచ్చిపోయిన స్వాతంత్ర్యజీవనమును బునర్జీవితముగాఁ జేసికొనుటకై యత్నించుచున్నదా ?

బోనులోబడ్డ సింహామెందులకై యేడ్చుచున్నది ? పారతంత్ర్యమున బడియుండవలసి వచ్చినది గదా యనియేనా?

మాధుకరవృత్తిచే నైనను జీవించుట దుర్ఘటమగు భిక్షుకుఁడు నిగళబద్ధుం డైనచో నెంతగా బొగులునో చూడుము. దొరతనమువా రింతకలియో, గంజియో బోసినఁ జాలునని యాతఁడు సంతసించువా ? ఆగంజినీళ్ళు దొరుకకున్నను సరియే స్వేచ్ఛ లభించిన జాలునని యాతఁ డాస్వేచ్ఛకై బొగులును.

పావులాడబ్బుల జీతగాఁడు మొదలు పదిలక్షుల రూప్యముల జీతగాఁడువఱకును గూడ స్వేచ్ఛను జంపుకొనవలసి వచ్చెగదా యని సమయమువచ్చినప్పుడు విచారింపక మానఁడు. స్వాతంత్ర్యము—అబ్బ దానిలో నున్న సుఖమిట్టిదని వర్ణింపఁదరమా ?

పరమేశ్వరుని సృష్టిలో—యీయనంతకోటి బ్రహ్మాండములలో—అనంతకోటి జీవరాసు లున్నవి గదా ? వీనిలో స్వాతంత్ర్యాభిలాష లేని ప్రాణమేదైన నున్నదేమో యించుకాలోచింపుము.

ప్రతిప్రాణికిని యాహార మెంత ముఖ్యమో—స్వేచ్ఛ యంతగత్యము.

ఒక్కొక్కప్పు డాహారములేకున్న మానె—స్వేచ్ఛ యున్న జాలునని యనుకొనని ప్రాణి లేదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఇట్టి స్వేచ్ఛాభిలాష—ఇట్టి స్వాతంత్ర్యేచ్ఛ—ఇట్టి సుఖజీవనోద్దేశము—నీకుఁ దయింపకుండు టెంతయు శోచనీయము గాదా ?

నీతండ్రి మాకు స్వేచ్ఛావిరోధము గల్పించి బంధించుటచేతనే—మేము ప్రస్తుతము నీవు నీతండ్రి యనుకొని మఱి యుచున్నవానికి సహాయం బొనరించి నీతండ్రిని మట్టుబెట్టి మేము బయటఁబడితిమి. కొంచె మించుమించుగా నాఁటినుండియు మేమీచోరవృత్తిచేతనే జీవించుచుంటిమి. మమ్మెవ్వఁడైన బట్టఁగలిగెనా ?

నీకుటుంబవినాశనమునకు మేముగూడ కారకులము గావలసి వచ్చినది గదా యని చింతించి—నీస్వేచ్ఛాజీవనమున కంతరాయము గలుగజేసితిమి గదా యని దలంచి—నీకిప్పు డీయుపకార మొనర్చి—మాపాపపంకిలమును దుడిచివైచుకొన సంకల్పించుకొనియే నీయునికి దెలిసికొని—నిన్ను గనిపెట్టి—ఎట్టకేలకు మాయుద్దేశమును నీకెఱింగించితిమి.

మే మెటింగించిన దంతయు బాగున్నదంటివి. మాయభి ప్రాయమున కెంతయో సంతసించితివి. మాశ్రమకు దగిన ఫలముగూడ నొసంగెదనంటివి. మాయిష్టానుసారముగా నడ చెదనని వాగ్దానముగూడ నొసంగితివి. ఇన్నియు నైనవెనుక నీవొనరింపవలసిన కార్యక్రమమంతయు విని సంశయింతు వేమిపాపము! భయపడుదు వేమికర్మము! ఆలోచింతు వేమిగతి?

మాయిష్టానుసారముగా నీవొనరింపకున్న నీకిఁక ని ష్కృతిలేదు. మాయుపదేశానుసారముగా నీవునడచి- నీజన కుని యాత్మకు శాంతిగూర్పుము. మాపవిత్రోద్దేశమును గ్రహించి పనిచేసి తగినస్వేచ్ఛ బడయుము. అదియొక్కటి బడ సిన నీకన్నిసౌఖ్యములును గలిగినవనుమాటయే.

నీనిజచరిత్రము నీకు దెలియనంతకాలము నిన్ను బెం చినవారే నీతలిదండ్రులని భావించితివి. సర్వమెఱింగినపిమ్మ టట్లుభావింపగలవా? నీయంతరాత్మ యందులకు సమ్మతిం చునా? లెమ్ము. నీకుగానివారిపీచ మణచుము. నీజనకుని కీ ర్త్యున్నతులు నిల్పుము. ఇదిగో! ఈసీసాబట్టుకొని నీవింక బొ మ్ము. కథాకథనములోనికి దిగకుము. పదిమందిని జంపినగాని పారతంత్ర్యపిశాచ మంతర్ధానము గాదని యధైర్యపడకుము. పనివచ్చినప్పుడు పదియైనను నొకటియే- పాతికయైనను నొ కటియే- పాతికలక్షలైనను నొకటియే. దానికై వెఱువకుము.

ఒక్కని జంపుటకునే నీకీసంశయము. అదియైనతరువాత నా? లక్షమందిని జంపుటకైనను వెనుదీయవు. ఏమందువు ? ఇంకను సంశయింతువా? సంశయములకెల్ల జలాంజలియొసంగి- ధైర్యమే సాహంబని యత్నింతువా? ఏదియో యొకనిశ్చయవార్త నెఱింగింపుము. నీకీయత్నమున సర్వదిగ్విజయము తీరునని నమ్మెదము.”

అని వారూరకొనిరి. ఆవాక్యము లింతవఱకోరిమితో నాలకించుచున్న వ్యక్తి యావిషయములన్నియు మనమున బాగుగా నన్వయించుకొని- న్యాయాన్యాయములు విమర్శించి- లాభాలాభములు గుణించి- యొక్కచిఱునవ్వునవ్వి——

“హితులారా! ఇంక నాకెట్టిసందియమును లేదు. నేటినుండియు మనకార్యసానుకూలమునకై యత్నించెదను. తదేకదీక్షతో నాలోచించుచున్నచో దగినసమయము లభ్యముగాకమానదు. ఆయవకాశము లభించినవెంటనే నలు నష్టకష్టములపాల్పఱచిన కలిపురుషునట్లు యూకుటుంబమెల్ల సర్వనాశనమొనరించి, ఘోరనరకముకంటె నెక్కుడు పగవహించి జయించి నాపగదీర్చుకొని నాజనకుని యాత్మకు శాంతిగూర్చి- నాజనకుని కీర్త్యున్నతులు వన్నెకెక్కునటులజరించి మీ మెప్పుగాంచకున్న- నాతలిదండ్రులు నాకుంచిన నామమున నన్ను బిల్వకుఁడు. నాయెడల విశ్వాసముతో జరింపకుఁడు. వేయేటికి? లెక్క పన్నెండుదినములలో నే నీకార్యమునకు

గడంగకున్న మీరు నాయాస్తి సర్వస్వము దోఁచికొనుడు. సరియా?"

"సెబాస్. నీదీక్ష బాగున్నది. మేమిరువురమును నీకంగరక్షకులముగా నాయాప్రాంతములయందే సంచరించుచుందుము. మాకెప్పటిసమాచారమప్పు డెఱింగించుచుందుము. నీవ్రువచ్చి తడవైనది పోదమురమ్ము."

అని వారిద్దరును మఱిమాటలాడకుండ వెడలిపోయిరి.



# కాలహర్మ్యము

## ప్రథమఖండము.

## మొదటిప్రకరణము.



### ఆయువతి యెవ్వరు?

ఆనాఁడు శనివారము. నాఁడు పిఠాపురమున గొప్ప పసువులసంత జరుగును. నాఁటిసంత కెక్కడెక్కడలేని జనము బిఠాపురము వత్తురు. నాఁడుగూడ చాలమందివచ్చిరి. ఆనాఁడే కలకత్తాపురంబుననుండి వచ్చిన హారకుమారబాబుగారి యుపన్యాస మైదుగంటలు మొదలు రైలుస్టేషను సమీపమునఁగల బయలులో జరుగునని బ్రకటించిరి. "స్వాతంత్ర్యజీవనము- దానియుత్కృష్టత" అనువిషయమునుగూర్చి చక్కని యుపన్యాసమిత్తురని విని చాలమంది యాసభకువచ్చిరి. సభ జయప్రదముగా జరుగుచున్నది. సుమారు రెండు

మూఁడువేల ప్రజలు వచ్చుటచే సభ చాలశోభస్కరముగా నుండెను. ఉపన్యాసవిషయముగూడ మంచిదగుటచే నెవ్వరును గదలుటలేదు.

సంతపనులన్నియు ముగిసినవెనుక యెల్లరును భోజనాదికములు నిర్వర్తించుకొని ద్రాక్షారామసంతకు బోవ్రుటకై బయలుదేరిరి. ఆదినములలో పెద్దబజారువీధి మరమ్మతు గోరుటచే గోటదగ్గఱనుండి రైలుకుబోవురోడ్డుననే బశువులను మరలించిరి.

సరిగా నీసమయమునకే విశాఖపట్టణమునుండి వచ్చెడి రైలువచ్చి- దిగవలసిన జనమును దింపి- ఎక్కించుకొనవలసిన జనము నెక్కించుకొని వెడలిపోయెను.

సరిగా నాసమయముననకే హరకుమారబాబుగారి యుపన్యాసముగూడ ముగియుటచే నీరెండుమూఁడువేల మందియు రాజబాటపైకి పోయిరి.

ఇట్టిసమయమున నారాజబాట యెట్లుండునో చెప్పవలయునా ?

ఒంటెద్దుబండ్లవారి తప్పుకో- తప్పుకో- యనుకేకలును- జట్కాబండ్లవారు గిరగిర దొర్లుచున్న చక్రముయొక్క యాకులకు కొరడాకఱ్ఱ మొదలు తగిలించుటచే "టకటకటక" మనుధ్వనియు- ద్విచక్రశకటములకుండు గంటలయొక్క గణగణలు- గుఱ్ఱపుబండ్లవారి యేయేయని దిక్కు

లు పిక్కటిల్లజేయు కేకలును- మోటారుకారుల బర్రి బు
ర్రిలును- వీనినన్నిటినిగూడ నణచివేయఁగలిగినట్టి ప్రజల
యొక్క రొదయును గలిగి చాలగడబిడఁగానుండెను. "చెట్టా
పట్టాలు" వైచికొని నడచువారుఁగూడ నీజనముల త్రొక్కు
లాటలో- ఈబ్రహ్మగడబిడలో- మోటారుకారుల యడావుడి
లో- ద్విచక్రశకటముల పనిలేని తొందరలలో- నడచుచు-
నడచుచు- పనిలేనిదే బాటమధ్యకువచ్చి యచ్చట గడబిడ
లకు కంగారుబడు పశువులగందరగోళములో- విడిపోయి- మ
రల గృహమునకరిగిగాని వారు గలసికొనకుండునంతటి దూర
మయిపోవుచుండిరి-

ఇట్టిసమయంబున:—

"పట్టుకో—ఆమోటారుపట్టుకో- అయ్యయ్యో!.....
పాపమెవ్వరో మోటారుక్రింద బడిపోయినారు. మనుష్యులు
ముందునకు రాకండి. రాకండి."

అనుకేకలు బయలుదేరినవి. వెంటనే నల్వురును నా
లుగుమూలలను నిలచి జనమురాకుండ జేయుటచే నామనుజుఁ
డు బడియున్నస్థలమున కైదాఱుగజములచుట్టును గాళీయై
నది. పదిగజములదూరములో మోటారుకారులుగూడ నాగి
పోయినవి. మనుజులు మూగిపోకుండఁ బైవారు కర్రలసహా
యమున గాచుచుండిరి.

మోటారుకారులోనుండి దిగినయువకు లిరువురును మెల్లగా నాపడిపోయినవాని దరికరిగి వానినిఁజూచి పోల్చుకొని:—

"బలవంతరావుబావా! మనపారిబ్ధముగోలఁదియు నీబడిపోయినవాడు నీతండ్రిగారేనోయి. అయ్యయ్యో! ఎంతప్రమాదమువచ్చినది?" అనియనెను.

"ఆఁ......ఆఁ......నా తండ్రిగారా? హా! బాబయ్యా!" అని మీఁదఁబడియెను. రాజారావాతనిని బైకిలేవదీసి నిలువంబెట్టి:—

"నీకేమి చాదస్తమా బావా? ఇంతగాఁ తృియునకే నీతండ్రిగారి కపాయము గల్గుననుకొంటివా? ప్రమాదవశంబున నించుక దెబ్బలు దగిలియుండునుగాని- ప్రాణాపాయకరమగు దెబ్బలుతగులలేదు. ఏమైనను మామగారిని వెంటనే యాసుపత్రికి దోడ్కొనిపోవుట మంచిదిగాని వలపోయుట మంచిదా? లెమ్ము. ఈచలనహేతుకస్థానముపై మనడాక్టరు సంజీవరావుగారింటికి మీతండ్రిగారిని దీసికొనివెడలుదము."

అని వెంటనే యాతని నాకారులోఁ బరుండబెట్టి ప్రక్కనందుగుండ డాక్టరుగారింటికి బోయిరి.

'దరిద్రుఁడు తలగడిగిన వడగండ్లవానఁగురిసిన' దని నట్లాడాక్టరింటియొద్ద లేకుంటచే నామోటారుకారు తిన్నఁగా వారింటికిబోనిచ్చి డ్రైవరును రాజారావు బలవంతరావులు

ను గలసి యాదెబ్బలు తగిలినవాని నింటిలోనికి దోడ్కొని పోయి యొకచో బరుండఁబెట్టిరి.

రఘునాథరావునకు మోటారుదెబ్బలు తగిలినవని యూరెల్లరకును నిమిషములో దెలిసినది. ఇటువంటివార్తలు వాయువుకంటెను వేగముగా వ్యాపించునుగదా?

ఈ రఘునాథరావునకు దెబ్బలుతగిలినవనియు- నింటిలోనికి తీసికొనివచ్చి బరుండబెట్టిరనియు దెలిసికొని స్త్రీజనమెల్ల గొల్లుమనిరి.

వెంటనే రాజారావు స్త్రీజనమునూరార్చి- ప్రాణభయములేదని ధైర్యముగొల్పి- ఒకటిరెండు కవుకుదెబ్బలు మీగాళ్ళపైనను, పిక్కలుమీదను మాత్రమే తగిలినవని చెప్పి చూపించి- కొంచెమెత్తుపట్టియుండలగుండచే నాయాస్థలములయందు గాయములని తనచెల్లెలును- కామేశ్వరరావు సర్ధాంగియును నగు శ్యామల కాజ్ఞాపించి కామేశ్వరరావు తల్లియు, రఘునాథరావు భార్యయునగు కాంతమ్మను గాంచి—

"అత్తగారూ! మామగారేల నిట్టి యసమయమునందిలు విడచిరి?" అని ప్రశ్నించెను.

"నాయనా! బలవంతరావును వెంటబెట్టుకొని నీవు కాకినాడవెడలితివి కామేశ్వరా వైనుగంటల కిల్లువిడచెను. మీయింటికులోనికిబోయెనో? మరియెక్కడకు బోయెనో తెలియదు. ఆయుష్కరమొదలు మామామగారికి దగ్గ యెక్కువై

నది. దానికితోడు మలమూత్రబంధనమైనది. కుమారులిరువు రింటియొద్ద లేకుండుటచేతను- తమతండ్రిగారికి బాధహెచ్చు టచేతను- సంజీవరావుగారిని దీసికొనివత్తునని బయలుదేరి యిట్టిప్రమాదమునకు లోనయిరి." అని కాంతమ్మయనెను.

అచ్చటనే తనమామగారినోటఁ బాలువాయ నెట్టుమట్టిపో డిచే గాచుచున్న శ్యామల తన యత్తగారివైపు దిరిగి-

"అత్తా! మామగారించుక పాలు దాహమడుగుచున్నా రు" అని చెప్పెను.

వెంటనే యచ్చట కాగి చల్లారుచున్న పాలలోనివి కొ న్నిదీసి మరికొంచెము చల్లారబెట్టి కాంతమ్మ స్వయముగా భర్తకు దాహమిచ్చెను.

పాపము వృద్ధుఁడై రోగార్తుఁడై మంచముపట్టియున్న మాధవరావు తన కుమారుఁడగు రఘునాథరావు మోటారు క్రిందఁబడుటచే దెబ్బలుతగిలినవని రాజారావు కాంతమ్మల సంభాషణవలన దెలిసికొని గద్గదస్వరముతో:—

"ఏమమ్మా! కాంతం! అబ్బాయికి దెబ్బలుతగిలినవా? ఎంతప్రమాదము వచ్చినది. వాతసమయములందీ యుబ్బస ము హెచ్చుగానుండుననియు- మలమూత్రములవిషయమై మనమంతఁగా భయపడవలసిన పనిలేదనియు- కొలఁదిసేపటి కవియే దోవలోబడుననియు నేను జెప్పుచున్నను వినక- ఆరముగ్గినపండు రాలిపోవునేమోయని- వెర్రితండ్రి భయపడి

యీ ప్రమాదము దెచ్చికొనెనా? అంతగట్టిదెబ్బలు తగుల లేదుగదా?"

అని దగ్గుచు- నొగర్చుచు- చేతికఱ్ఱ నాధారముగాఁ జేసికొని మెల్లమెల్లగా వచ్చుచుండెను. వెంటనే రాజారావు వెడలి తాతగారినిబట్టుకొని మెల్లగా నడిపించుచు:—

"తాతగారూ! మామగారి కంత ప్రమాదకరమగు దెబ్బలుతగల లేదు. కాని కొంచెము పెద్దలగుటచే నాదెబ్బలకే సోలిపోయిరి. అందులకే యెత్తుమట్టియుండలగుండతోఁ గొలఁది గా కాపటము బెట్టించినాను. అయిదునిమిషములయి మామ గారించుక పాలు దాహము బుచ్చుకొనిరి. ఇక్కడికి వచ్చిన ప్పటికంటె యిప్పుడు సుఖముగానున్నారు. డాక్టరుగారువచ్చి తగినపట్టువేసినచో నుదయమున కెప్పటివలె లేచి తిరుగుదు రు" అని యనెను.

మాధవరావు మెల్లగా కుమారునిమంచముపైఁ గూ ర్చుండెను. శ్యామల కాచుటమాని నిప్పులును, గుండయు బెరటిలోనికి బట్టుకొనిపోయెను.

వృద్ధుఁడగు మాధవరావామంచముపైఁగూర్చుండి కు మారునిదెబ్బలు చేతితోదడుముచు—"నాయనా! నాయనా! నీశరీరమున నెట్లున్నది?" అని యడిగెను.

కాని రఘునాధరావేమియు మాటాడలేదు.

"ఎట్లయినను వయసుముళ్ళిన వెనుక దగిలిన దెబ్బలగు టచే నించుక సేదదేరినగాని మామగారు మాటాడజాలరండీ" అని కుమారమాధవరావు నెత్తుకొని సుభద్రయనెను.

సుభద్ర రఘునాథరావుగారి రెండవకోడలు. ఆమెకొక కుమారుడుదయించెను. ఆతనికి ముత్తాతగారగు మాధవరావుపేరే బెట్టిరి. ఆపిల్లవాని కిప్పుడు మూడవనెల.

"చింతపండుముగ్గు దీసివేసినచో దెబ్బలించుకతగ్గి బాధపెట్టకుండనుండునేమో?" అని రఘునాథరావుగారి కుమార్తెయగు పార్వతియనెను. ఈమె వివాహాయుక్తవయస్కయైయుండెను.

"చిన్నచిన్న బెణుకులకును, చిన్నచిన్నదెబ్బలకును, నది పనిచేయును గాని యిట్టి కవుకుదెబ్బలకది పనిచేయదు. డాక్టరుగారు యింటలేరు. గొల్లప్రోలువెడలిరట. రాగానే యిక్కడకు పంపించవలసినదని యింటియొద్ద నొక్కి-నొక్కి-చెప్పి వచ్చితిని. వారు తప్పకవచ్చి పరీక్షించి తగినపట్టు వేయుదురు." అని రాజారావనియెను.

"కామేశ్వరరావేడీ?" అని మాధవరావనియెను.

"ఏమో? ఐదుగంటలకు వెడలెను. ఇంకను రాలేదు" అని కాంతమ్మయనెను.

ఇంతలో నొకమోటారువచ్చి వీధిలోనాగెను. దాని

నుండి డాక్టరు సంజీవరావును కామేశ్వరరావును దిగి లోనికి వచ్చిరి.

నిముషములో నడచినవృత్తాంత మెఱుంగఁజెప్పి రఘునాధరావును బరీక్షింపుడని రాజారావుచెప్పుచు రఘునాధ రావుగారి మంచముదగ్గఱగా నొక కుర్చీవైచెను.

డాక్టరు సంజీవరావా కుర్చీపైఁగూర్చుండి పెద్దకాతులాతని దెబ్బలన్నియు బరీక్షించుచుండెను. తన పరీక్షలన్నియు ముగిసినవెనుక:—

"మరేమియుభయములేదు. నేనింటికివెడలి తగిన మందు లోనికిని- పైకినిబంపించెదను. అంతగాగోరినచో మఱల పాలేయొసంగుఁడు. లోనికిచ్చునుంటు మూఁడుగంటల కొక మారొసంగుఁడు. ఒడలుదెలియని నిదురబట్టినచో లేపకుఁడు. లేచినప్పుడు మందు నిచ్చుటమానకుఁడు. పైమందు గాయములకు పట్టించుఁడు. కామేశ్వరరావూ! నీవు నా వెంట రమ్ము- మందులొసంగెదను." అని డాక్టరుగారు లేచి:—

డాక్ట—ఏమండి తాతగారూ! తమరెట్లున్నారు ?

నాధ— నేనేమైననేమి బాబూ! మావానివిషయమై యించుక శ్రద్ధవహింతురు ?

డాక్ట—ఇంతమాత్రమునకే భయమా ? వారు రేపుదయమున లేచి యధాప్రకారముగా దిరుగగలరు ?

కాంత—మామగారి కీపూట దగ్గు యెక్కువైనది. మలమూత్రములు బంధించినవనుకొంటిమిగాని తరువాత నా యనుమానము భగవత్కృపవలన దీరినది. ఒగర్పుకూడ లేచి నది. ఏమియు తోచుటలేదు. ఏదో మీారించుక శ్రద్ధవహిం చినగాని.........

నా......న్నా......ప్రా...ణ...ము...పో...పో...పిల్ల లు...జా...గ్ర...త్త......

అని యస్పష్టముగా రఘునాథరావనియెను.

అందఱును కంగారుబడిరి. వెంటనే డాక్టరు నాడి శరీ క్షించి:—

"అయ్యయ్యో!...ప్రమాదము వచ్చుచున్నది? ఏమి జరిగినదో నాకు సరిగాఁ జెప్పుడు. బలవంతరావుగారూ! కారు లో నాచేతిపెట్టెయున్నది త్వరగా దెమ్ము. ఎవరైనను కొద్దిగా వేడినీళ్ళు తెండు." అనెను.

"ఏమి? ఏమి? ఏమి వచ్చుచున్నది బాబూ!" అని రుద్ధకంఠస్వరముతో మాధవరావు చతికిలబడియెను.

ఇంతలో బలవంతరావు చేతిపెట్టె దెచ్చియిచ్చెను. కాంతమ్మ వేడి నీళ్లుదెచ్చెను. డాక్టరుగా రేదియో మందు దీయుచుండిరి.

రఘునాథరావు లేచుటకు బ్రయత్నించియు లేవజాల క సమీాపముననున్న తండ్రిపై జేతులువైచి...త...తం...డ్రీ..

పి...ల్ల...లు...పా...ర్వ...తి...అం...తె...అని గ్రుక్క తేల వైచెను.

ఇంజక్షనీయవలయునని డాక్టరు సమీపించి చేయిబట్టి, మిం- చి- పో- యి- న- ది- అనియస్పష్టస్వరముతో నని చేయి విడచివైచెను.

ఆవాక్యము లాలించి యెల్లరును గొల్లుమనిరి.

ఇంతలో పోలీసుసబుయినస్పెక్టరగు నారాయణస్వామి యిరువురు భటులతో లోనికివచ్చి—"ఏమండి డాక్టరుగారూ! చాలప్రమాదము జరిగినదే పాపము. రఘునాధరావుగారంతటి మంచివారిని నేనుచూడలేదండి. ఇట్టి సుగుణాత్మునకు విషముబెట్టిన దురితాత్ము లెవ్వరో గనిపెట్టవలయును." అని యనెను.

"హా! ఇ-ది-యొ.క-క్రొ త్త-యా-ప-దా ?" అని యార్చుచు గాంతమ్మ పడిపోయెను. డాక్టరు వెంటనే వీధి లోనికి వెడలి మోటారుడ్రైవరును బంపి యేమేమియో కొన్ని మందులును, యెనీమాసామానును దెమ్మని లోనికివచ్చి తానిదివఱకు సిద్ధపఱచియుంచిన యింజక్షనిచ్చివైచెను.

నిముషములమీాద డ్రైవరు కాంపౌండరుతోడను మందులతోడను వచ్చివ్రాలెను.

"కాంపౌండరూ! నీ వెనీమాచేయుటకు సిద్ధముగా నుండుము." అని యాజ్ఞాపించి తానుదెప్పించిన మందింజక్ష

నిచ్చుటకు బ్రియత్నము చేయుచుండెను.

ఇంటిలోనివారి గోలవిని మాధవరావునకు బ్రాణము మీఁదికి వచ్చినదని గ్రహించి యిరుగుపొరుగువారు లోనికి రాఁబోయిరిగాని నారాయణస్వామివెంట వచ్చినభటులు డాక్టరుగారి యనుమతిపై వారి నడ్డుకొనిరి.

కొలఁదిసేపటిలోనే యింజక్షనయినది. ఎనీమాప్రయత్నము వ్యర్థమయినది.

ఇంచుక నిదానించి చూచి నాడిచూచి—"అంతయు బూర్తియైనది. లాభములేదు. క్రిందకి దింపివేయుఁడు." అని విచారముతోనని డాక్టరు చతికిలబడెను.

నారా—మీరు ప్రయత్నముచేయుచుండ వలదనుట భావ్యముగాదని యూరకుంటినిగాని యీతని గర్భాశయములోనికి బోయిన విషమీతనిని మఱల బ్రదుకనిచ్చునదిగాదఁట.

రాజ—మామామగారికి విషప్రయోగము జేయబడినదందురా?

నారా—అనియే తెలిసినది.

రాజా—ఇది విరుద్ధము. మామామగారు పోయినట్లింకను మేము వ్యక్తపరచుకొనకపూర్వమే మీరువచ్చితిరి. ఇరుగుపొరుగువారుగూడ శతవృద్ధుండగు మాతాతగారు ప్రాణాపాయస్థితియందుండిరేమోయని వచ్చిరిగాని మామగారి దుస్థితి తెలిసిగాదు. అట్టిది మీరు మీయింటియొద్దనో, స్టేషను

లోనోయున్న మీకెట్టీవార్త తెలిసినది. అందున విషప్రయో
గమునియు, నదినిమూషములమీఁదఁ బ్రాణము దీయుననియు
నెట్లు తెలిసినది. నమ్మట కవకాశమైన నుండవలదా ?

నారా—అయ్యా! ఈప్రశ్న నన్నడుగుదురని యను
కొనియేయున్నాను. విధానము తెలియనివారి కిది నమ్మనర్హ
ముగాని మాటయే. కాని మీసంశయనివృత్తి చేయఁగల
యీచిన్నకాగితపుచీటిక నొకమారు బరిశీలింపుఁడు." అని నా
రాయణస్వామి యని యాయుత్తరమును రాజారావున కొ
సంగెను.

ఆయుత్తర మందుకొని యిట్లు పఠించెను.

రఘునాథరావుగారి కీనాఁటిరాత్రి సుమారు 9 గంట
లకు మార్ఫియాయను విషము గలిపినపాలు వానిభార్య దా
హమిచ్చినది. మొదలే విషము. అదియు హెచ్చుపడుటచే నా
తఁడిఁక జీవింపఁడు. వెంటనే వెడలి పాలు పరీక్షింపుఁడు. శవ
మును గోయుఁడు. ఆలసించిన కేసు దొరుకదు. ఇంకైదునిమి
షములలో నాతఁడీ లోకము విడచిపోవును. త్వరపడుఁడు.
గం 9-10 ని॥ మీపూర్వపరిచితుఁడు.

రాజా—అయ్యా! ఇది యద్భుతముగా నున్నది. ఇది
వ్రాసినవాఁ డెవ్వఁడో మీపూర్వపరిచితుఁడటగదా? ఆత
నిని మీరు చూచితిరా?

నారా—నేను భోజనమొనరించి పెరటిలో జేయు

కడుగుకొనుచుండఁగా నెవ్వఁడోవచ్చి యీకాగితమిచ్చి జరుగురుగా నాకిమ్మని వెడలిపోయెనట. ఈతఁడు నాకెట్టి పరిచితుఁడో నేనెఱుంగను. నేను లోనికిరాఁగానే యీయుత్తరమును మావాఁడు నాకిచ్చెను. వెంటనే బట్టలువేసికొని వీరిని వెంటదీసికొని వచ్చితిని.

రాజా—మీ యిల్లిచ్చటి కెంతదూరము?

నారా—రెండుమూఁడు ఫర్లాంగులుమాత్రమే.

రాజా—మీకీ భటులెక్కడ తారసిల్లిరి?

నారా—ఒకనికి మావీధిని 9½ గంటలవఱకు బీటు. రెండవవాఁడు మొదటివానిని రిలీవుచేయుటకై వచ్చుచుండెను. ఇరువురను దీసికొనివచ్చితిని. నన్నిట్లు ప్రశ్నించుచున్న మీ రెవ్వరో తెలిసికొనవచ్చునా?

రాజా—నేను- యీరఘునాధరావుగారి ప్రధమపుత్రుఁడగు కామేశ్వరరావు పినమామగారి కుమారుఁడను. నాపేరు రాజారావు. నేను రహస్యాపరాధపరిశోధకుఁడను.

నారా—అట్లనా? తమ రేజిల్లాలోఁ బనిచేయుచుందురు?

రాజా—దొరతనమువారి యుత్తరవుమీఁదగాని- లేక నేను స్వంతముగాఁ గోరికొనిగాని యీమదరాసు ప్రెసిడెన్సీలో నెచ్చటనైనను బనిచేయవచ్చును.

నారా—అయ్యా! తమకు దెలియని ధర్మములులేవు.

ఇప్పుడీ శవమును వైద్యాలయమునకుఁ గొనిపోకతప్పదు. ఈ తఁడు బుచ్చుకొనఁగా మిగిలినపాలుగూడ పరీక్షింపవలసియున్నది. కావున దరువాయికృత్యములకు సెలవొసంగుఁడు.

పాఠకమహాశయులారా! విచారకరమగు నీయంశమును విపులముగా వర్ణించి మీకు విసుపుగల్పింప నిష్టములేక తరువాయిగాథలోనికి బోయెదను.

ఎట్లయిననేమి? పోలీసువారి పంతమే నెఱవేరినది. విషయములన్నియు దెలిసిన రాజారా వీవిషయమునను వారి నభ్యంతరపరుపఁ జాలకపోయెను. శవమును, బాలును, వైద్యాలయమునకు బోయినవి.

మరునాఁడు పదిగంట లగునప్పటి కన్నియు బూర్తియైనవి. డాక్టరు సర్టిఫికేట్టుతో వచ్చెను. రాజారా వదిచూచెను. అందిట్లున్నది.

ఈతఁడు నిశ్చయముగా బాలలో గలిసిన విషముచేతనే మరణించెనుగాని నిన్న తగిలిన దెబ్బలవలన జావలేదనియు చచ్చుట కవకాశమగు దెబ్బలుతగులలేదనియు- నీతఁడు తాగఁగా మిగిలినబాలు పరీక్షింపఁగా నవియు విషాక్తములైయున్నవనియు నేను సర్టిఫికేట్టు నిచ్చుచున్నాను.

Dr. Kutumba Rao, L. M. S.,
Pithapur.

అన్నియు నైనవెనుక రాజారావు నారాయణస్వామి గారిని గలుసుకొని యొకరహస్యస్థలంబునఁ గూర్చుండఁబెట్టి యిట్లనియెను.

అయ్యా! నాయుద్యోగధర్మమునుబట్టి మీతో నించుకప్రసంగింపఁదలంచి మీచెంతకువచ్చితిని. నావిన్నపమును సావధానచిత్తులరై వినఁగోరుచున్నాను. ఈ యింటివారితో నాకుగల సంబంధమును మీకు దెలిపియే యున్నాను. ఈ కుటుంబములో నెవ్వరో నష్టము కలుగఁజేయుచున్నారని యూహించుచున్నాను. అట్టులే గానిచో నిట్టి దుష్కరణము తటస్థించుటకవకాశము లేదని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. కాని యింటిదొంగ నీశ్వరుఁడైనను బట్టలేడనినటుల నీదొంగనుగని పెట్టుటగూడ దుష్కరమగును. అయినను నాబుద్ధి నంతయు వినియోగించి విశ్వప్రయత్నమొనరించి- యాదొంగను బట్టి యురికంబ మెక్కింప సంకల్పించుకొనియుంటిని. కడచిన రేయి యొక చిన్ననాటకము మీగృహమున నాడిరి. వారెవ్వరో గనిపెట్టుదమని యత్నించితిని గాని సానుకూలపడదాయెను. ఆ నాటక మేమందురా? అర్ధరాత్రియు మీరినవెనుక నేను పెరటిలోనికరిగితిని. అసమయముననే యిరువురు ముఖాచ్ఛాదనములతోఁ బ్రహరీగోడ దాఁటుచుండిరి. వెంటనే పిస్తోలుపయోగింతమా యని యనుకొనుచుండ మేఘఘర్జనస్వనముతో—

"రాజూ! రెండుమూఁడు దినములలో నీమరణశాస

నము దయాచుజేసికొమ్ము" అని వారు గుభాలున గోడదాటి వెడలిపోయిరి. నేను వెంటనే వెన్నాడుటకై యత్నించితిని గాని వారెవ్వైపునకు బోయిరో తెలిసినది గాదు. ఇంటిలోని వా రెవ్వరో బైవారికి గుట్టుమట్టు లిచ్చుచుండి రను ననుమానము నన్నొక్క నిముషమైనను విడచుటలేదు. అందుచే నా సమయముననే యింటిలో నిద్రించువారి నెల్ల బరీక్షించితిని. అందఱును గాఢముగ నిద్రించుచుండిరి. కాని యొక యువతి మాత్రము—

"యువతియా?" అని నారాయణస్వామి యాతురతతో మాటమధ్య బ్రశ్నించెను.

"అగును. ఆమె యువతియే. ఆమె నామ మింతట వెల్లడించను. నిదర్శనములు దొరకనిదే నామము వెల్లడింపను. అందుచేతనే నేనాయువతి కంటబడలేదు. ఆమె యింకను రెండు మూడుమారులు బరీక్షించి కాని బయటబెట్టుటకవకాశము లేదు. తపారిపోయిన వారామె సంబంధీకులేమో యని భయముగా నున్నది. అదిగా కామె దోషియో—నిర్దోషియో నిర్ధారణజేయుట కాధారములు లేవు. ఆమె నిర్దోషిగాక—దోషియేయైనయెడల నామె కాయినపురే గాక—యింకను బెక్కుమంది సహాయులుండి యుందురు. ఒక సంసారయువతి కాయధములతో సంబంధ మెట్లు గుదిరినదో తెలియదు. ఈపై విషయములలోని సత్యసారమును దీయుటకు నేను స్వయ

ముగా నీకేసులో బనిచేయ సంకల్పించుకొని యున్నాను. అం దుల కధికారమును బడయుటకై యిప్పుడే కాకినాడ D. S. P. ఆఫీసునకు వెడలి దొరగారితో మాటలాడి వచ్చెదను. ఇప్పటి D. S. P. గారు నాశక్తిసామర్థ్యములు బాగుగా నెఱింగినవారే గావున నాకట్టి యధికార మొసంగి తీరుదురు. నేను కాకినాడ నుండి తిరిగి—రాత్రికిగాని—రేపుమధ్యా హ్నమునకు గాని వచ్చెదను. ఈలోపున మీరించుక శ్రద్ధ వహించి యీయింటికి రహస్యముగా "బనారా" నిచ్చు చుండుడు. ఏదేని యనుమానించుటకు దగిన ప్రబలాధార మె ద్దియైన దొరకినచో—సాక్ష్యమున్నచో—వెంటనే మీకను మానముగా నున్నవారిని బంధించుడు. అనుమానము దగి లియు బంధించుట కవకాశములు జిక్కకున్నచో నూరకొ నుండుగాని—యల్లరిబెట్టి కేసుమాత్రము బాడుచేయకుండు."

ఈవాక్యము లాలించి నారాయణస్వామి—

"మీరనుమానించిన స్త్రీనామ మెఱింగిన మాప్రయ త్నమున కనుగుణ్యముగా నుండదా ?" అనెను. "అట్లుగాదు. ఒకవేళ మీయనుమానమునకు గురియైనవారెవరైన దొ రకినచో—వారే నే ననుమానించిన వారైనచో—కేసుదొ రకినట్లగును. అందుచే నిప్పు డాపేరు తెలుపను. నే నిరువది నాల్గుగంటలలో దిరిగవచ్చెద. ఈస్వల్పకాలము మీరొడలెల్ల గన్నులున్నట్లు బనిచేయుడు. కీర్త్యున్నతుల గాసింపుడు.

నాకు సెలవొసంగుఁడు."

అని రాజారావు వెడలిపోయెను. ఆయువతి యెవ్వరా యని నారాయణస్వామి చూచుచుండెను.



# రెండవప్రకరణము.



## గోరుచుట్టుపై రోకటిపోటు.

రాత్రి తొమ్మిదిగంట లయినది. అనఁగా రఘునాథరావు గతించి యిప్పటి కిరువదినాల్గు గంటలయినది. కుమారుఁడు పోయిన క్షణమునుండియు మాధవరావునకు మతిలేదు. కాంతమ్మ భర్తృమరణవార్త విని యెచ్చట మూర్ఛిల్లినదో యచ్చటనుండి యింతవఱకు లేవనే లేదు. పాపము కామేశ్వర- బలవంతరావు లిరువురును గూడ పిచ్చవారై పోయి పితామహులనిని దల్లిని గనిపెట్టుకొని యుండిరి. సుభద్ర చంటిపిల్లతల్లియగుట—శ్యామలా, పార్వతు లిరువురే తమ తమ దుఃఖమును దిగమ్రింగి—చేయవలసిన యుపచారము లు చేయుచుండిరి. పాపము వారుమాత్రమిట్టి దురంతము లెప్పుడైనను జూచినవారు గనుకనా? వారుగూడ నొక కంట నేడ్చుచు—రెండవకంట దక్కిన కార్యములు జూచు చుండిరి.

కుమారుఁడు పోయిన క్షణమునుండియు మాధవరావు మందు పుచ్చుకొనలేదు. ఎవ్వరువచ్చినను మాటాడుటలేదు. లోనికి రానిచ్చుటలేదు. ఆతనికడ చిరకాలమునుండియు బని చేయుచున్న గోవిందుఁడుమాత్ర మాతనిమంచమును గని పెట్టుకొనియుండెను. ఆసేవకునియెడ మాధవరావున కెంత యో ప్రేమ. కాని యాతఁడు చెప్పినను మందు పుచ్చుకొన లేదు.

ఏడ్చుచునో - మొత్తుకొనుచునో - యింటిలోని పనులు ముగించుకొని పార్వతిని వెంటఁబెట్టుకొని శ్యామల తాతగారి గదిలోనికరిగి యాతనిపాదములచెంత చదికిలఁబడి:—

తాతగారూ! ఏమనుటకును - ఏమిచేయుటకును బాలుపోకుండ నున్నది. లోకజ్ఞానమంతగా నెఱియని యబలలము మేమేమిచేయఁగలము. జ్ఞానవయోవృద్ధులైన మీరే యిట్లధైర్యపడుట భావ్యమా? మీయట్టివా రధైర్యపడుచో - మాకు ధైర్య ముపదేశించుట కింకెవ్వరైనఁ గలరా? మిమ్మోదార్చుటకుగాని - మీకు ధైర్య ముపదేశించుటకుగాని - మేము జాలముగాని - ప్రస్తుతపరిస్థితులనుబట్టి మిమ్ముఁ బ్రార్థింపవచ్చితిమి. పెద్దవారే పిన్నలకు ధైర్యము జెప్పవలయును. పెద్దలే పిన్నల దుఃఖమార్పవలయును. మీకాభగవంతుఁ డొనర్చిన యుపకార మింతింతని నుడువుట కవకాశము లేనిదై యున్న మాట వాస్తవమే. అది మఱువదగినది గాదు. మరతమను

కొన్నను మరపురానియంశము. కాని యెట్లో మొండిధైర్య
ము దెచ్చికొని మనవలయును. మీరుగూడ పూర్ణవిచార
మునఁ గ్రుంగిపోయిరి. మంతైనఁ బుచ్చుకొనకున్న - పెద్దదిక్కు
లేని మేము కష్టనష్టములఁ బడిపోవలసి వచ్చును. అత్తగారి విచా
రమునకు బారము లేకుండెను. మామయును లిర్వురున్మాదులై
పోయినారు. మీరారు మందు బుచ్చుకొనుట మానినారు. ఇంక
మాకేమి దారి? నాచేతులార నాభర్తకు విషమిచ్చి చంపుకొం
టినని యీసాక్షిపత్రము గంటికి — మంటికి నేకధారగా నే
డ్చుచున్నది. ఈసుగుణవతి గుణమెవ్వ రెఱుంగరు? అమ్మా!
ఇదివఱకెన్నఁడును గాని మాయిట్టి వారిట్టి యకార్యమును జే
తురని యనుకొను మూఢమందద నని యెంతబ్రతిమాలినను
నామాట నేవరుఁ జేకొనుట లేదు. మీరెల్ల రిట్టి విచారసాగరమున
మునిఁగియున్న నాకుటుంబమున కింకను నెట్టి యనర్థము లు
త్పన్నమగునో యను భయము మెండుగానున్నది. ఇట్టి సందిగ్ధా
వస్థలో మీరాకు మీరావిచారమును దిగమ్రింగి మిగిలినవారికి
ధైర్యము చెప్పుడు—

అమ్మా! నన్ను బాధింపకుము. నాయట్టి యభాగ్యుఁ
డీప్రపంచమున నింకొకఁ డుండబోఁడు. నారఘుపుచేతి మీఁదుఁ
గా బోవునదృష్టము నాకు బట్టినది గాదు. నేను మిగుల దు
రదృష్టమంతుఁడను. కాటికి కాళ్ళు జాపుకొని చావో—చా
వో—యని చావునకెదురు చూచుచున్న నా కాచావు లభిం

చినదిగాదు. పాపాత్ముఁడనగు నన్నుఁగబళించుటకా మృత్యు దేవికి ధైర్యముచాలినది గాదు గాఁబోలును. నాప్రాణము లామెకు జేదైనవి. పితృవిధేయుండును- సుగుణఖనియును- లేబ్రాయపు వాఁడునునగు రఘువునుమ్రింగి- నాకెనలేనిదుఃఖమునుగూర్చి- నన్నధోగతిపాలుజేసి- యొడలుతెలియక విచారించుచున్న నన్నుఁగాంచి- మామృత్యుదేవి పండ్లిగిలించుచున్నది.

పుట్టిబుద్ధినెఱిగి నే నెవ్వారి కెట్టిద్రోహమును జేసియెఱుంగను. అట్టిదెవ్వారీ నాకొంపకారనియగ్గి దగిలించిరో నేనెఱుంగఁజాలకున్నాను. అమ్మా! మందు దీసికొమ్మనిగాని- నావిచారమును మఱచిపొమ్మనిగాని నన్నుగోరకుము. మందు దీసికొనకున్నను నేను జావను. నాయునికివలన దనలోకమేమైపోవునో యనుభయము పెంపున దక్షిణాధీశుఁడే నన్ను దీసికొనిపోక విడచినాఁడు. నాకింకేమిలోపము. రఘువుగ్రోలిన మార్ఫియాగూడ నాగర్భమున జీర్ణమైపోవును.

శ్యామలా! ఈనాఁడు నాహృద్రోగము ప్రబలినది. ఈపూట నన్నేమియు బాధింపకుము. నీయత్తగారు- తలచెడి- మతిలేక- నీలోఁగలుపుకొనిన నాప్రాణేశునినైన నాకిమ్ము. లేదా నన్నుఁగూడ నీలోఁగలుపుకొమ్ము. అని భూదేవిని వేడుచున్నదాయనునట్లు భూమినంటిబెట్టుకొని పోయియున్నది. నీతోడికోడలు చంటిబిడ్డతల్లి. ఈపార్వతి బాల. నీమనో

హాపుఁ డమాయకుఁడు. నీమరది కొంచెము గడసరియేగాని యాతఁ డన్నగారికంటె బెగ్గిలిపోవుచున్నాఁడు. నిన్నుగన్న తండ్రికంటె నీవెక్కువగా జూచికొని పూజించుచున్న నీమామగారి దుర్మరణమునుగూర్చి నీకుండువిచార మింతింతనజాలుదునా? కాని నీవేయీసంసారనౌకకిఁక చుక్కానివి. నీకు నీవేయోర్చుకొని నీదుఃఖమును నీవేదిగమ్రింగి మిగిలినవారిని మార్గములోనికి దీసికొనిరమ్ము. పొందు మీయిరువురును గూడ నిఁకబొందు.

వెంటనే యాయువతులిర్వురును మాధవరావు నానతి పాలించిరి.

ఆతరువాత మాధవరావు సమీపమున నిలచియున్న గోవిందును సమీపమునకురమ్మని బిలచి యొకచోఁగూర్చుండఁబెట్టి:—

గోవిందూ! నీకొక క్రొత్తవృత్తాంత మెఱిఁగించుచున్నాను. విచారింపక సావధానుండవై యాలింపుము. సంసారవిభాగమున కింకెంతయో కాలముబట్టను. సింహాకిశోరమన దగుమారఘువుతోడనే యీసంసారపుగుట్టు కూలిపోయినది. ఆలిచేతి కీల్బొమ్మయైన మాబలవంతరా వన్నతోనుండుట కొక్కనిముషమైన నంగీకరింపఁడు. కామేశ్వరరావుగూడ కుటుంబమును గూడఁగట్టుకొని వచ్చునంతటి నేర్పరిగాడు గాని శ్యామలమాత్రము మంచిసమర్థురాలు. ఆమెయెల్లరను మంద

లించి- సవరించి సంసారము దిద్దుకొనఁగలదు. కాని మా సుభద్ర తోడికోడలియధికారమునకు లోఁబడియుంట కంగీకరింపదు. ఇఁకనిది చక్కఁ జేయుటకేమియు సాధనము లేదు. ఎవరికడుపులో నెట్టియుద్దేశమున్నను మనకేమియు నష్టము లేదు గాని- మనుమరాలు పార్వతి- ఇంకను నవివాహిత. ఆమెను గూడ నొకయింటిదానినిగా జేసినతరువాత నిట్టిచిక్కులువచ్చినను నంతగా యిబ్బంది లేకుండెడిది. నేనింతఁగా నెందులకేడ్చుచుంటినన నిక్కమున కీరాత్రి నాకుగడువదు. ఈపైవిషయములన్నియు నూహించియే- ఈయాస్థియంతయు నాస్వార్జితముగాన- నాకుమూఁడు కాలమృత్యుగహ్వరమునఁబడిపోవుటచేతను- నాయనంతరమున లెక్కలేనన్ని తగవు లుద్భవించునని తలంచి- నాయాస్థి వీరెట్లుపయోగింపవలయునని నాయభిప్రాయమో యా ప్రకారముగా విల్లువ్రాసి సంతకము జేసి యుంచితిని. నీవు దానినొక కవరులో భద్రపరచి యీయినుపపెట్టిలో జాగ్రతపరపుము. తరువాత యనూచి దినములు బోయినవెంటనే యావిల్లు సదయహృదయ యగు శ్యామలకిమ్ము.

చూడుము. చూడుము. ఎవరో పొంచుండి మనమాటలాలించుచున్నారు. నాయూహ కది సుభద్రవోలె గాన్పించుచున్నది. పోయి చూచిరమ్ము. అని మాధవరావ నెను.

వెంటనే గోవిందు యీవలకువచ్చి చది చప్పుడుచే

యకుండ ప్రక్కవసారాలోనికి దొంగిచూచెను. అచ్చట నెవ్వరును లేరుగాని యాతలుపుమాత్రము తెఱచియున్నది. ఆతలుపు తెఱచియుంట కేమికారణమా యని దానిగుండ బోయిచూచెను.

ఆమార్గము తిన్నఁగాఁ బెరటిలోనికిబోయినది. అచ్చటనున్నయొక మల్లిపొదమాటున నెవ్వరో యిరువురుగూర్చుండి యేమేమియో గుసగుసలాడుకొనుచుండిరి. చీఁకటిలోనున్నవారెవ్వరో గోవిందు కనిపెట్టుటకై యత్నించుచుండెను. ఇంతలో నొకచంటిపిల్ల యేడ్పు వినిపించెను.

"సుభద్రా! మాధవుఁడు లేచినాఁడు. మనమిప్పు డేమనినను నిందాపాత్రులమగుదుము. తరువాత నీవిషయమై నాలోచించుకొందము. పోయి పరుందము రమ్ము."

అను వాక్యములువిని వారెవ్వరో బోల్చుకొని యథాప్రకారముగా తనయజమానిచెంతకు వెడలి తానుగనుగొని నసమాచారమెఱింగించెను.

గోవిందూ! నీకండ్లారజూచితివిగదా? ఈకుటుంబమున కీమెయే నాశనకారకురాలని యూహింతును. అయినను మృత్యుదేవియొడిలో బన్నుండి నేనేలనీపాపమార్జింపవలయును. నేనంతయు నాలోచించి వ్రాసినవిల్లేయిది. దీనికొకకవరు భద్రపరచి యిదిగో నాయీయుంగరముతో సీలువైచి యీపెట్టిలోనుంచుము, అని యాజ్ఞాపించెను.

గోవిందుఁడాప్రయత్నములో నుండెను. ఈపై వాక్యము లన్నియు పూర్తియగువఱకును బాధనంతయు సహించుకొని న మాధవరా విప్పుడాబాధ వర్ధిల్లఁగూడ ననుభవించుచుం డెను.

గోవిందుఁడెట్లో నాయర్ధరాత్రమున జిగురుసంపాదించి కవరుగట్టి దానిలో నావిల్లుబెట్టి సీలువైచెను.

గోవిందూ! నన్నొక్కమారు పెరటిలోనికి ద్వరగా దీసి కొనిపొమ్ము.

అని మాధవరావు తొందరబెట్టుచుండ గోవిందుఁడా కవరు నినుపపెట్టిలో బెట్టి పోవలయునని పెట్టి తెఱచెను. ఇంతటాతని తొందర యెక్కువగుటచేనది యట్లనేయుంచి మాధవరావును భుజములపైనానుకొని యెట్లో పెరటిలోనికి దో డ్కొనిపోయెను.

ఇంతలోననే నీలాంబరధారియగు నొకవ్యక్తి యాగది లో మిగులజాగ్రత్తగాఁ బ్రవేశించి యావిల్లుబట్టుకొని యినుప పెట్టిలోనున్న యొకనోటులకట్ట దీసికొని చడిచప్పుడులేకుండ వెడలిపోయెను.

కొంతసేపటికి విచారాక్రాంతచిత్తుఁడై కన్నులుదుడిచి కొనుచు గోవిందుఁడు లోనికివచ్చి విల్లుకొఱకై యిటునటు జూచి యది బైటగనంబడమి పెట్టిలోఁ బెట్టియుంటినేమో యను సంశయముతో బెట్టెతెరచియేయున్నది గాన దానిని గూడ శోధించుచుండెను.

ఆపెట్టెయందుగూడ నావిల్లున్నట్లు గానరాదయ్యెను. ఏమైయుండునా యని యాతఁడాలోచించుచుండఁగాఁ భార్యతి యచ్చోటి కాకస్మికముగావచ్చి చూచి—"ఓరి దుష్టహృదయా! నాతాతగారిని పెరటిలోనికి దిగబెట్టి యచ్చటా మహానుభావు నేమిచేసితివి? నీవాతని కనిపెట్టికొనియుండక చాటుచాటుగావచ్చి యీయినుపపెట్టె సవరించుచుంటివా? ఇది నీకుఁదగునా? నాతాతగారు నీవెంతయో నమ్మకముగు సేవకుఁడవని పొగడుచుండెడివారే- ఇదియేనా నీనమ్మకము? ఇదియేనా నీకృతజ్ఞత. ఇదియేనా నీసేవకావృత్తిధర్మము? పాపహృదయా! నీవీగదియందే బంధింపఁబడి యుండుము-మాబావ కాకినాడనుండివచ్చి నిన్ను సత్కరించును తులువా?"

అని యాతనినిందించుచు దడాలున తలుపులీవలబంధించివైచి బిరబిరలోనికరిగి యన్నగార్లను, వదినెగార్లను లేపి జరిగినయావద్వృత్తాంతము నెఱింగించి-

తాతగారు పెరటిలోనుండిపోయిరి. వారిని లోనికిదోడ్కొనివచ్చి పిమ్మట వీనిసంగతి యాలోచింతము. అని యనుటచే నల్వురును పెరటిలోనికరిగి చూచిరి.

అచ్చట మాధవరావొక చాపపైబరుండియుండెను. అదిగాంచి శ్యామల వడివడిగా భర్తతోఁ గలిసి యాతని సమీపించి—

తాతగారూ! మీదేహస్థితి యెట్లున్నది? ఇచ్చటబరుంటిరేమి? అని కామేశ్వరరావడిగెను.

కాని మాధవరావేమియు మాటాడలేదు. ఏమాయూ టాడుటలేదని సమీపమునఁ గూర్చుండి తట్టిలేపిరి.

నిముషములో సంగతియంతయు బోధపడి యెల్లరును గొల్లుమనిరి.

అర్ధరాత్రియందింటిలో గోలబయలుదేఱినదేమా యని వీధిలోనున్న పోలీసువారు సంశయించి బిగ్గఱగా బిలచి యెట్లో దలుపుదెఱపించి వారు లోనికరిగి—ఇప్పుడేమిప్రమాదమువచ్చినదని మీరెల్ల రిచ్చట గుమిగూడి విచారించుచున్నారు? అని యాపోలీసువారడిగిరి.

వెక్కివెక్కి యేడ్చుచు-'మాతాతగారుగూడ మమ్ము విడచి దివంబలంకరించిరి." అని కామేశ్వరరావనియెను.

"ఏమి? మాధవరావుగారు గతించిరా? హరహరా!" అని నారాయణస్వామి యనియెను.

అప్పుడు బలవంతరావు నాఁటిరేయి జరిగినసమాచారమెల్ల నారాయణస్వామిగారికి చెప్పి దొంగదొరకెనని యనెను.

దొంగ యీనాఁడుగాకున్న రేపైనను దొరకితీరును గాని రామరామ రెండు పెద్దప్రాణములును గూడ బుచ్చుకొనినాడండి దురితాత్ముఁడు. కానిందు వానిపాపము బండి

నది. నేను వినినదానికిని దీనికిని చాలవ్యత్యాసమున్నది గాని రాజారావుగారి యనుమానము మాత్ర మాధారరహితమైనది.

అయ్యా ! కామేశ్వరరావుగారూ ! ఈదిక్కు మాలిన పోలీసువారి యంతటికిరో కటపుజని యింకొకటిలేదండి. కొంపనస్టేటులో బుడుంగున మునిగిపోవుచున్నను సరియే దొరతనమువారి శాసన మతిక్రమింప వలనుగాదు గదా ? ఇది వఱకు మీయింట మీజనకులు విషపానముచే గతించుట— దానిని శవపరీక్ష చేయుట— అది సత్యముగానేయున్న దను కొనుడు. ఇప్పుడు మీతాతగారి మరణము స్వభావమైన దైనను నిదివఱకున్న యనుమానమును బట్టి దీనిని గూడ పోష్టుమార్టనుకు బంపించక తప్పదు. సరే కానిండు. దానివలన మనకు బ్రమాదములేదు. ఇప్పు డీదొంగను స్టేషనునకు దీసికొనిపోయి ఖైదులో బెట్టుట ముఖ్యము. ఈతఁడు దొంగయనియే మీరు రుజువుచేయఁగలరు గాని హంతకుఁడని రుజువు చేయఁజాలరు గదా ? అందులకు దగిన యాధారము లేమైన జిక్కునేమో వీని గృహము బరీక్షింపవలసి యున్నది. వాకబుమీఁద వీని గుణమెట్టిదో యెఱుంగవలసి యున్నది. మీభావమరది రాజారావుగారు రేపుతప్పకవత్తురు. ఆయన రాకతో నీ వ్యవహారమంతయు జక్కబడును. విశేషశ్రమ లేకుండనే దెలిసినది. మాపని మేము నిర్వర్తించుకొనుటకు మాకు సెలవా? అని నారాయణస్వామిగా రనిరి.

"అయ్యా ! మీశాసనమునకు వ్యతిరిక్తముగా నడు వు డని గోరుటకు మేమెంతవారము. మీచిత్తమువచ్చినట్లు చేసికొనుఁడు."

అని కామేశ్వరావని గబగబ లోని కరిగి తల్లిపడియు న్నచోటి కరిగి యామెను గట్టిగ కౌఁగలించుకొని యేడ్చుచు:-

"అమ్మా ! తాతగారిని గోవిందు పొట్టను బెట్టుకొని జీర్ణము చేసికొనఁజాలక దొరకిపోయినాఁడు" అనెను.

కడచిన నాఁటిరేయి జరిగిన దారుణమున కామె మూ ర్ఛిల్లినది. ఇంతవఱకు స్మృతి నామె విడువలేదు. పెద్దకోడలగు శ్యామలయే యామెకు సకలోపచారములును జేయుచున్నది. ఆఘోరమునకే యామె క్రుళ్లికృశించిపోవుచుండఁగా రెండ వ చావీదుర్వార్త వినంబడినది. ఆఁ ఆఁ గోరుచుట్టుపై రోక టిపోటుపడినదా యని యామె బిగ్గరగా నరచి మూర్ఛిల్లెను.

ఎట్లో జరుగవలసిన కృత్యములన్నియు జరిగిన వెనుక పోలీసువారు వారికార్యములు వారు మరచిపోలేదని పాఠకు లు గ్రహింతురుగాక.



# మూఁడవ ప్రకరణము.



## ప్రళయ మింతకంటె హెచ్చా?

మరునాఁడు వచ్చెద ననినవేళకు రాజారావు పిఠాపురము రాజాలకపోయెను. ఆకారణ మేదియో యాతఁడు వచ్చి చెప్పిన వెనుకగాని మనకు తెలియదు.

చనిపోయిన రఘునాథరావు, మాధవరావుగార్ల కుటుంబములపై బోలీసువారి కాయుదా హెచ్చయిపోయెను. కాని యారక్షకభటులకు వరుసగా రెండురాత్రులు నిద్దురజాలకుండుటచే బాపము వారెల్ల నిద్రాదేవికి వశ్యులైపోయి— యామె జోలపాటలకు లొంగిపోయి--క్రమక్రమముగా నామె యొడిలో బడిపోయిరి.

ఇంటిలోనివారు గూడ గడచిన రెండుదినములనుండి నిద్రాహారంబు లెఱుంగమిచే నాఁటనిద్రాదేవికి దాసులైపోయిరి. నిద్ర సుఖ మెఱుంగదు. సమయ మెఱుంగదు.

ఆనాఁటి నిశీథసమయంబున నొకయువకుఁడు ద్విచక్రశకటము పైనుండి పీఠికాపురపు బజారువీథిని వచ్చుచుండెను.

అట్లు వచ్చుచుండగాఁ గోట కేఁబది యరువది గజములలోఁ గల నొకయింటియం దేమియో గడబిడ జరుగునట్లు గ్రహించి సవ్వడిచేయకుండ నాశకటముపైనుండి మెల్ల

గా నాయువకుఁడు పైకి వెడలి యాగడబిడ యేమైయుండునా యను నాలోచనముతోఁ జెవియొగ్గి వినుచుండెను. అప్పు డాతఁ డేమేమియో వినుచు నాచీఁకటిలోనే తన జేబులోనుండి యొకపుస్తకమును దీసి దానిపై దనకు వినబడు వాక్యముల న్నియు నెట్లో వ్రాసి—చటాలున నతఁడు దిగుచుండఁగా వీధి తలుపు దెఱచికొని యెవ్వరో యీవలకు వచ్చుచుండుట గాంచి—తన శకటముతోఁ బోవుటకు వీలుచాలమి చటుకున నాశకట మక్కడ విడచి తానొక మరుగునఁ డాఁగెను.

ఆయింటినుండి యీవలకు వచ్చినవాఁడొక రక్షకభటుఁడని యాతఁడు వాని వేషభాషలచే బోల్చుకొనెను. కాని యారక్షకభటుని నెంబ రెంతయో గనిపెట్టుట కాతని కేవిధమగు నవకాశము దొరకినది గాదు. నెంబరు దొరకని మాత్రమున నాతఁడు తప్పించుకొని పోవుటకు దగిన యవకాశము లేదని యనుకొని మరల నీవలకు వచ్చి యాశకట మధిరోహించి తిన్నగా రఘునాథరావుగా రింటి వైపునకుఁ బోయెను.

ఈతఁ డాయింటిముంగల నాగునరి కాయింటిలోని వారెల్ల నిద్రాదేవికి సెలవొసంగి యేకారణముననో నింటిలో నివారెల్ల రేచ్చుచుండిరి. వీధితలుపులు దీసియున్నవి. పోలీసు వారుకూడ లోననే యుండిరి.

ఈతఁడు నిరాఘాటముగా లోనికరుగుటతోడనే—

"ఇదిగో! కాకినాడ వెడలిన రాజారావుగారు వచ్చిరి. ఇదివఱకు మనమెల్లర మశ్రద్ధగానుంటిమి. ఇంకముం దిట్టిదురంతములు జరుగకుండఁ గాపాడఁగలరు."

అనియొక రక్షకభటుఁడనెను. ఆతని నంబరు వెంటనే రాజారావు చూచి జ్ఞప్తియుంచుకొని నారాయణస్వామిగారి నీవలకుబిల్చి మావాండ్రింద రేల నేడ్చుచున్నారు? అనియడిగెను.

అయ్యా! ఇట్టియద్భుతోదంతవిషయము లరేబియను నైట్సులోను- టర్కీకథలలోను- ఈజిప్టుకథలలోను జదివియుంటిమిగాని ప్రత్యక్షముగా నెన్నఁడును గనివిని యెఱుంగము. కవీశ్వరుల కేమియు బనిలేక తమబుద్ధిని వినియోగించి చదువరుల కాహ్లాదము గొల్పుట కట్టికథలు వ్రాసి దానివలన ధనమార్జించి జీవించుచుందురు. ఈయుదంత మాకథల నన్నిటిని మించియున్నది. ఊహాతీతమైయున్నది. వేయునుంది రైనాల్డ్సు యీహంతకుని కాలిగోటికి సరిరారు. ఇంతటి జిగిబిగిగలప్లాటు- ఇంతటి చాకచక్యముగల హంతకుఁడు- కొన్నికొన్ని కల్పితకథలయందు గలడేమోగాని నిజచరిత్రములయందు మాత్రము లేడని చెప్పవచ్చును. అందున బూర్వపు వారిమాట నేజెప్పజాలను గాని యిప్పటివారిలో సరియైన హత్యగావించువాఁడు గాని- దొరకని దొంగతనము జేయఁగలవాఁడుగాని లేనేలేడని చెప్పవచ్చును. ఇట్టిఘోరకార్య

ములలో మెలఁగువారికి విశేషమగు బుద్ధిబలముండవలయును.

మీరు వెడలిన తరువాత నిచ్చట రెండు ఘోరములు మరల జరిగినవి. వయోవృద్ధులైన మాధవరావుగారు గతించిరి. అదియు నద్భుతముగానే నడచినది. అని జరిగినసంగతి చెప్పి గోవిందుపైననుమానములు జెప్పి—వానిని బంధించినవిషయమెఱింగించి మరియు నిట్లనియెను.

మాధవరావుగారి శవము పోస్టుమార్టయినది. అతఁడు స్వభావమగు మరణమును జెందెనేగాని బలవన్మరణము జెందలేదని డాక్టరు సర్టిఫికెట్టు నిచ్చియున్నాఁడు.

తరువాత నీనాఁడు జరిగినఘోర మంతకంటె దారుణమైనది. విన్నమాత్రమున మాగుండెలు వ్రీలిపోయినవి.

ఈరేయి పదునొకండు గంటలవఱకు మేమెల్లరమును మేలుకొనియేయున్నాము. ఆతరువాత నిద్రాదేవికి వశ్యులమైపోయితిమి. ఇంతలోక పావుగంటకు ముందింటిలోనివారు గొల్లుమనియార్చిరి. ఆసందడికి మేము లేచి తలుపులు దీయుఁడని కేకలువైచితిమి. మాకెవ్వరును దలుపుదీయువారు లేకపోయిరి. ఇంతట పెరటిలోనుండి "లోనికిరండు." అని వినఁబడుటచే మేమట్లే లోనికరిగితిమి. మాకెవ్వరునుగాన్పింపలేదు. మీరెచ్చటుండిరని యడుగ గదిలో నుంటిమనియు, తలుపుదీయుఁడనియు కామేశ్వరరావు జెప్పెను. వెంటనే మేము తలుపుదెఱచి చూచితిమి.

ఔరా! ఏమి యీమాయదార్హంతకుని చాకచక్యము. చూచుటతోడనే మాగుండెలు నీరువిడచిపోయినవి. కామేశ్వరరావును, శ్యామలను, పార్వతిని- బెఱరెక్కలు విఱచికట్టి పాదములకు దా్రకుబిగించి యూత్రాడు దూలమునకు గట్టి వారుమువ్వురును దలక్రిందుగా వ్రేలాడదీయబడి యుండిరి. వీరెవ్వరును గేకలువేయకుండ నోటగుడ్డలుగూడ కుక్కిరట. ఒకరికొకరు సహాయముజేసికొని యూదొంగలు వెడలిపోయిన వెనుక నోటగుడ్డలుమాత్రము వారుతీసికొనగలిగిరి. సుభద్రయును, నామెకుమారుఁడునుగూడ నొకచో గట్టివేయబడియుండిరి గాని వ్రేలాడదీయఁబడియుండలేదు. హరహరా! చెప్పుటకు నోరాడకున్నది. బలవంతరావుమాత్రము వధింపఁబడియుండెను. ఆతని శిరస్సెచ్చటను గానరాదు. పతివియోగదుఃఖానలసంతప్తహృదయయగు కాంతమ్మగారిజాడయే లేదయ్యెను. అంతయు నద్భుతముగానున్నది గాని యథార్థమట్లు గాన్పింపకున్నది. మేము వారివారి బంధములన్నియు విప్పితిమి.

ఏమైన నేమిలాభము! మేమూర్వురమిచ్చటనుండియు- చేతగానివారమైతిమి. అదిగాక నిన్నటిరాత్రి చరితమునుబట్టి గోవిందుఁడే యూకథానాయకుఁడను దృష్టాంతములన్నియు గాన్పించుటచేతను- ఆతనిని మేము బాధించియుంటచేతను- మేమానాఁటిరేయి యించుకశ్రద్ధగానున్నమాట వాస్తవము.

మామాయుద్యోగములకు దిలోదకము లర్పించుకొనవలసిన సమయమువచ్చినది. మీయశ్రద్ధయే యిన్ని ఘోరవధలకు మూలకారణమని ప్రజ లనకమానరు. ఆప్రజావాక్యమే మా ప్రాణములదీయుట కాధారమగునని శంకించుచున్నాము. ఇఁక నైనను మీరించుక శ్రద్ధవహించి యాహంతకుని బట్టుటొకటి- ఈవిషయమున మానోట నున్నుఁ బడకుండఁజేయుటొకటి- మీవిధాయుకకృత్యములైయున్నవి. మమ్ము రక్షించుభారము మీదే. అని నారాయణస్వామి యూరకొనెను.

ఈవాక్యము లాలించి రాజారావు నిస్తబ్ధుఁడై పోయెను. ఒక్కపావుగంటవఱకు కన్నార్పకుండి చటాలునలేచి నారాయణస్వామిగారూ! నేను కాకినాడ వెడలివచ్చులోపల మీరు నాబందుగులయిల్లు గాపాడజాలకపోయిరి. హాయిగా నిద్రబొమ్మనియూ మిమ్మిటనుంచినది. మొదటిదినమున వధ- రెండవ దినమున నింకొకమరణము- దానిపై దొంగతనము జరిగినపుడు మీరెంతజాగ్రత్తగా నుండవలసినవిషయమో యూహించితిరా? మీటోపీలుజూచి యాహంతకుఁ డడలిపోవు ననుకొంటిరా? మీశషభిషలుచూచి యాతఁడలజడిబడుననుకొంటిరా? మీయీలల కాతఁడు కంగారుబడుననుకొంటిరా? మీయవివేకమువలన సర్వనాశనమైపోయినదే. రామరామా! ఇంతదురన్యాయముండునా? వరుసగా మూఁడుదినములలో మూఁడు ప్రాణములుబోవుటయా? తలచెడియున్న యొక సాధ్వీరత్న

ము నింతటి మనోవ్యథబాలు చేతురా? కానిమ్ము. ఇపుడెంత విచారించిన నేమిలాభము? ఇప్పుడు మిమ్మెంతనిందించిన నేమి లాభము? సరే. మిగిలినవా రెచ్చటనున్నారు?

"అయ్యా! వారెల్ల బెరటిలోనున్నారు." అని నారాయణస్వామి చెప్పెను.

సరే. ఒకమారు వారి చెంతకు వెడలివచ్చెదను. నేను కాకినాడ వెడలిన పని సానుకూలమైనది. నేనిక్కడ సి. ఐ. డి. గా బనిచేసి యాహంతకునిఁ బట్టెద. ఇదిగో! ఇది మీకొక యధికారపత్రము. అని యిచ్చి లోనికరిగెను.

పాఠకమహాశయులారా! ఈఘట్టమున్నదే యది యథాప్రకారముగా జిత్రించుట మిగుల గష్టము. ఆకష్టమున కోర్చి యెట్లో వర్ణించినను నిరుపయోగము. ఏడ్పులును, పెడబొబ్బలును వర్ణించుట నిరుపయోగముగా కేమియగును. మొన్నఁటివఱకు గాలమువఱకు గలకలలాడుచున్న యాకుటుంబము-విరగబూసిన చామంతితోటవలె చూచినవారి కానందము గొల్పు నాకుటుంబము- నిముషములో- లెక్కమూఁడుదినములలో- వేసఁగికాలపు చేమంతివనమువోలె శోభదరిగియున్న యాకుటుంబమును జూచి నెడతెగని విచారముద్భవింపదా? చావగామిగినవా రేడ్చుచుండ- వారికేమని రాజారావు ధైర్యముపదేశింపగలఁడు. వారి నేమని యూరార్చగలఁడు?

రాజారావెట్లో కృత్యాద్యవస్థమీఁద వారినూరార్చి

యచ్చటనిర్వర్తింపవలసిన పనులన్నియు నిర్వర్తింపఁజేసి యీవలకు వచ్చెను.

ఇంతలో ఛళ్లునదెల్లవారెను. అప్పు డారాజారావు నారాయణస్వామిని గాంచి "అయ్యా! మీరు బంధించిన గోవిందుతో నేను ముచ్చటింపవలసియున్నది. నన్ను వాఁడున్న యెడకు దోడ్కొనిపొండు" అని కోరెను.

వెంటనే నారాయణస్వామి రాజారావును స్టేషనుకు దోడ్కొనిపోయి గోవిందుని జూపించెను. అప్పు డారాజారావు నారాయణస్వామిని వెడలిపొమ్మని కోరి యతఁడు వెడలిన వెనుక గోవిందును జూచి:—

గోవిందూ! నీసంగతి నాకు తెలియును. నేనప్పుడున్నచో నీకీదుర్గతి బట్టకుండెడిది. నాకప్పు డిక్కడ బనిచేయుట కధికారము లేకుంటచే గాకినాడ వెడలకతప్పనిపని వచ్చినది. ఇంతలో నింత యైనది. అంతతో సరిపోయినదా? బలవంతరావు నెవ్వరో ఖండించి యాతని శిరము బట్టుకొనిపోయిరి. కాంతమ్మగా రేమయిపోయిరో గాన్పించుటయే లేదు. ఈ తెలివితక్కువవారూహించినట్లు నీవే హంతకుఁడవైనచో నీవు కైదులోబడినపిమ్మట నిట్టిదురంతరములు కలుగుట కేమి కారణము? ఈమాత్రమువా రూహింపవలదా? సరే. గతించిన విషయములిప్పుడు త్రవ్వినను లాభము లేదు. నీవిప్పుడు చేయవలసినపని యేమన మాధవరావుగారు గతించిననాఁటిరాత్రి

చరిత్ర నీవుస్పష్టముగా నాకెఱింగించుట- అటుపైన నాసంశ
యములకు నీవెఱింగియున్నంతవఱకు సమాధానమిచ్చుట—
ఈరెండును నీవలనఁ గావలయును. అని యూరకొనెను.

బాబూ! నేనెఱింగిన విషయము లేమియు దాఁచుకొన
కెఱింగించుచుంటిని వినుము. నాఁటిరాత్రి తాతగారిని మందు
బుచ్చుకొమ్మని శ్యామలాపార్వతు లిద్దరును వచ్చి బ్రతిమ
లాఁడి యా బాలికలప్రియమునకు దగినట్లు లేదో వేదాంతో
పదేశ మొనర్చిరి. ఎనుబదియేండ్ల ముసలివాని కావెఱ్ఱివే
దాంతము దలకెక్కునా? అదిగాక పుత్రవియోగానలసం
తప్తహృదయుండగు వానికి- దేహములో దగనితప్పని రోగము
బ్రవేశించెనేయని విచారించువాని కావేదాంతము వినంబడు
నా? ఎట్లయిననేమి మందుబుచ్చుకొనకుండఁగనే వారినావ
లకు బంపివైచి- తానానాఁడే వ్రాసిన విల్లు నాచేఁ బెట్టి యెవ్వ
రి కెంతముట్టవలయునని వ్రాసెనో మాత్రము జెప్పక- శ్యా
మలాంబనుగూర్చి పొగడి- కామేశ్వరరావు వెఱ్ఱితనమును
గూర్చి తొందరపాటునుగూర్చి విచారించి సుభద్ర కుటిలాత్మ
రాలనియు- భర్తను వశమొనర్చుకొని- చేతికీల్బొమ్మయాడించు
నట్లాడించుచున్నదనియు- ఆమెవలననే యీకుటుంబ మింకను
నాశనమగు సూచనలు గాన్పించుచున్నవనియు- ఆమెతోడి
కోడలి యధికారమునకు లోఁబడునంతటి సదయహృదయగా
దనియు- ఆమెనింక చక్కజేయుట కవకాశములు లేవనియు-

పార్వతి యింకను నవివాహితయనియు - ఆమె నొకయింటిదానిని
గా జేసిన దనుక నట్టి చిక్కు లుద్భవించినను నంతగా విచారిం
పకుండుమనియుఁ జెప్పి - పైకారణములచే దనయభిప్రాయమున
కనుగుణ్యముగా విల్లు వ్రాసితిననియు - తన కానాఁడు గడచు
సాధనము లేదనియు - ఆసూచిదినములయినపిమ్మట నావిల్లు
సదయహృదయయగు శ్యామలకిమ్మనియు జెప్పెను. ఇంతట
మావిస్రంభసంభాషణ మెవ్వరో వినుచున్న సవ్వడి గనిపెట్టి
మాయజమాని నన్నుఁబోయి చూచిరమ్మనెను. నేను పెరటి
లోనివఱకు బోయి చూచితిని. ఆయర్ధరాత్రమున సుభద్రాబ
లవంతరావులొక మల్లెపొదచాటున మాటలాడుకొనుచుండిరి.
వారిరువురిలో మాసంభాషణ మాలించినవారెవ్వరో నేనెఱుం
గను. వారిరహస్యసంభాషణము జరుగకుండ నింతలో సుభద్ర
యొడిలోని మాధవుఁడు పోరుబెట్టెను.

"సుభద్రా! మాధవుఁడు లేచినాఁడు. మనమిప్పుడే
మనిననునిందాపాత్రుల మగుదుము. తరువాత నీవిషయమై
నాలోచించుకొందము. పోయి పరుందము రమ్ము."

అని బలవంతరావనుటచే నేను లోనికరిగి మాయజ
మానికావార్త నెఱింగించితిని. "సరే నాయనుమానములు
ను, తదనుగుణ్యముగా నాయాస్తి పంపకము జేసి యీవిల్లు
వ్రాసితిని. ఇది భద్రపరచి—"అనుచునే దేహబాధ యెక్కు
డగుటచేతనో, మరియొందుచేతనో దన్ను పెరటిలోనికి దీసికొని

పొమ్మనెను. కాగితము పెట్టెలో బెట్టి తీసుకువెళ్ళుదమని పెట్టె తెఱచితిని. ఇంతటాతని తొందఱ హెచ్చగుటచే యొక్కడివక్కడ విడచి యజమానిని పెరటిలోనికి దీసుకువెడలితిని. అచ్చటాతని కాకస్మికముగా గుండెజబ్బు హెచ్చి ప్రాణములు విడచెను. విచారించిచేయున దేమియు లేదని దలంచి విల్లు భద్రపఱుపకుండ నింటివారిని లేపినచో విల్లువెల్లడియగునని భయపడి విల్లు భద్రపఱచి యందఱను లేపుదమని నేనాగదిలోని కరిగి విల్లుకై జూచితిని. అది ఎట్లో పోయినది. దానికొఱకై నేను కంగారుబడుచు నినుపపెట్టె తెఱచి చూచుచుండ నింతలోఁ బార్వతివచ్చి నామనోవృత్తి దెలియక దొంగనని నిందించి నన్ను బోలీసుపరము జేసినది.

నిక్కముగా నే నిందేపాపమును నెఱుంగను. నేనెట్టి విశ్వాసపాత్రుఁడనో పెద్దవారెల్ల నెఱుఁగుదురు. కాపురమునకు వచ్చిననాఁటినుండియు సుభద్రాశ్యామలాంబలును నెఱుఁగుదురు. కాని యేమిలాభము. నాదురదృష్టవశంబున వారు దుఃఖములోనుండి నేను ద్రోహినని యే భావించిరి. తాటిక్రింద బాలుత్రాగినవానివిధముగా నయిపోతిని. నా మాట లింకెవ్వరు నమ్మనరు. తప్పటడుగులనాఁటినుండియును నేమహాశయునియాస్తితో నీదేహమువృద్ధియైనదో- ఏసుగుణాత్మునితల్లికంటె-తండ్రికంటె-నాప్రాణములకంటె నెక్కువగా జూచుకొని సేవించుచుంటినో- అట్టి నాయజమానిని- తుచ్ఛ

మగు ద్రవ్యమున కాసించి చంపితినను నిష్కారణనింద నా నెత్తిపైఁబడినది. నేను దుష్టుఁడనని- ద్రోహినని- నలువురినోళ్ళలోనుబడితిని. ఇంక నే జీవించియు వ్యర్థము గదా ? అని యాతఁడూరక వాపోవఁజొచ్చెను.

గోవిందూ ! విచారింపకుము. నేను నీవర్తన మెఱుంగనివాఁడను గాను. ఈవిషయమునఁ గల రహస్యమును బయటికి దీయుటకు దొరతనమువారు నన్ను నియమించిరి. నిన్ను నేను నేఁటరేపట నిందుండి విడిపింపఁగలను. విచారింపకుము. దొంగయని కొఱతవేయఁబడిన మాండవ్యున కెట్టి యపనిందగలిగినదో నీకును నంతేగలుగును. ఈరూపముగా నీవీస్వల్పకాలము చెఱలో నుండునట్లు భగవంతుఁడు నియమించియున్నాఁడు. అది తప్పించుకొన నెవ్వరి వశము. నీవు దానికై విచారింకుము.

ఇప్పటికి మాధవరావుగారి కుటుంబములో జావకుండమిగిలినవారు కామేశ్వరరావు- శ్యామల- సుభద్ర- పార్వతి- కుమారమాధవరావు. కాంతమ్మత్తగారు బ్రదికియున్నను బోయినవారిలోనేజము. ఇప్పుడీ జీవించియున్నవారి గుణవర్తనాదులీ వెఱుంగనివికావు. కుమారమాధవరావు మాటలురాని బాలుఁడు. అతనితో మనకు నిమిత్తములేదు. తక్కినవారి నడవడికలనుగుఱించి- వారివారిస్వభావమును గుఱించి నీవలన నాకు తెలియవలసియున్నది. ఏమందువు ? దైవముఖ

ముజూచి సత్య మెఱింగింపుము. నాచెల్లెలను. గుఱించియై ననుసరే నీవు సందేహింపవలసినపని లేదు. అనెను.

చిత్తమునం దెట్టిసందియమును నుంచుకొనక నేనెఱిం గినదెల్ల నెఱింగింతును. అని గోవిందుఁ డనెను.

# నాలుగవప్రకరణము.



## తర్కము.

గోవిందూ! నేజెప్పిన నల్వురను గూర్చియు, వారి వారి వర్తనాదులను గూర్చియు నీవు వరుసగాఁ జెప్పెదవా? లేక యొక్కొక్కరినే పేరుపేరువరుసలుగా నన్ను బ్రశ్నింప మందువా? నీయిష్ట మెట్లైనను సరియే. అని రాజారా వని యెను.

ప్రభూ! ఒక్కమాట. నాచిన్నతనమునుండియు నే నొక్కనినే సేవించితిని. నాయజమాని మాధవరావుగారని మీ రెఱుంగుదురు. ఆయన కుమారుండగు రఘునాధరావు గూడ నాకు యజమానియేగాని, తానొక యజమానిగాను, నేనొకసేవకునిగాను నాతఁ డెన్నఁ డెంచలేదు. వేయేల? సు భద్రాశ్యామలాంబలుదక్క తక్కుంగలవారు నన్ను దమసం సారములోనివానిగనే యెన్నుకొనిరి. నాకడపటిదినముల నాక

ట్టి భాగ్యము లేకపోయినది సరిగదా నాప్రేమపాత్రులెల్లరును మరణించిరి. మరణమన్న మరణమా? దుర్మరణము. అట్టివారి యాత్మశాంతి కీతుచ్ఛశరీరము సహస్రశతఖండములగానైనఁ జెండియిచ్చివైచెదను. అందులకు సర్వసిద్ధముగా నుంటిని. అట్టివాఁడను వారివారి గుణవర్తనాదులను మీకెఱింగింపక దాఁచుకొందునని యనుకొనకుఁడు. కాని యొకరిద్దరి విషయమై-యొకటిరెండు విషయములు మీకేగాదు-ప్రపంచముగల నెరికిని నెఱింగించుటకు వీలులేనివి గలవు. అవిగాక తక్కిన విషయంబు లన్నియు నెఱింగింతును. నేనిట్లంటినని గినియక క్షమింపుడు." అని గోవిం దనియెను.

రాజా—గోవిందూ! నీయజమానిపైనను- వాని కుటుంబముపైనను నీకుఁగల యభిమానమునకే నెంతేని సంతసించితిని. నీవు కొన్నివిషయములు దాఁచుకొందునంటివి. అవి నీవు దాఁచినంతమాత్రమున నిఁక బయటబడుట కవకాశములు లేవా?

గోవిం—అది మీయత్నమును బట్టియుండును.

రాజా—అట్లయిన సంతోషమే. కామేశ్వరరా వెట్టివాఁడు?

గోవిం—అతఁడు తాతగారగు మాధవరావుగారివలె సర్వవిధముల వన్నెకెక్కినవాఁడేగాని- యించుక సోమరి- అసత్యమాడఁడు. భార్యకు బూర్తిగాలొంగినవాఁడేగాని- తన

మాట పై నుండవలయునను పంతము గలవాఁడు. పరోపకారి-
కాని యాతఁడు పరస్త్రీలోలతగలవాఁడుగాఁడు.

రాజా—సంతోషమే. శ్యామలయెట్టిది? నాచెల్లెలని
సంశయింపక సత్య మెఱింగింపుము. ఒకసంగతి. ఈకుటుంబము
లోనివారెల్ల నాకు గావలసినవారగుటచే- దొరగారు నన్ని
హత్యాపరాధకునిగా నియమించుట కించుక తమయసమ్మతిని
తెలియజేయ- ఇందు నాచెల్లెలు దోషురాలైనను బట్టియొప్ప
గింతునని శపథమొనర్చి- నాసత్ప్రవర్తననుగూర్చి తగిన నిద
ర్శనములు జూపించితిని. అప్పుడునమ్మి దొరగారు నా కీయు
ద్యోగమిచ్చిరి. కావున నీవు సంశయింపక శ్యామలసంగతి
దెల్పుము.

గోవిం—శ్యామలాంబ కేవల శ్యామలాంబయేగాని
మనుష్యాంగనగాదు. ఆసాధ్వీమణి యీగృహమున కొకపె
ట్టని యలంకారమని నిస్సంశయముగా జెప్పవచ్చును. ఆమె
సర్వవిధములను స్తుతిపాత్రియేగాని- ఐశ్వర్యవంతుల యాఁ
డుపడుచునుగదా యను నహంభావముగలది. దానికితో
డ త్రిల్లుగూడ కలిగినచోట యామెగర్వమున కడ్డులేదు. వృద్ధ
రిమాధవరావుగారి కీమెయందున్న గౌరవము- ప్రేమ- మ
యేరియందును లేదనియే చెప్పవచ్చును. కుటుంబమునకు బె
ద్దకోడలు. అదిగాక సద్వంశసంజాతులగు నారాయణరావు
గారికుమార్తె. యుక్తాయుక్తవివేకి. ఇనుపపెట్టి రఘునాధరా

వుగారో- యీమెయో దీయవలసినదేగాని- ఇంకెవ్వరును ముట్టరు.

రాజా—నాద్వితీయసోదరి సుభద్రియెట్టిది ?

గోవిం—మీయట్టివారి నామె సోదరాయని సంబోధించుటకు తగనిదని నాయభిప్రాయము. ఈమెకు బాల్యచాపల్యములు మెండు. చిల్లరతిండిపై యభిమానముమెండు. దానికై బిడ్డమీదగూడ నొట్టుబెట్టుకొనుటకు సంశయింపదు. ఎవ్వరేమి మాట్లాడుదురోయని పొంచుండి తద్రహస్య మెఱుగుటకై యత్నించును. అప్పుడప్పుడు త్రోడికోడలకు సహాయ మొనర్చునట్లు నటించి జేబుకత్తిరింపువానికంటెను జాకచక్యముతో నేమైనఁ గైంకర్య మొనర్చుచుండెడిది. క్షమింపుడీయుదంత మీయింట- నాకును- శ్యామలాంబకును మాత్రమే తెలియును. మీకో జెప్పకపోవుటెందులకు? మాధవరావుగారు తమయభిప్రాయమును నాకెఱింగించుచుండఁగా బొంచున్న దాసుభద్రియే. నాయనుమానమునకు సరిగాఁ దోటలో భర్తతోమంతనములాడుచు గాన్పించినది. దైవదుర్విపాకంబున నామంతన మేమియో తెలిసికొనుటకు దగిన యవకాశము లభించినదిగాదు. కాని- ఆయవకాశమే లభించినచో నింతటి విపరీతములు జరుగకుండునని తలంచెదను. ఆమెయే యీవిల్లుకాగిత మపహరించి యుండవలయును ?

రాజా—ఆవిషయములు దరువాత చర్చించుకొంద

ము. మా మరదలు పార్వతి యెట్టిది?

గోవిం — ఆమె చూపునకు గన్యయే గాని - పనివచ్చినప్పుడు - పట్టుమని పదివేలమంది మగవారికి సమాధానమీయగల చాకచక్యముగలది. ఈమె యందఱకును దలలోని నాల్కయై యుండునుగాని చాలపట్టుదలగలలలన. ఈమెకును శ్యామలకును మనసుగలిసినట్లు - సుభద్రకును - యీమెకు సరిపడదు.

రాజా — ఈమె వివాహ మేలయాగిపోయినది ?

గోవిం — ఆ పెండ్లికొడుకు కనురూపవంతుడు గాడనియు - ఆతడు తనకు వలదనియు నామె తల్లితో జెప్పి - యెట్లో యొక 'బిడి' పెట్టి యది చెడగొట్టినది. ఇంకొక సంబంధము జూచుచుండ నీయవాంతరములు వచ్చిపడినవి.

రాజా — గోవిందూ ! నీవు వారివారి గుణవర్ణనాదు లెఱింగించితివి కాని యవియంతలాభకారిగా నాకుగాన్పించుటలేదు. ఒక్క సుభద్రమాత్రము — మీయిరువురి రహస్య సంభాషణమును బొంచుండి వినుటచేతను - ఆనాడే సరిగా విల్లుబోవుటచేతను - సరిగా నీవరుగునప్పటికి బలవంతరావు భార్యనుద్దేశించి "సుభద్రా! మాధవుడు లేచినాడు. మనమిప్పు డేమనినను నిందాపాత్రులమగుదుము. తరువాత నీవిషయమై యాలోచింతము" అని యనుటచేతను, మన మీ దంపతుల ననుమానింపవలసివచ్చుచున్నది.

ఇందు "మనమిప్పు డేమనినను నిందాపాత్రులమగుదుము." ఈవాక్యమార్థమేమియో స్ఫురింపకుండనున్నది. మాధవరావుగారు వ్రాసిన విల్లుసందర్భమున కీవాక్యమించుకన్వయించుచున్నది గాని- యదియు నంత సందర్భశుద్ధిగా లేదు. కారణమేమందువా? మాధవరావుగారు విల్లుమాత్రమే నీస్వాధీనము జేసిరికాని యెవరెవరి కెంతెంత ముట్టవలయునని వ్రాసెనో యాసంగతి నీకైనను దెలుపలేదుగదా? అట్టియెడ వారావిల్లును గుఱించి యేమనుటకును దగినయవకాశము లేదు. అప్పటికావిల్లు చూచియుండకేమో యాయన నావిల్లిప్పటికి పోయియుండలేదు. ఇప్పుడింకొకమార్గము గాన్పించుచున్నది. అదియేమందువా? మాధవరావుగారెట్లో విల్లువ్రాయుచుండ నేచాటుననుండియో సుభద్రగాని, బలవంతరావుగాని చూచియుండవలయును. అంతకుముందుదినమే తండ్రి చనిపోయియుండుటచేతను- మరునాఁడు మాధవరావు తన యాస్తి కామేశ్వర, బలవంతరావులకు సమముగా బంచక కొంచెము వ్యత్యస్థముగా బంచుటచేతను, గలిగినదుఃఖమున నాస్తివిషయమై యింతపాతకబుద్ధితో జరించితి వేమియని యుల్లరిబెట్టినచో నిందాపాత్రులమగుదుము అని వారుశంకించియుందురు. మాధవరావుగారి స్వదస్తూరీతోనున్న విల్లుగనుక కైంకర్యమొనర్చినచో నున్నచర స్థిరాస్తి నన్నదమ్ములిద్దరును సమానముగా నేయల్లరియు లేకుండఁ బుచ్చుకొనవచ్చునని

యు వారుదలంచి మీరు పెరటిలోని కరిగినవిషయము గని పెట్టి యెట్లో యావిల్లు గైంకర్యమొనరించివైచిరి. సీపీవిల్లు సంగతి బైటబెట్టకుండ పోలీసుపరము జేసిరి. ఇప్పుడు నీవు విల్లుకొఱకే యాపెట్టె తెరచినను- విల్లుసంగతి మీముప్పురును దక్క- తదితరు లెఱుంగరు గాన- నీవసత్యవాదివయ్యెదవు. స్పష్టముగా దొంగవైగాన్పింతువు, కావుననే బందెబడితివి, కానిమ్ము. ఇది యాధారముగాఁ జేసికొని యావ్యవహారమంతయు బైటకుదీసి తీరెదను చూడుము.

గోవిం—బాబూ! కవీశ్వరు లెవ్వనినో యొకనిని దొంగగానో, హంతకునిగానో నిశ్చయించి- గ్రంథనిర్మాణమొనర్చుచు తనవ్రాత కనుగుణ్యముగా సర్వవిషయములును జర్చించుచుందును. అట్టికృతిప్రియనవలలను జదువుటచేఁగాఁబోలును మీరును సట్లేచర్చించిరి. ప్రతివిషయమును మీయూహ కనుగుణ్యముగా నుండుననుకొనుట మీకును- లోకమునకును గూడ మంచిదిగాదు.

రాజా—గోవిందూ! నేను పొరబడితినందువా?

గోవిం—పొరబాటుగాదు. ఆవిషయమున మీరింకను జర్చింపవలసిన ముఖ్యవిషయములు మరచి- యొక్కవిషయ మనుమానమున కవకాశమొసంగుటచేతనే- దానినిబట్టి తొందరబడుచుండిరి. అది యపరాధరహస్య పరిశోధకున కుండవలసిన గుణముగాదు. పూర్వాపరసందర్భము ల

న్నియు జర్చింపవలయును. అందు మొట్టమొదట రఘునాథరావుగారు విషప్రయోగముచే మరణించుట కేమి కారణము- ఆయనకు విషమిచ్చినవారును- ఈవిల్లు నపహరించినవారును నొక్కరేనా? లేకయిద్దరా? మాధవరావుగారు జీవించియున్నచో విల్లు దొంగిలినను లాభము లేదని వారూహింతురా? ఊహింపరా? అప్పుడు గల్గినసందియములచే మాధవరావును వారుజంపిరా? డాక్టరుగారి యభిప్రాయప్రకార మదిసహజమరణమా? ఇన్నిటికిని కారకులెవ్వరు? ఆకారకులే బలవంతరావువధకు కారకులగుదురా? కారా? అన్నిటికిని సుభద్రియే కారకురాలైనచో బలవంతరావు బలవన్మరణమున కేమి కారణము? ఆమెభర్తనామెయే జంపుకొనునా? అట్లు చంపుకొనుటలో నామెయభిమతమేమి? అందలి ప్రధానలాభమేమి? భర్తను జంపినయామె- అత్తగారినేల దాచును? ఈ విషయములన్నియు మీరుచర్చించి- యింకను నాదృష్టికందకుండ బోయినవిషయంబులుగూడ విచారణమొనర్చి కార్యసాధనకు గడంగుడు. మార్ఫియా యనువిషముగదా పాలలోగలిపి రఘునాథరావుగారి కిచ్చినట్లు నారాయణస్వామిగారు దెచ్చినయుత్తరములోనున్నది. అదియామె కెట్లువచ్చియుండునో యించుకూహింపుడు. అన్నిటిని సమన్వయమొనరించుకొనుడు. దుడుంగుమనగనే గేలము వేయకుడు. దానివలన సర్వారిష్టములును గలుగును.

రాజా—గోవిందా! ఈవిషయములన్నియు జర్పింప వలసిన ముఖ్యవిషయములని యెఱుంగుదును. ఇవి యూహాతీతములనియు నెఱుంగుదును. కట్టుకథలలోనున్నట్లు నిందుండదనియు నెఱుంగుదును. ఇన్నివిషయములలోనను మనకేవిషయ మందుబాటులోనున్న దానిని బట్టి ముందుజర్పించి పూర్వాపరవిషయంబు లన్నియు గలుపుకొనుచు గ్రమక్రమముగా నీహారము బూర్తిచేయవలయునుగాని, యూరకాలోచించుచుఁ గూర్చున్నచో నొకదానికొకటి సమన్వయము దొరుకక మెదడు చెరచుకొనవలసివచ్చును. కావున మును ముందాయిల్లును శోధించునెపంబున సుభద్రిగది శోధింపవలయును. ముందీపనికి నీవంగీకరింతువా?

గోవిం—తమ రిప్పుడు చెప్పినది నాకు నచ్చినది. నన్నేమిచేయుమని సెలవు?

రాజా—నేరమంతయు నీపై నున్నట్లులనే జరించుచు-ఆయిల్లు శోధించెదను. అందులకై నీవు నిగళబద్ధుఁడవై యున్నట్లే యుండుము. తరువాత కథయెట్లువచ్చిన నట్లువచ్చును.

గోవిం—చిత్తమట్లనే వచ్చెదను.

వెంటనే రాజారావు నారాయణస్వామిని బిలిపించి యాతనికి జెప్పవలసిన విషయంబులన్నియుఁ జెప్పి వెంటనే నల్వురు భటులనుదీసికొని- నిగళబద్ధుఁడైన గోవిందును దీసికొని మాధవరావుగారింటికరిగెను.



# అయిదవ ప్రకరణము.



## మూఁడుత్తరములు- మూఁడువిషయములు.

కామేశ్వరరావు రాతివిగ్రహమట్లు వీథిలో జైతన్యవిహీనుఁడై గూర్చుండియుండెను. లోఁగడపలోఁ బార్వతి గూర్చుండి యేడ్చుచునే పెద్దన్నగారి నోదార్చుచుండెను. ఆయొడిలోఁ గుమార మాధవరావేమియు దెలియనికతమున నిశ్చింతగా నిదురబోవుచుండెను. ఒడలు దెలియని దుస్థితిలోఁ బడియున్న సుభద్రచెంత శ్యామల గూర్చుండి యోదార్చుచుండెను.

ఇన్నికష్టములు వీరికి దాపురించినను వీరిసమీపబంధువు లెవ్వరును- నేకారణమునవచ్చియుండలేదు. ఒకరినొకరోదార్చుకొనుచు- ఒకరికొకరు దిక్కై- యీనల్వురే కాలక్షేపము జేయవలసివచ్చుచున్నదిగాని కష్టకాలమున కాదుకొనువా రెవ్వరును గానరారైరి. మిగుల సమీపబంధువైన రాజారావు వారి కుపకారమొనర్చుచు పోలీసువారితోఁ దిరుగుచుండెను.

ఇట్టి సమయమునకు సరిగా రాజారావు వచ్చి పోలీసువారితోఁ లోనప్రవేశించి పరిశోధనకై గడంగెను. ఈరాజారావుసంరంభమంతయు గాంచుచున్న పార్వతి యాలక్షణములన్నియు గనిపెట్టి యుంచుక సమీపమునకరిగి క్రోధవిచారంబులు బెనంగొన—మరల నీయడావిడియంతయు నెందులకు?

రాజా—ఇప్పుడనావిడి యేమి చేయుచుంటిని?

పార్వ—కొంపగూలి మేమేడ్చుచుండ నిల్లుశోధించి మాకింకను విచారమొనగూర్చెద వెందులకు? నీకిది భావ్యమా? మాకుబంధుగుడవైయుండియు మా కపకృతిసేయనెంచుట నీబోటిప్రాజ్ఞులకు యుక్తధర్మమా?

రాజా—ఇందు మీకపకారమేమున్నది?

పార్వ—ఏమున్నదని యడిగెద వెందులకు? అంతయు నపకారమే. నాకు గానివా రెవ్వరీయింటియందు లేరు. ఇప్పుడు జీవించియున్నవా రెవ్వరో నేరస్థులై యుండవలయుననియు నందుల కనుగుణ్యమగు దృష్టాంతములేమైన దొరకునేమో యనియు నీయభిప్రాయమై యుండవచ్చును. కాని మున్నుదబలలమున్నా ఒక్క పురుషుడున్న మాత్రమే జీవించియున్నాము. మమ్ము గూడ సర్వనాశన మొనరించి:—

రాజా—హరహర! ఎంతమాట మిమ్ము సర్వనాశన మొనరించితిమా? అనఁగా మీయింటజరిగిన యీహత్యలకన్నియు నేను కారకుఁడననియా నీయభిప్రాయము.

పార్వ—ఇదిగో! ఈప్రత్తరము నాపరుపుక్రింద కెట్లు వచ్చినదో నాకు తెలియదు. ఇది చదివి నీయభిప్రాయమేమి యో చెప్పుము.

రాజారా వాయి త్తరముందుకొని కంపితస్వరముతో నిట్లు చదివెను.

ప్రియా!

నీతో ముఖ్యముగాఁ గొన్ని విషయములు - అనఁగా మీకు దాపురించిన కష్టములను గుఱించియు తన్నివారణము నుగుఱించియు - మాటాడవలయునని యనుకొని నాయనుమానములు ఋజువుచేయుటకు దగినన్ని నిదర్శనములు లభింపమి నేను బయటబడినలాభము లేదని యీయుత్తరము వ్రాసితిని. నేను వినినవిషయములు వ్రాయుచుంటిని. రాజారావు దొంగ. కొన్ని కారణములచే గృహస్థులతో జోక్యము జేయుచున్నాఁడు. ఆతనితండ్రి యగు దొంగలనాయకుని నీతండ్రి మట్టుబెట్టెను. అది యాతని బాల్యవృత్తాంతము. ఇటీవ లాతనికీయుదంతము తెలిసినది. అందుచే మీకుటుంబముపై నాతఁడీర్ష్యవహించి మీకుటుంబనాశనమునకై గడంగెను. మీకెవ్వరికిని యీరహస్యము దెలియక వానిని నమ్మితిరి. మీవెఱ్ఱి నమ్మకమే మీకీముప్పు దెచ్చుచున్నది.

నేను కండ్లారజూచిన విషయములు:—నిన్నఁటిరేయి యాకస్మికముగా నీరాజారావు నీచిన్నన్నగారిశిర మొకమారువాఁడీయింటఁబడవైచెను. తిరిగివచ్చుచుండఁగనే నేనాతనితో మాటాడితిని. వెంటనే లాలామారువాఁడీని బట్టినచో మీచిన్నన్నశిరము దొరకవచ్చును. మారువాఁడీ యీవిషయమున నిర్దోషి. మీతండ్రిగారికి పాలలోఁగలిపి యిచ్చిన

విషము సుభద్రిట్రంకులోనున్నది. దానివలన మీకొక కొ్రొత్తసంగతి తెలియవచ్చును. త్వరపడుము.

ఇట్లు.
"నీక్షేమియుఁడు."

సరే. ఆవిషయములు తరువాత చర్చించుకొందము. మునుముందు సుభద్రిగదిని యందున్నట్రంకును శోధింతము. ఈలోపున లాలానుబట్టి శిరముతో నిక్కడికి రప్పింతము. ఆరెండునిదర్శనములును జూచినతరువాత—

"తరువాతనింకేమున్నది? ఇందున్న యీరెండువిషయములును సత్యమైనచో దక్కినవిషయంబులును సత్యంబులని నమ్మవలసినదే" అని పార్వతియనెను.

"అట్లేకానిమ్ము" అని రాజారావని వెంటనే యిరువురు పోలీసువారికిఁ జెప్పవలసినవిషయములు జెప్పి లాలాయింటికి వారిని బంపించి వెంటనే పార్వతిని వెంటబెట్టుకొని సుభద్రిగదిలోనికి బోయెను.

ఆగదియందొకమూల సుభద్రిబడి యూరక యెగరోజుచుండెను. ఆమెనోదార్చుచు శ్యామలగూడ నాగదియందే యుండెను. వచ్చినవారినెల్ల దిలకించి శ్యామల వెంటనే లేచి వెక్కివెక్కి యేడ్చుచు:—

రాజా! నిన్నింతకాలము సోదరాయని బిలచినందులకు మిగుల విచారించుచున్నాను. చిఱుతరాబాల్యమునుండియు

నాతండ్రిసముఖమున బెరిగినను నాసుగుణాత్ముని గుణము లొక్కటియైనను నీకుఁ బట్టలేదు. విత్తొకటి వేసిన మొక్క యొకటి మొలచునా దుర్మార్గుఁడా ? మూఁడుపువ్వు లాఱు కాయలుగానున్న సంసార మిట్లు సర్వనాశన మొనరింతువా దుర్మతీ ! నాయత్తమామలను నామరదినిగూడ నీపొట్టబెట్టు
ఛీ ! ఛీ !—

రాజా—అమ్మా ! శ్యామలా ! ఒకనిముష మాగుము. తరువాత నీచిత్తమువచ్చిన శిక్ష నాకు విధింతువట లెమ్మా. నీమరదలికివచ్చిన లేఖచూచి యిట్లాగ్రహపడుచుంటివి. అందున్నవిషయములుగూడ గమనించనిమ్మా.

శ్యామ—నీదుర్గుణములనుగూర్చి మామరదలి కొక లేఖ దొరకినదా ? నాకొక లేఖ వచ్చినది చూడుము.
సోదరీ ! శ్యామలా !

ఈనీనూతనసోదరుని నీ వంతగా నెఱుంగవు. నాసంగతి ముందుముం దెఱుంగఁగలవు. రాజారావు నీపినతండ్రి కుమారుం డని యనుకొనుచుంటివి. కాదు. అందులకుఁ దగిన దృష్టాంతము లున్నవి. చూపఁగలను. వాఁడే నీయత్తవారి కొంప కష్టమశని. తెలిసియుండియు మోటారు మీమామగారిపైనుండి పోనిచ్చెను. అంతమాత్రమునఁ జావడని తెలిసి మెట్లోమాయజేసి మార్ఫియా యనువిషము పాలలో గలిపెను. ఒక్క టనుమాటయేమి. మీయింటజరిగిన దారుణము

ల కన్నియు నాతఁడే కారకుఁడు. కాకినాడ D. S. P. ఆఫీసుకు వెడలుదునని మీ కెల్లరకును జెప్పి మిమ్ము మాయజేసి తనజట్టువారిని గలిసికొని కుట్రచేసి నాఁటిరాత్రి కింటికి రాక యర్ధరాత్రిదాఁటినతరువాత వచ్చెను. ఆతఁ డొనర్చిన కుట్రచే యప్పటికప్పుడే నీమరది దివం బలంకరించెను. నీ విప్పు డీగృహయజమానురాల వైతివి. నీభర్త కిట్టివిషయము లంతగాఁ దెలియవు. నీవే వేయికళ్ళతో జూచుకొనకున్న మీ కెల్లరకును సంఘమరణము తప్పదు. త్వరపడుము.

ఇట్లు,

" నీకుఁ గాఁబోవు సోదరుఁడు "

అమ్మా! శ్యామలా! నీవుగూడ నీవిషయమున నొక్కనిముషముమాత్రి మోపికవహింపుము. ఈలోపున నీమరదలికి వచ్చినలేఖ జూడుము.

అని యాయుత్తర మామె కిచ్చి వెంటనే సుభద్ర ట్రంకుపెట్టె దెరచి యదిపరిశోధించి చూచెను. అందొకచిన్నసీసాయొక టున్నది. దానిని పైకిదీసి చూచెను. దానిమీ దాంగ్లేయభాషలో 'మార్ఫియా' అని వ్రాయబడియుండెను.

'సరే' అని దానిని వెంటనున్న కానిస్టిబులున కిచ్చి యందున్న బట్టలన్నియు దులిపి చూచెను. ఏమియు గాన్పింపలేదు. బట్టల కడుగున మాసిపోకుండనుండుటకై పఱచిన చిత్తుకాగితములను దీసివైచెను. ఆచిత్తుకాగితములక్రింద మడ

చిన నొకకాగిత ముండెను. అది యేమయియుండునా యను సంశయముతో దీసి చూచెను.

సాశ్చర్యముతో నొకటిరెండుమారులు చదివి యది యట్లే చేతఁబట్టుకొని తనసోదరిని, మరదలు పార్వతిఁ బిలచి యి ట్లనియెను.

పార్వతిపేరవచ్చిన లేఖలోనున్నటుల ' మార్ఫియా ' యీపెట్టియందున్నది. మారువాఁడీలాలాయింట నాచినబావ బలవంతరావుశిరముగూడ లభింపవచ్చును. మీా కిర్వురకు వచ్చిన యుత్తరములందును నాపై నేరారోపణజేయబడియు న్నది. ఏమిరా పరమేశ్వరా ! అని యొకకంటనేడ్చుచునే నీర హస్యమును భేదించుటకై బ్రియత్నించుచుంటిని. శ్యామలా! నీవు నాయనగారికి చేదోఁడువాదోఁడుగానుండి యనేకరహ స్యవిషయంబులయం దత్యంతశ్రిమకోర్చి కార్యసాధన మొన గూర్చుచుండెడిదానవు. ఈపార్వతిగూడ విద్యావంతురాలును వివేకవంతురాలును గాఁన సామాన్యకన్యగాదు. ఇప్పుడీసుభ ద్రిట్రింకులో నొకలేఖ దొరకినది. ఇదివఱకు మనముచూచి న లేఖల కిది విరుద్ధముగా నున్నది. చదువుచుంటిని వినుఁడు.

నెచ్చెలీ !

నీయభిప్రాయానుసారముగా శ్యామలాపార్వతుల కిర్వు రకును జెరియొక యుత్తరమును వ్రాసి యిందుతో బంపితిని. ఆయాయుత్తరములు నీనేర్పుచూపి వారి కందజేయుము.

ఒక్కమారుగా మన మనుకొనినకార్యము లన్నియు జరిపిన
చో నిందయు - చెఱయు - నీకు దప్పదు. రాజాగా వసవా
యశూరుఁడు. వానియడ్డముదీరినగాని మనకు జయము దొ
రుకదు. శ్యామలాపార్వతుల యుత్తరములు రెండును బ్రజల
లో బడినచో నాదుర్మార్గునియడ్డము మనకు నిశ్చయముగా
దీరును. అదితీరినవెంటనే శ్యామలకు మార్ఫియా ప్రయో
గించుము. తరువాత కామేశ్వరరావు. ఈరెండును దీరినచో
బార్వతి మనపాదదాసురాలయితీరును. ఆమెయునికియు -
నీయునికియు లోకమునకు దెలియకుండజేయుభారము మాది.
చరస్థిరాస్థులకు నీకుమారుఁడు హక్కుదారుఁడు గనుక-
నీవు వానికి సంరక్షణురాలవు గనుక స్థిరాస్థి క్రమక్రమముగా
విక్రయించి రొక్కముగా మార్చుకొని మననిర్ణయస్థలమున
కేగవచ్చును. ఇం కొకరహస్యవిషయము నీతో ముచ్చటింప-
వలసియున్నది. ఈరాత్రి నీచెంత నెవ్వరునుండకుండునట్లొన
రించుకొని యర్ధరాత్రివేళ మెల్లగా నానివాసస్థలమునకు
రమ్ము.

ఇట్లు,
నీభవితవ్యప్రియుఁడు.

ఆయుత్తరమును విని యందఱాశ్చర్యభరితులైపోయిరి.

అగునా! ఇప్పు డీయుత్తరమువలన మీయిరువురి
హృదయములును నిష్కళంకములయి యుండునని భావింతును.

ఇందు నావ్యాఖ్యాన మగత్యము లేకుండగనే మీ కర్థమయి యుండును. ఇం దింకను మీ రెవ్వ రెఱుంగని రహస్యము లున్నవి. మొదటినుండియు నేగనిపెట్టుచునే యున్నాను. ప్రి ప్రథమమున నా కీమెపయి ననుమానము గలిగియే నేను కాకి నాడ వెడలవలసివచ్చినప్పుడు నారాయణస్వామిగారితో నొక యువతినిగుఱించి చెప్పితినిగాని - యామెనామ మెఱుంగఁజే య లేదు. ఆమెయనుచరులే గాఁబోలు నాఁడు "రాజా! రెండుమూఁడుదినములలో నీమరణశాసనమును దయారుజేసు కొమ్ము" అని హెచ్చరించిరి. వారినప్పుడు వెన్నాడవలయు నని చూచితినిగాని చీఁకటిలో వా రేదిక్కునకుఁ బోయిరో తెలిసినదిగాదు. వెంటనే లోనికివెడలి లోనివారిని బరీక్షించి తిని. "ఇఁకభయములేదు." అను మాట యస్పష్టముగా వినంబడినది. ఈవాక్య మెవ్వరనిరా యని గమనించితిని. కని పెట్టితిని. ఆమె సుభద్ర.

ఇఁక రెండవవిషయము :—రఘునాథరావుగారు చని పోవుటచే మాధవరావుగారు మీ కేరికిని దెలియకుండ తన యాస్తి యెవ్వరెవ్వ రెంతెంత యనుభవింపవలయునో మరణ శాసనమును వ్రాసి- తన కాంతరంగికసేవకుఁడగు నీగోవిం దుతో నీవిషయములనుగుఱించి ముచ్చటించుచుండఁగా నెవ్వ రో తమరహస్యమును వినుచుండిరను యనుమాన మొదవి గోవిందు వెంటనే వెడలి చూచెనట. యొకయువతి పెరటిలో

మల్లెపాదమూటునఁ దనభర్తతోఁ గూర్చుండి మంతనములాడు చున్నదఁట- అప్పు డామెయొడిలోనున్న బాలుఁడు లేచుటచే "సుభద్రా! మాధవుఁడు లేచినాఁడు. మన మిప్పు డేమని నను నిందాపాత్రుల మగుదుము. తరువాత నీవిషయమై యాలోచించుకొందము. పోయి పరుండము రమ్ము" అని బలవంతరా వనియెనఁట.

అని యానాఁటియుదంతమంతయు నెఱుంగఁజెప్పి మఱి యు నిట్లనియె.

ఇఁక మూఁడవవిషయము:—బలవంతరావు చనిపో యిన నాఁటిరేయి యింటఁజొచ్చిన దొంగలు కామేశ్వరరా వును, శ్యామలను, పార్వతినిమాత్రము బెడరెక్కలు విఱచి కట్టి నోటగుడ్డలుగ్రుక్కి తలక్రిందుఁగా వ్రేలాడ దీయంబడి యుండిరనియు, సుభద్రయు గట్టివేయబడియే యుండెనుగాని తలక్రిందుఁగా వ్రేలాడ దీయఁబడలేదనియు రక్షకభటు లె ఱింగించిరి. ఇది సత్యముగువృత్తాంతమేగదా? ఆలోచించిచూ చినచో నిందెంతటి కుటిలమున్నదియో మీమీమనంబుల యందూహింపుఁడు. కామేశ్వరరావు, శ్యామల, పార్వతి యీముగ్వురును వ్రేలాడదీయంబడియుండ, సుభద్ర యట్లు లేకుండుట కేమికారణము? ఈమెచంటిబిడ్డ తల్లియనియా వచ్చినవారు కనికరించిరా? అట్లుకనికరించినచో నేదియైన నొక స్తంభమునకైనను గట్టవలయునుగదా? అట్లు గట్టకుండు

టకేమి కారణము? ఒకానొకవేళ మీరిదివఱ కనుమానపడి
యున్నట్లు నాయనుచరులే యీకార్యమునకు గడంగినచో
నాసోదరిగదాయని శ్యామలయెడ గనికారముంచి యుందు
రుగాని- సుభద్రయెడ జాలివహించుట కేమికారణము? అం
దులకును సమాధానమున్నది గాని లేకపోలేదు. శ్యామలను
గట్టక విడచినచోఁ జెల్లెలుగదా యని లోకు లనుమానింప
వచ్చుననియు- అందఱికంటె నెక్కుడుగా నామె నే కష్టముల
పాలుజేసినచో- ఎంతటి దొంగయైన చెల్లెలి నిట్లు బాధించు
నా యనుసంశయముతో నన్ననుమానింపరనియు దలంచి
యట్లు జేయించియుందునని యనుకొనవచ్చును గాని యది
నన్ను నేరస్థునిగా నిరూపించుటకు దగినంతబలమైన సాక్ష్య
ముగాదు. ఈరహస్యవిషయంబున నేమేమియో చాలరహ
స్యంబు లిమిడియున్నవి. ఒకదానికొకటి గొలుసువలె నతుకు
కొని పోయినవి. విడదీయుట మిగులప్రయాస. ఇన్నిదృష్టాం
తములు గుదిగుచ్చినట్లు గాన్పించుచున్నను సుభద్రను పుట్టిను
దుఃఖములోనున్న సుభద్రను- బాధించుటకు- బంధించుమని
పోలీసువారి కనుమతియొసంగుటకు- నామనం బంగీకరింప
కుండ నున్నది. మాధవరావుగారు వ్రాసిన విల్లేమయిపోయి
నదో యీమెవలననే మనకు దెలియవలసియున్నది. నాఁటి
రాత్రి చీఁకటిలో దనకును- తనభర్తకును జరిగిన రహస్య
సంభాషణ మామూలచూడముగా నెఱిఁగింపవలయును. వీ

రికొఅను నిర్ణయింపబడినగదిలో వీరెట్టివిషయంబులైనను మా
టాడుకొనవచ్చునే. ఎవరికివారే యేష్పచుండ వీరిసంభాష
ణము వినవలయునను కుతూహల మెవ్వరికి ? తండ్రిచచ్చి-
తాతచచ్చి- యేష్పచుండఁగా- పోలీసువా రిల్లు ముట్టడించి
యుండ- పరహాస్యము వీరాత్మోటతో మాటాడియుందురు.
పురుగుపుట్రల భయములేక- నలువురును జూచిపోవుదురే
మోయను భయముతో దీపమైనను లేక- నీరుమాట్లాడుకొ
నిన మాటలును, కట్టకడపట "మానమిప్పు డేమనినను నిందా
పాత్రులముగుదుము." అని బలవంతరావనిన వాక్యావసర
మును- దాని సమన్వయమును మనమీ సుభద్రవలనఁగాని-
ఈమె చెప్పకున్న నితరమార్గములమూలమునఁ గాని గని
పెట్టవలయును. అప్పుడింతున్న చిక్కుల్లు విడిపోవును గావున
పరిస్థితమీమెను దొరతనమువారిపేరిట బంధింపకతప్పదు.
దగ్గఱబంధువుండనై యుండియు నిప్పుట్లనీమెకు సహాయము
జేయజాలనందులకు మిగుల విచారించుచున్నాను.

అని వెంటనే సుభద్రను బోలీసువారి వరముగావిం
చెను. పోలీసువారును మర్యాదగా నామెనొకబండిపై నె
క్కించి కుమారర మాధవరావుతోఁగూడ చెరసాలకు దో
డ్కొని పోయిరి.



# ఆఱవ ప్రకరణము.

—————

## ప్రళయములో—ప్రణయమా?

"శ్యామలా! నీతోఁ గొన్ని విషయములు ముచ్చటింప
వలసియున్నది. అంతకుముందుగాఁ బార్వతితోఁ బ్రసంగింప
వలసియున్నది. కావున నీవొకమారు లోనికిఁబొమ్ము. బావ
మిగుల నమాయకుఁడు. జరిగిన దారుణముల కాతఁడు విశే
షముగా బెదరియున్నాఁడు. ఆతఁడు సత్యసంధుఁడే గాని కృత్రి
మము లెఱిఁగినవాఁడు గాఁడు. ఊరక వీధియరుగుపైఁ గూర్చుం
డి విచారించుచున్నాఁడు. ఆతనిని లోనికిఁబిలిచి యెట్లో యో
దార్చుము. ఇంతలో నేను పార్వతితో ముచ్చటించివచ్చె
దను." అని రాజారావనియెను.

అన్నయ్యా! నాగుండెయు జెదరిపోయినది. కలకలలా
డుచుఁ మూఁడు పువ్వులాఱు కాయలుగా నున్నకుటుంబ మిట్లు
ఘటికలో సర్వనాశనమైపోవ గుండె చెదరకింకేమియున్నది?
మీబావగారి కేమని ధైర్యముపదేశింపఁగలను? ఉన్నట్లుండి
యీతుట్ట చెల్లిపైఁబడినది. ఇదెంతవఱకు సత్యమో తెలి
యదయ్యెను. అది సత్యమైనను నంతతో మనస్స్వస్థతగలుగ
దు. ఆమెసహాయులు పెక్కుమంది యుందురు. ఆమె బాధిం
పఁబడినదను సంగతి తెలిసి వారూరకుందురా? మఱింకను
పెక్కుకష్టముల పాల్పఱతురేమోయని భయంబగుచున్నది.

నాన్నగారు పేరుమోసిన యపరాధరహస్యపరిశోధకులు. టెల్లిగ్రాములిచ్చి వారిని రప్పింపరాదా? మావారికి చాలమంది బంధువులుగలరు. ఒకరికొకరు సహాయముగా బదిమంది యుం టున్న యిట్టిసురంతములు జరుగుట కవకాశముండకుండ నుండునేమో? వారినైనను బిలిపింపరాదా?" అని శ్యామల యనెను.

అమ్మాయీ! అందఱకును టెలిగ్రాములు వెళ్ళినవి. జవాబులులేవు. ఎవ్వరును రాలేదు. తరువాత నీవుచెప్పినవిష యములు మాటాడుదము నీవు బొమ్మ."

అని రాజారావనఁగనే యామె వెడలిపోయెను. తరు వాత రాజారావు పార్వతిని మెల్లగా దోటలోనికి దోడ్కొని పోయి యొకవృక్షచ్ఛాయను గూర్చుండఁజేసి యామె కించుక సమీపముగా రాజారావుగూర్చుండి:—

బాలా! కష్టములు ప్రాణికోటికి వచ్చుట సహజమే గాని బెడగొండలవలె నిన్నికష్టము లొక్కమారుగా సంభ వించినచో భరించుట దుర్ఘటమే. నీవంతయో- యింతయో చదువుకొన్నదానవుగాని మూర్ఖురాలవుగావు. ఇప్పుడు నీవు విచారింపవలసిన సమయముగాదు. మీరిప్పుడు శత్రుమధ్య మునందున్నారు. అయిన పెద్దలంతరించిపోయిరి. సజీవమైయుం డవలసిన మీయమ్మగారేమైపోయిరో- జీవించియుండిరో- లేక దురాత్ములచే హతులైపోయిరో గనిపెట్టుట దుర్ఘటము. నీ

చిన్నవదినె యపరాధినియను నెపంబున బందీకృతయైయున్నది. ఇంక నీయింటియందు మీరుమువ్వురునునుండిరి. నీవును నీయన్నగారును నీయింటివారేగదా? మీవదినె లిద్దరేపైవారు. పట్టఁబడిన సుభద్రనుగూర్చియు యింటనున్న శ్యామలగూర్చియు నీతో ముచ్చటింపదలంచితిని. ఒకవేళ నీ నేరమంతయు మాశ్యామలమీఁదికివచ్చినను నేనామెను బట్టకమానను. ఉరికంబమెక్కింపకమానను. కులమునకువచ్చినకళంకము తొలగించుకొనకమానను. న్యాయమునకెవ్వరైననొకటియే. తల్లి పిల్లయని చూచుకొనరాదు. కావున నాయాశయమేదియో గ్రహించి నాప్రశ్నలకనువగు సమాధానమిమ్ము.

"నాఁటిరాత్రి గోవిందు యినుపపెట్టితీయుచుండఁగా నీవు చూచి వానిని బోలీసుపరము జేసితివిగదా? నాఁడాసమయమున నినుపపెట్టిదెఱచినట్లు నీకెట్లు దెలిసినది?" అని రాజారావు ప్రశ్నించెను.

రాజారావు వాక్యములన్నియు వినుచున్నంతవఱకును పార్వతి యధోముఖియై యేడ్చుచు గోటితో భూమిపైగీయుచునుండెను. ప్రశ్నవినఁగనే యామె స్పృహ దెచ్చుకొని కన్నీరు దుడిచికొనుచు—

"బావా! ఇప్పుడెందుకాప్రశ్న?" అనెను.

రాజా—ఇప్పుడేకావలయును. నీవేవిషయముదాఁచి

నను గొంపలుమునిఁగిపోవుననుసంగతి జ్ఞాపకముంచుకొమ్ము.
నాప్రశ్నకు సమాధానమిమ్ము.

పార్వ — ఆసమాధానము వినుట తటస్థించినచో నా
చిన్నవదినెపై నేరమింకను బరువగును.

రాజా — ఎందుచేత?

పార్వ — ఆమె మాచిన్నన్నతో మాటాడుచు- ఇనుప
పెట్టి- మాటదెచ్చినది. అప్పుడే మెలకువవచ్చిన నాకామా
టవినబడి చటాలున లేచి వాఁగదిలోనికి బోయితిని. ఆదృశ్య
ము నాకంటబడినది. గోవిందు చెప్పినది సత్యమని నేనెట్లనుకొ
నఁగలను. ఏమియుదెలియక వానిని పోలీసుపరముజేసితిని.
నీవు చెప్పినగొడబయంతయువిని యిప్పుడు సమన్వయించుకొన
నర్థమైనది.

రాజా — సరే. ఆవిషయము మఱలించుము. ఈమెపుట్టినిం
టివారి గుట్టుమట్టు లీవేమైన నెఱుంగుదువా?

పార్వ — నాకెట్లు తెలియును?

రాజా — పోనిమ్ము. నీకు తెలియదగినవిషయమును-
తెలియుటకవకాశమున్నవిషయమును నడిగెద దానికి సందే
హింపకుండ జెప్పుము.

పార్వ — నేనెరిగినచో నెట్టిరహస్యమును దాచుకొన
ను. అడుగుము.

రాజా — నీ చిన్నవదినగారు- రహస్యముగా- నెన్నడై

న- పరపురుషులతోగాని- స్త్రీలతోగాని మాటాడుచుండఁగా నీవు గాంచితివా?

పార్వ—నే నెన్నడునుజూడలేదు.

రాజా—పోనీ యట్టివదంతియేమైన నున్నదా?

పార్వ—ఒకనాడు మాచిన్నన్నభార్యను మందలించుచు "పోలితో నీకున్నరహస్యమేమి? అది తార్పుగత్తె. ఆమెతో మాటాడుటగాని- ఆమెకేమైనఁ బెట్టుటగాని వలదని హెచ్చరించెను. ఇంతకంటె నాకేమియుదెలియదు.

రాజా—ఆపోలి యెవ్వరు?

పార్వ—మాపొరుగువారి దాసీదానితల్లి.

రాజా—దాని యిల్లెక్కడ?

పార్వ—మాకోట్టసమీపమున.

రాజా—మీయిరుగుపొరుగువారిలోనున్న యువకులెవరైన మీయింటికివచ్చుట కద్దా?

పార్వ—ఈ యిరుగుపొరుగువా రంతగారారుగాని- పెద్దబజారువీధియున్న కపిలవాయి శంకరరావుమాత్రము నిత్యమువచ్చుచుండెడివాఁడు. అతఁడును మాచిన్నన్నయు జతురంగమాడుకొనుటగలదు.

రాజా—అతఁడు నిన్నుగాని- మీవదినెలనుగాని పలుకరించుట గలదా?

పార్వ—ఆతనికి మాయింట నెట్టి యభ్యంతరమును

లేదు. మా నాన్నగారుకూడ మిక్కిలి చనవుగా మాటాడెడి వారు. ఇంట నేదిచేసుకొనినను మాయమ్మ వానికిబెట్టకుండ నుండెడిదిగాదు.

రాజా — అంతచనవుగావచ్చెడినాఁడుగదా? ఆతఁడు మిమ్మెవ్వరినైన వేళాకూళములాడెడివాఁడా?

పార్వ — నన్ను చెల్లీ! యనియు, వదినెను వదినెగారూ! యనియు బిల్చుటయేగాని వేళాకోళములాడియెఱుఁగఁడు. చిన్నవదినెకు నవలలు చదువుటయందు ప్రీతి మెండు. అందుచే నామె యాతనిచే నేవైన నవలలు తెప్పించుకొనుచుండెడిది.

రాజా — సరేగాని మా శ్యామల వర్తనాదులుగూడ నెఱింగింపుము. ఆమెయు శంకరరావుతోఁ జనువుగా మాటాడెడిదా?

పార్వ — ఆమె యెవ్వరితో నైనను ముభావముగనే మాటాడును.

రాజా — ఆమె యనవరత మిరుగుపొరుగిండ్లకు వెడలుటగాని- పోలితో మాటాడుటగాని- లేక మీదాసితో మాటాడుటగాని కలదా?

పార్వ — సర్వవిధముల దనతో సమానమైనవారితో నైన నాయిల్లాలు ముభావముగనే మాటాడునన- నీచకాంతలకు జనువొసంగునా? ఆమె నేవిధముగను వ్రేలువంచి

చూపించుట కవకాశము లేదు.

రాజా—సరే. కామేశ్వరరావుబావ యెట్టివాడు?

పార్వ—మా అన్నయ్య నిజముగా బెద్దన్నయే. ఆతనికి తెలివితేటలేకోశమునను లేవు. శుద్ధబుద్ధావతారము. కాని చెప్పినపనిమాత్రము మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ జేయును. మాయమర్మమెఱుఁగడు. భార్యయే తనప్రాణాధిక్యయని తలంచువాఁడు. మావదినెయు, భర్తయే తనదైవమని భావించునది. అట్టిదాంపత్యము సాధారణముగాఁ జూడబోము.

రాజా—నీచిన్నన్నగాని- పెద్దన్నగాని వేరింటికాపురమున కెప్పుడైనఁ బ్రయత్నించెనా?

పార్వ—రెండుమాసములక్రిందట మాచిన్నన్న- భార్యప్రోత్సాహముచే వేరింటికాపురమునకుఁ బోదుననియు తనభాగము తనకు బంచుమనియు నల్లరిబెట్టెను. అప్పుడు తాతయు బెద్దవదినెయు వారిని బ్రతిమాలి యుప్రతిష్టరాకుండజేసిరి.

రాజా—మంచిది. ఇఁకనీవిషయమైప్రశ్నింతును. సిగ్గుపడకుండ- నీహృదయము దాచుకొనకుండ సర్వమెఱింగింపుము. నీకు మేలుగూర్చెద. నీకిదివఱకొక సంబంధము గుదిరెననియు- ఆసంబంధము జేసికొన నీవంగీకరింపలేదనియు వింటిని. ఆసంబంధ మెవ్వరిది? నీ వెందుల కంగీకరింపవైతివి?

పార్వ—ఆవరుఁడంత చదువుకొనినవాఁడు గాఁడు.

రూపముగూడ మనోహరమైనదిగాదు. సంపత్తి మాత్రము గలదు. నాకాసంబంధము పైకారణములచే నచ్చలేదు.

రాజా—ధనము మాత్రముగలదా? ఆసంబంధమేది?

పార్వ—జల్లూరు కాపురస్తులు. వారియింటిపేరు నీలకంఠమువారు. వరునిపేరు రాఘవేంద్రరావు. ఆతనికి తండ్రి లేడు. తల్లిగలదు. ఒకవిధవఆఁడుపడుచు గలదు.

రాజా—ఈయూరిలో మీలో సంబంధముజేయుట కేరికైన నుత్సాహముగలదేమో నీకేమైన దెలియునా?

పార్వ—నాకు తెలియదు.

రాజా—నీహృదయ మిదివఱ కేరికైననర్పించితివా? సిగ్గుపడక తెల్పుము. నిన్నిట్లెందులకు బ్రశ్నించుచుంటినో తెలిపెదవినుము. నీకువచ్చినయుత్తరములో "ప్రియా!"అని నిన్ను సంబోధించెను. ఆతఁడు నిన్నుద్వాహమాడుటకై యత్నించుచున్నట్లు పొడగట్టుచున్నది. ఆతఁడెట్టివాఁడో తెలిసికొన వలసియున్నది. నీవెవ్వనినైన వరించినచో నిన్నాతనియొద్దఁ జేర్చి యికనైన సుఖముగూర్చెదమని నాతలంపు. నీవు సిగ్గు పడినను- తద్రహస్యము నాకెఱుంగ జెప్పకున్నను నీవింకను జిక్కులలో బడిపోదువు కావున సిగ్గువిడచి నీప్రియుడెవ్వఁడో చెప్పుము.

పార్వతి రాజారావువైపుజూడక ప్రక్కకు జూచుచు నేదియో పనిగల్పించుకొని యొకయెండుటాకునుదీసి దానిని

దు్రింపివైచుచుండెను. రాజారావు వాక్యములాలించుచుండెను. తనకుదాపురించిన కష్టములకై కన్నీరు గార్చుచుండెను. పాపమామెమాత్ర మేమి సమాధానముజెప్పగలదు. చెప్పుటకేమైన నున్నదో- లేదో- మనకు దెలియదయ్యె.

ఆమె మిగుల దుఃఖార్తయైయున్నదని గ్రహించి రాజారావామెవదన మించుక పైకెత్తి తనచేరుమాలుతో నామెకన్నీరు దుడుచుచు:—

వెఱ్ఱిదానా! నీదుఃఖమింతటంతట దీరునదిగాదు. నీవు జీవించియుండునంతకాల ముండునదియే. ఎంతయేడ్చినను శాంతియొదవనిదియేగాని నీవేడ్చుచుండ నూరకొమ్మనుదిక్కైనను లేదు. ఏడ్చియేడ్చి యెప్పటికైన నీకు నీవే శాంతింపవలయును. అనవరత మిట్లేడ్చుచున్న చిత్తవిభ్రాంతిగలుగవచ్చును. అప్పుడు నీ వింకను భ్రష్టవైపోదువు. ఇట్టియనర్థము లుత్పన్నముగాకముందె నీముందుసంగతి చూచుకొమ్ము. నీయభిప్రాయ మీషణ్మాత్ర మెఱింగించితివేని యది యాధారముగాగొని మాచెల్లితోడను - మీయన్నతోడను మాటాడి నిన్ను నీవారియండఁజేర్చి - వీరి నీయూరుదాటించి యీరహస్యపుటభేదన మొనర్చి మీయాస్తిసర్వస్వమును పూరిపుల్లయైన బోకుండ నిలువంబెట్టి మీది మీకొప్పగించి తలతడుముకొనెదను. నాయభిప్రాయ మెఱింగించితిని గాన నీయభిప్రాయ మెఱింగింపుము. విచారింపకుము." అని యనెను.

ఈవాక్యము లన్నియు నాలించి - రాజారా వుపదేశంబు లన్నియు జప్పించి - బాహుమనియేడ్చి యామెరెండుచేతులుతోడను రాజారావుకంఠమునఁ బెనవైచి యాతనివక్షస్థలంబునఁ దనశిరమాని - వెక్కి వెక్కి యేడ్చుచు:—

బావా ! నా కేమియుఁ దెలియదు. నే నెవ్వరి నిదివఱకు బ్రేమించియుండలేదు. నీవాక్యములవలన నే నింకను జిక్కులలో బడిపోదునేమోయని భయంబగుచున్నది. నే నెందును దిక్కులేనిదాని నైపోతిని. ఇఁక సర్వమునకు నిన్నే నమ్ముకొనకున్న నే నీనాఁడే భూమిపై లేనిదాన నగుదును. నన్ను నీయిష్టమువచ్చినట్లు దిద్దికొమ్ము. నామానప్రాణములు నీస్వాధీనమొనర్చుచుంటిని. రక్షింపుము."

అని యాతనియొడిలో బడిపోయెను.

ఔరా ! కాల మెంతవిపరీతస్వభావముగలది. కాలచక్రి మూరకదొర్లిపోవుచుండుటయేగాని యెవ్వరికొఱకును - దేనికొఱకునుగూడ నాగదుగదా ? పార్వతిగూడ యీకాలచక్రములోబడి దొర్లిపోవుచున్నది. తలమునిఁగిపోవుదుఃఖములోగూడ తనదారి జూచుకొన్నది. మోహము నంధకారముతో బెద్దలిందు కేబోల్తురు. ఇదియంతయు మోహముయొక్క ప్రభావముగా కిం కేమి ? ఆయంధకారములో బడినవెనుక నిం కేమైనఁ గాన్పించుట కవకాశమున్నదా ?

అట్లు తనయొడిలోబడిన పార్వతిని లేపనెత్తి తనయ క్కునఁ జేర్చుకొని చుబుకముఁ బట్టి:—

బాలా! ఇఁక విచారింపకుము. నీవు నాపాలబడి నా కత్యానందమొనగూర్చితివి. నాసంతోషమిట్టిదని వర్ణింపజా లకున్నాను గాని యిట్టిసమయంబున మనము సంతసింపరా దు. మనవిరోధిని మట్టుబెట్టి మనవారిఋణముదీర్చి యప్పుడు మనయానందబాష్పములతో బెద్దలకు తర్పణంబులు విడువ వచ్చును. నీవిక లోపలికరుగుము. నేను వెంటనే పోలీసుస్టే షనునకు వెడలవలసియున్నది. వేగముగా లాలాయుదంత ము గనుగొనవలయును.

ఆతరువాత వానిద్వారా యామె యనుచరులెవ్వరో యెఱింగి వారిని గూడ బట్టవలయును. మారు వాఁడీసంగతి తెలిసికొని మఱలివచ్చి మాశ్యామలతో మాటాడెదను. ఈ వ్యవహారము లన్నియు ముగియువఱకు మనవలపు సంగతి మా చెల్లికైనను జెప్పకుము: అన్నియు ముగిసిన వెనుక—సర్వ విధముల మనకు క్షేమము గలిగిన వెనుక యప్పటి స్థితిని బట్టి యాలోచింతము” అని రాజారా వనియెను.

పార్వ—అన్నిటికిని మిమ్మే నమ్మికొంటిని. అమ్మగారి ని జీవములతో నాకు జూపుట మీముఖ్య కర్తవ్యమని మరు వకుఁడు. శాస్త్రవులు నిముష నిముషమునకు మమ్మెదుర్కొ

నుటకు బ్రియత్నించుచునే యుందురు గాన—సమయము వచ్చినచో నుపయోగించుట కొక "పిస్తోలు" నాకనుగ్రహింపుఁడు.

రాజా—నీచేత నదియున్న బ్రమాదముగాదా ?

పార్వ—ప్రమాదము వచ్చువఱ కది యుపయోగింపనే యుపయోగింపను. అంతవఱ కది నాచెంత నున్నట్లెరికిని దెలియనీయను.

రాజా—నీకది బ్రయోగించు విధానము దెలియునా?

పార్వ—అది యిచ్చునప్పు డావిధానముగూడ మీరే చెప్పవలయును.

రాజా—సరే. తెచ్చి యిచ్చెద.

పార్వతి వెంటనే లోనికి వెడలిపోయెను. రాజారావేమేమియో యాలోచించుకొనుచు స్టేషనునకు బోయెను.

## ఏడవప్రకరణము.

### సుభద్ర చితాగ్నిగియా ?

రాజారావు పోలీసు స్టేషనుకు వచ్చునప్పటికి పదిగంటలు గావచ్చినది. అతఁడు స్టేషనుకు వచ్చినవెంటనే యొక రక్షకభటుఁ డెదురువచ్చి—

"బాబూ ! తమ సెలవుప్రకారముగా లాలానుబట్టి

దీసికొని వచ్చితిమి. ఆతఁ డాశిరమును బెరటిలో బాతుచుం డఁగా బోయి పట్టుకొంటిమి. తీసికొనివచ్చి స్టేషనులో లాక పు చేసితిమి. మీరు విచారించుకొనుఁడు" అని చెప్పెను.

మంచిది. అని రాజా దా వని లోనికి వెడలి స్టేషను రైటరును బిలచి కొన్ని కాగితములును గలమును సిరాబుడ్డి యు సిద్ధముగా నుంచుమని చెప్పి యింకొక కానిస్టేబులును బిలచి మారువాఁడీని వానితో నున్నమూటను దెమ్మని యా జ్ఞాపించెను.

నిమఃషములో మారువాఁడీ నిగళబద్ధుండై మూటతో వచ్చెను. ఆతఁడు వచ్చినవెనుక భటులనెల్ల వీధిలో నుండు న ట్లాజ్ఞాపించి సుభద్రియ దోడ్కొనిరమ్మనమని రైటరును బంపించెను. రైటరు వెడలి యామెను సగౌరవముగ దోడ్కొ నివచ్చెను. ఇంతలో నారాయణస్వామియును, సర్కిలు యినస్పెక్టరుగారగు లక్ష్మణసింగుగారును వచ్చిరి. రాజారావు వారికి నమస్కరించి వారినమస్కారము లందుకొని—

రాజా—అయ్యా! ఈనేర మెట్లును బయటికి రాక మానదు. ఇది నాస్వకుటుంబవ్యవహారము గాన మీకరో క్షమం దీమె నించుక ప్రశ్నింపవలసి యున్నది. మీకభ్యంత రము లేకున్నచో ననుజ్ఞనిప్పింపవచ్చును.

లక్ష్మ— ఈవ్యవహార మందరును వినవలసినదే గదా? ఇంకను రహస్య మేమియున్నది ?

రాజా—మన మీామె ననుమానించి బట్టుకొంటిమి గాని—నేరస్థురాలని ధృవపఱచి పట్టుకొనలేదు గదా? ఒక వేళ దైవానుగ్రహమువలన నీమె నేరస్థురాలు గానిచో— అప్పు డీయవమానమునకుఁ దోడున్న రహస్యములు వెల్లడి యైనచో దలవంపులు రావా ? అయిన నాయెడల మీా కీసంశయముండవలసిన పని లేదు.

లక్ష్మ—ఊరకడిగితిమి గాని—సంశయముండి గాదు. మీాయిష్టమువచ్చినట్లు మాటాడుకొనుఁడు. మేమావల నుందుము. మీారు బిలువగనే వత్తుము. రండి నారాయణ స్వామిగారూ !

వెంటనే యిరువురును వెడలిపోయిరి. వారి వెనుకనే రైటరు నిష్క్రమించెను. అప్పు డారాజారా వొక కానిస్టిబులును బిలచి మారువాడీని వాని స్వాధీన మొనర్చి పిలచిన వెంటనే దీసికొనిరమ్మని చెప్పి వాఁడు వెడలగనే తలుపులు లోన బిగించి యామె సమీాపమున వట్టినేలనే జతికిలబడి యించుక సేపూరకుండి యెట్టకేలకు రుద్ధకంఠసర్వముతో:—

సోదరీ! నన్ను నిందింపకుము. నామీాఁద గినియకుము. నీవు దోషివని నిరూపించుటకు దగినన్నినిదర్శనములన్ని లభించినప్పుడు బంధింపకవిడువరాదుగనుక బంధించితిని. నే నీవిషయంబునఁ గొన్ని ప్రశ్నలు నిన్నడుగ వలసియున్నది. వాటికి సదుత్తరము లొసంగితివేని నీవు నేరస్థురాల వగుదువో గా

వో నేనూహించుకొందును. నీవు నేరస్థురాలవయి యుఱికంబ మెక్కినచో—దప్పిలేని లోపముదక్క తక్కిన ముద్దుముచ్చట లన్నియు నీకుమారునకుదీర్తును. నీమీఁదఁ గనఁబడిన నిదర్శనము లన్నియు మంచు విడిపోయినట్లు విడిపోయి—నీవు బైటబడినచో నిన్ను నాచెల్లెలికంటె నెక్కుఁడుగా జూచుకొని నీయాజ్ఞల శిరసావహించుచుండెదను. కావున నాప్రశ్నల కనువగు సమాధాన మిమ్ము. ఏమందువు? ప్రశ్నింపమందువా? అని యనెను.

సుభద్ర పొరలిపొరలి వచ్చు దుఃఖమాపుకొని కన్నీరు దుడిచికొనుచు:—

అన్నయ్యా! ఈపాపాత్మురాలిని—ఈపతితురాలిని—నిష్కల్మషప్రేమతో సోదరీ! అని సంబోధించి నందులకెంతయు సంతోషించుచున్నాను. ఆమాత్రపు ప్రేమ మీదీనురాలి యందుంచితి వంతియే జాలును. నాకింక నిరుపార్శ్వంబులయం దెవ్వరును లేరు. ఎవ్వరు లేకున్నను సతికి పతియున్నఁ జాలును. నాదురదృష్టవశంబున నాపతియు నాకు గరవయ్యెను. ఇంక నేను జీవించి యేమి లాభము? నాయీ దిక్కుమాలిన—పనికిమాలిన—హేయమైన—రూపమున కాసించి—కొందఱు దురితాత్ములు నాకొంప నీవిధముగా ముంచివైచిరి. ఇప్పుడు నేననాథనైతిని. ఈసమయమున నా దురితాత్ములు చెలరేగి నామానభంగంబు గావించుట కవ

కాశంబు లేకుండ నీచెఱయం దుంచి నన్ను నిజముగా నీవు రక్షించినావు. నామానరక్షకుఁడ వైనావు. ఎందును దిక్కు-లేని దానను. చావున కెదురు చూచుచున్న దానను. గతిలేదని నీపాదముల పైఁబడిన దానను. నన్నుఁ ఉరిస్తంభ మెక్కించి పుణ్యము గట్టుకొమ్మని వేఁడుచున్న దానను. తల్లిలేని యీపిల్లవాని రక్షించి—నాకింత గతిగలిగించుమని నిన్ను బ్రార్థించుచున్న దానను. ఇం దెట్టి రహస్యంబు లున్నను బయటికి దేవద్దని నిన్నర్థించుచున్న దానను. నాచావుతో నాయత్తవారియింటి యలజడు లన్నియు దీరునని వేఁడుచున్న దానను. నాపతి శిరమింకను మారువాఁడిచేత మూట గట్టఁబడియున్నది. వేగ నన్నుఁ ఉరిదీయించి నాభర్తశిరము ప్రక్క నాశవముంచి దహనపఱుపుము. నాకన్నదమ్ములు లేని వెలితి దీర్పుము. నాదుఃఖ మింతటితో జల్లార్పుము. నన్ననవసరప్రశ్నలు వైచి మఱియు నేడ్పింపకుము. అన్నా! నన్నుఁ ఉరిస్తంభమెక్కించి—రక్షింపుము. రక్షింపుము.” అని జాలిగుండెయైన ను గఱఁగునట్లేడ్చి—అట్లేడ్చుచునే కుమారమాధవరావు నతని పాదములచెంత నుంచెను.

వెంటనే రాజారా వాబాలు నెత్తికొని ముద్దాడి—తన కన్నీరు దుడిచికొనుచు—సుభద్ర కన్నీరు దుడిచి—

చెల్లీ! నీవాక్యములు వినినంతనే నాహృత్పేటిక పగాలునఁ బేలినది. నీవాక్యము లన్నియు సత్యములని నాకిప్పు

డు దట్టుచున్నది. నీహృదయ మెంతనిష్కాపట్యమైనదో యి
ప్పటికి గ్రహించితిని. నిన్ను జెరుపదలచిన దుష్టాత్ము లెవ్వరో
నన్నుగూడ మ్రందింపఁ దలఁచిరి. అది స్వవిషయముగాన నస
త్యమని యనుకొనగలిగితిని గాని నీవు దోషివగుదువని
నిశ్చయముగా నమ్మియుంటిని. అందుచేత నే నిన్ను బంధించి
తిని. ఈవాక్యము లెట్లు చెప్పితివో యట్లే నేను ప్రశ్నించు
నాలుగైదు ప్రశ్నలకును సమాధాన మిమ్ము. దాఁచుకొన
కుము. ఎట్టి రహస్యమైనను సరియే నీకంటె భద్రముగా గా
పాడెదను. ఇదిగో మీమామగారు పోయిననాఁటిరేయి నీవు
నీగదిలో కిటికీసమక్షమున నిలువంబడి "ఇఁక భయములేదు"
అని యస్పష్టముగా ననుకొంటివే. ఆవిషయము దేనిని గుఱిం
చి—ఒకమూల మామగారు పోయినందుల కెల్లరును నేడ్చు
చుండ నీలో నీవట్లు ధైర్య ముపదేశించుకొనవలసిన యగ
త్యమేమి వచ్చినది? సందేహింపక చెప్పుము.

సుభ—అన్నా! ఈదిక్కుమాలిన యువతిపై నొకపు
రుషరూప పిశాచి మరులుగొనియుండెను. ఒకటి రెండు మా
రు లన్యాపదేశముగా దనభావము వెల్లడించెను. అయినను
ద్వరపడి వానిని చీవాటులు బెట్టలేదు. ఆనాఁటిరేయి తాత
గారికి జబ్బుహెచ్చు చేసినది. శ్యామలాంబయు పార్వతియు
నత్తగారిచెంతనే యుండిరి. నేను పెరటిలోని కరిగితిని. సరి
గా నాసమయము గనిపెట్టి యాదురాత్ముఁడు నన్ను బట

నుంకించెను. నే నప్పుడును శాంతించి చటాలున నత్తగారి యొద్దకు బోయి కూర్చుంటిని. తరువాత నావైపరీత్యము వచ్చినది. అర్ధరాత్రి దాటిన తరువాత నీలాంబరధారు లెవ్వరో నాగదిచెంతకు వచ్చి యంతలోననే వెడలిపోయిరి. ఆవెనుక నీవు వచ్చితివి. నిన్ను చూచుటచే ధైర్యము గలిగి "ఇఁక భయములేదు" అని యనుకొంటిని.

రాజా—మంచిది. మాధవరావుగారు తమ విల్లును గుఱించి గోవిందునితో రహస్యముగా మాటాడుచుండ నీవు పొంచుండి వింటివా ?

సుభ—భగవంతుని సాక్షిగా నేను వినలేదు.

రాజా—అట్లయిన నాసమయమున నీవును—నీమనోహరుఁడును దోటలో మల్లెపొదమాటునఁ గూర్చుండి మాటాడుకొనుచుండి రని గోవిందు చెప్పినది గూడ నసత్యమేనా ?

సుభ—అది సత్యమే. మేమాతనిని జూడలేదు గాని మే మిరువురమును మాత్రము మాటాడుకొంటిమి.

రాజా—అంతరాత్రివేళ మీకున్న రహస్యము లేమి?

సుభ—ఆయింటిలో నుండి యాపోరు బడజాలక—ఈగ్రామము దున్నను దప్పదని గ్రహించి యీసంగతి మాత్రము జెప్పక పొరుగూరులో నుద్యోగము జూడు డనియు—వేగమే మన మిక్కడనుండి పోవలయు ననియు జాలమారులు ప్రేరేపించితిని. నాభర్త యనుమతించెను గాని—సోదరి

శ్యామలయు మామగారును మేము వెడలకుండ నుండుటకై చాలపాటు బడిరి. నేను చచ్చినతరువాత విడిపోదురు గాని యంతవఱకవిభక్తకుంటుంబమను ఖ్యాతి నాకు రానిండని తాతగా రనిరి." నాఁటి కొక్కదైవము లేఁడే" యని ధైర్యము దెచ్చుకొని మాప్రయత్నమును మేమే విరమించుకొంటిమి. మామగారు బోయిన నాఁటిరేయి మరల నల్లరిబడితి నని చెల్పితిని గాదా? మరునాఁటి రాత్రి యావిషయమే నాభర్త గారికి చెప్పి యాదుష్టుని నామముగూడ నెఱింగించి వైచితిని. అప్పుడు నాభర్త నాదుస్థితి విని మిగుల జింతించి:—

"ప్రియసీ! ఎంత దుర్మార్గమున కొడిగట్టెను కానిమ్ము. తండ్రిగారు పోయి నేఁడు రెండవదినమే గదా? దినము లయిపోయిన వెనుక—పోలీసు చేతులలో నుండి మనము బయటబడిన వెనుక మన విూయూర నొక్క నిముషమైన నుండవలదు. అంతవఱకెట్లో యాదుష్టుని కండబడకుము."

అని యనుచుండగనే నాయొడిలోనిద్రించుచున్న నీ మేనల్లుడు లేచి యేడ్చెను. అప్పుడు నీబావమఱది నన్నుఁ గాంచి:—

"సుభద్రా! మాధవుఁడు లేచినాఁడు. మన మిప్పు డేమనినను నిందాపాత్రులమగుదుము. తరువాత నీవిషయమై యాలోచించకొందము. పోయి పరుండుమురమ్మ." అనెను.

వెంటనే మేము లోనికి వెడలితిమి. ఈలోపున తాతగారు గతించిరి.

రాజా—సోదరీ! ఇప్పుడిప్పు డీవ్యవహారసంబంధ మగు చిక్కులన్నియు మెల్లమెల్లగా విడిపోవుచున్నవి. ఇవి యన్నియు విడినట్లే విడి మరల నింతకంటె గొప్పచిక్కు బడునో, యింతటితో నిది సరియగునో నాస్వల్పబుద్ధితో నూహింపఁజాలకున్నాను. నీమానభంగ మొనరింప సిద్ధపడిన పురుషుని పేరు నీకు చెప్పుట కిష్టములేకయో, నేనడుగలేద నియో యింతవఱకు చెప్పితివిగావు. నిన్ను నిర్బంధించినవాఁడు కపిలవాయి శంకరరావేనా?

సుభ—రామ. రామ. పాపము శాంతించుఁగాక. పాపము శాంతించుఁగాక. ఆతఁడు నిత్యమును మాయింటికి వచ్చునుగాని- నన్నును, అక్కయ్యను నోరార "వదిన గారూ!" అని బిల్చును. నిక్కముగా నాతనికి మాయెడ మాతృభావముగలదని నొక్కి వక్కాణింపఁగలను. ఆతఁడు. నిష్కళంకహృదయుఁడు. ఆతనియెడ నాకేగా దేరికిని యెట్టి యనుమాన ముండదు.

రాజా--ఓహో! నాసంశయము సరియైనదిగాదు. అనఁగా నేను చిక్కులో బడుచున్నాననుమాట. కానిమ్ము. నీభర్తపోయిన నాఁటిరేయి యింట ప్రవేశించిన దొంగలు నిన్నుగాక తక్కినవారినెల్ల వేళ్లాడదీసిరిగదా? నిన్నట్లు

వ్రేలాడదీయకుండుట కేమికారణము?

సుభ—ఆకారణమే నాకింతవఱకు గ్రాహ్యము గాలేదు.

రాజా—అందుగూడ మన మూహింపఁజాలని రహస్యమేదియో యుండును. అది తరువాత గనిపెట్టవచ్చును గాని నిన్ను బలవంతపఱచిన పురుషుని నామధేయ మేమి?

సుభ—ఆపేరు విన్నచో మీరుగూడ నిలువునఁ గూలబడుదురు. అన్నయ్యా! అయినను నీకు తెలుపకతప్పదు. మీ రింతవఱ కెవ్వఁ డమాయకుఁడనియు, శుద్ధబుద్ధావతారమనియు ననుకొనుచుండిరో యాయనయే యీయన. అనఁగా నీపెద్దబావగారు. నాబావగారు. రఘునాధరావు గారి పెద్దకుమారుఁడుగారు.

రాజా—ఆఁ...ఆఁ...కా-మే-శ్వ-ర-రా-వా? ......

సుభ—అన్నయ్యా! నేనన్నట్లే యైనది. నీచిన్నబావ శంకించినట్లే యైనది. ఒకనాఁ డీవిషయమే పోలీసుతో మాటాడుచుండ మీబావగారు గాంచి నన్ను చావమోదిరి. నే నీవిషయ మెఱింగించిన నాఁటిరేయి నీబావగారుగూడ కొంతవఱకు నమ్మలేదు. తరువాత యెట్టకేలకు నమ్మెను. ఆతని యమాయకత్వమంతయు- డబ్బు గడించుటలోఁ గలదు. సంసారములు మాపుటలో లేదు. ఆతని శుద్ధబుద్ధావతారమంతయు పైవారు పనిచెప్పినపుడే గాన్పించును. తన స్వంతపనివిష

యమున చులుకైన విగ్రహామే. ఆతనికి తెలివితేటలు లేవని యెల్ల రనుకొనునట్టుల జరించును. నిజమునకు బుద్ధి నుప యోగించు పనులేమియు జేయలేడు. అందులకయ్యే సుమా రారేండ్లనుండి స్వల్పజీతములోనే యుండిపోయెను. ఆయన తరువాత బ్రవేశించినవారు వేతనాభివృద్ధిఁగాంచి సుఖించు చుండిరి. ఆతనికున్న స్వల్ప తెలివితేటలును- చులుకుదనమున వ్యభిచారముపట్ల వినియోగించుటలో సమర్థుఁడు.

రాజా——ఔరా! నంగనాచివోలె గాన్పించునుగాని యెంతటి దుష్ప్రవర్తనగలవాఁడు. ఈతని నడవడినిగుఱించి శ్యామల యెఱుఁగనా?

సుభ——ఆసాధ్వీరత్నమిట్టి దుర్వార్తలు విని సహింప జాలదు. ఆమె కీతని నడవడి తెలియదు.

రాజా——ఈరహస్యము నీవు బావ కెఱింగించుట కంటె——శ్యామల కెఱింగించినచో- ఇన్ని యనర్థము లుత్పన్నముగాకుండ నుండునేమో?

సుభ——ఆమెకు భర్తయందొక విధముగు వెఱ్ఱినమ్మ కము గలదు. అందుచే నాతనిని గుఱించి యేమిచెప్పినను నమ్మదు. ఆమె కాతని దుర్వృత్తిప్రత్యక్షముగాఁ జూపవల యును. మేము పొరుగూరు వెడలిపోయినచో నేబాధయు నుండదు గాని——నిష్కారణ మీరహస్య మామె కెఱింగించి నచో- భార్యభర్తలమధ్య పొరపులు గల్గించినదాననయి

పాపము మూటగట్టుకొన్నదాన నగుదును. ఇట్టి సంశయము తో నీసంగ తక్కగారికి తెలుపక మీభావ కెఱింగించితిని.

రాజా—చెల్లీ! నీవాతనికోర్కె కనుమతింపనప్పు డాతఁడేమేని దుర్భ్రలాపము లాడెనా?

సుభ—కడుపులో గావలసినంత యీర్ష్యయుండును గాని ప్రత్యక్షముగా దుర్భ్రములాడఁగలఁడా? కాని "వార ముపదిదినములలో నీవు నాకోర్కె కనుమతింపకున్న నీపాట్లు గుక్కలకును, నక్కలకునుఁ గూడ గొలిగావు" అనియనెను.

రాజా—మంచిది. లాలాయను మారువాడీకిని, మీ యత్తవారికిని నేవేని వ్యవహారము లున్నవా?

సుభ—నేన్నట్లు కాన్పింపదు. అయినను వీధిలోని వ్యవహారము నాకెట్లుదెలియును.

రాజా—సరే. చెల్లీ! నీవు నాహృదయశల్య మూడ బెఱికెదవనుకొన మఱికొంచెము బిగించి నన్నుక్కిరిబిక్కిరి చేసితివి. మరల నీనూతనమార్గము బట్టుకొని ముందునకు బోవలయును. ఆమార్గ మెక్కడికి బోవునో- ఎట్టిచిక్కులు బెట్టునో- ఇప్పుడూహించుట మిగులగష్టము. మునుముందు మారువాడీసంగతి గనుగొని యాపైన నీవుజెప్పిన విషయము లు విచారించెదను. నీవింకను రెండుమూఁడు దినములు బం దెలోనుండక తప్పదని చెప్పవలసివచ్చినందులకు మిగుల లజ్జించుచున్నాను.

అని వెంటనే రక్షకభటుని బిలిచి యామెను స్వస్థాన మునకుఁ జేర్పుమని యానతిచ్చి వాఁడామెను దీసికొని వెడలిన వెనుక నిట్లాలోచించెను.

ఔరా! ఇది సామాన్యవ్యవహారముగాదని యిప్పటి కర్థమైనది. ఈమె నేరస్థురాలని నిరూపింపబడిన సాక్ష్యము లన్నియు మిగుల జమత్కారముగా ఖండించి యింకొక నూతనమార్గము జూపించినవి. ఈమార్గ మెంతవఱకుబోవునో తెలియదు.

ఇందు న్యాయముగాబనిచేసి- కీర్తి గడింపనలయునని యత్నించితినిగాని- ఇంతకంటక యుతంబగుమార్గంబున- నా గమ్యస్థానము జేరుటెట్లు? ఒకవేళ కామేశ్వరరావు పరస్త్రీ లోలుండగుఁగాక. పైస్త్రీలకై పాకులాడునుగాని- యింటనే యిట్టిపని కుపక్రమించునా? ఇది నమ్మనర్హమగు మాటయేనా? ఈమె యాపద దొలగించుకొనుట కిట్టిపన్నుఁగడ చన్నియుండునా? ఈవిశాల ప్రపంచంబున నందఱును జిత్రాంగులేయగుదురా? అట్టివేమైన బ్రపంచములాగునా? ఈమెయే యాతనికూటమున కాసించి......ఛీ! ఛీ!! ఇది సరియైన త్రోవగాను. అట్లయైన నింతమందిగా దింకొకయింతమంది వచ్చినను నా మెకోర్కెఫలింపదు. ఆతఁడే యిట్టిపనికి సంకల్పించె ననుకొందము. అప్పుడుమాత్ర మింతకంటె ఫలితము వేరగునా? అప్పుడీమె నిస్సహాయయై యాతనిచే బందియైన

ప్పు డాతనియిష్టానుసారముగా నడచుకొన కేమిచేయఁగల డు? ఇదేమిపరీక్ష? బలవంతముగా నసువులబాసి- బాధవల్లార్చుకొనజాలదా?- ఇంతకు నిదిగ్రంథములలోని విషయము. బందిమై యున్నయామెకు జచ్చుట కుపకరించుసాధనము లెట్లుచేకురును? ఏమి? చావునకుఁ దెగించినకాంత.- మానసష్టమున కోర్వనియింతి- చావవలయునన్న- నేదేనిసాధనమే లేకపోవునా? పయ్యెదచెంగుతో పనిముగియదా ? శిరోజములచే నామెచింత వాయదా? ఎట్లయిన నంగీకారము లేనియింతినిగూడుటన హరిహరాదులకైనను శక్యముగాదు. అట్టియెడ యీకామేశ్వరరావు వశమగునా? వశమైనను గాకున్నను బ్రయత్నింపవచ్చునుగదా? ప్రయత్నము మన చేతిలోనిపని. కార్యసాఫల్యమగుట భగవదేచ్ఛ. ఒకవేళ దుర్బుద్ధిమై సుభద్రనాతఁడు గూడదలంచెనే యనుకొందము. అదినిజమైనచో గోవిందుఁడు నాకెఱింగింపకుండ దాచిన విషయ మిదియే మైయుండును.

తుచ్ఛమగు సంభోగమునకై యిన్నిహత్య లొనరించుట కెంతటినీచుఁడైనను సాహసించునా ? హత్యలన్నహత్యలా? కన్నతండ్రికి విషమిచ్చునా? కన్నతల్లిని ప్రాణములతో నుండఁగనే నెందో బంధించునా? తమ్ముని శిరఃఖండన మాచరించునా? ఇదేదియు నమ్మనర్హముగాలేదు. అయింతిపైఁగల మమకారముచే గన్ను మూసికొనిపోయి- తనయేకోదరుఁడ

న్నమాట మఱచిపోయి- తమ్మునిజంపి యాతని పేరియసిని స్వాధీనపరుచుకొందమను నుద్దేశముతో- తమ్ముని జంపినం జంపవచ్చు. అందులకు దెగింపవచ్చు. ఒకవధయైనతరువాత- తనయత్నమునుగూర్చి- తల్లిగాని- తండ్రిగాని- భార్యగాని- పైవారుగాని- యడ్డుకొనిరేని- అప్పటి వీరావేశముచే- యడ్డుకొనినవారిని తుండెతుండెములుగా ఖండించుటగలదు. అది యిటువంటి కార్యములయందు సక్రమము. అంతియేగాని నిష్కారణముగా నేపాపమెఱుంగని ముసలివారిని జంపుట కేమికారణము? నాకేమియు స్ఫురింపకుండ నున్నది.

ఈసంసారమునందు రహస్యవిషయంబులు రెండుం డును. అందు:—

i. ఇంతవఱ కెన్నివిధముల దలకొట్టుకొని చచ్చినను నిన్నిదురంతముల కేది ప్రథమకారణమో తెలియకున్నదే- అది- అది తెలిసినచో నీహత్యాసంబంధమైన జిక్కులన్నియు- అడ్డులేకుండ- మఱల చిక్కులుబడకుండ విడిపోవును.

ii. సుభద్రా కామేశ్వరరావుల వ్యవహారము. ఇం దెంతవఱకు సత్యమున్నదో గ్రహించినగాని యిదియు బాగు గా బోధపడదు.

ఈరహస్యములు దెలిసికొనుటకై బ్రయత్నింప వల యును గాని లేకున్నచో లాభము లేదు. ఈమారువాడీని ప

రక్షింప వీడింకొకత్రోవ జూపునేమో? ఆత్రోవసంగతికూడ తెలిసికొని యప్పు డాలోచించెదగాక.

అని రాజారావనుకొని లక్ష్మణసింగు, నారాయణస్వామిగార్లను లోనికిరమ్మని వార్తపంపించెను.

# ఎనిమిదవ ప్రకరణము.

ముప్పన్నెమెకము.

యథాసమయమునకు మారువాడీవాని చెంతనున్న మూటతోసహా బోలీసువారుదెచ్చి రాజారావు నెదుటఁబెట్టిరి. అప్పు డారాజారావు రక్షకభటులను బిలచి:—

"మీారేనా లాలాజీయింటికి నాయాజ్ఞపై వెడలినవారు?" అని ప్రశ్నించెను.

"చిత్తము."

"నీపేరెవ్వరు?"

"కాళిదాసు నెం 306 రు."

నీవెంటవచ్చిన రెండవవాఁడెవ్వరు?

"చిత్తము నేనండి.అప్పారెడ్డి No 725 రు."

రాజా—మీారు వెడలునప్పటి కీతఁ డేమిచేయుచుండెను?

కాళి—పెరటిలో మొక్కలకు నీరు బోయించుచుండెను.

రాజ.—అప్పుడు మీరేమిచేసిరి ?

కాళి—ఈతఁడు తెల్లవారినదిమొదలు రాత్రి పదిగం టలవఱకెప్పుడును వ్యవహారము జూచుకొనునుగాని మొక్క లవృద్ధికై నీరు మోయుచు గాలము వ్యర్థపుచ్చువాఁడుగాఁడు. అందుచే వానిని గలిసికొని "రాత్రి నీకుదొరకిన శిరమెక్కడ?" అని ప్రశ్నించితిమి. దానితో నీతఁడు కంగారుబడి యేమాట యు జెప్పజాలక నిలువునఁ గూలబడెను. కొంచెము గడబిడ చేయుటతోడనే వీని భార్యవచ్చి యాశిరము పాతిబెట్టిన స్థల ము జూపించెను. ఆశిరము బాతినట్లానవాలు దెలియకుండు టకై దానిపై నొకయరటిచెట్టుపాతి దానికిబళ్ళెముగట్టి నీరు తోడెను. ఆమొక్క మొక్కకును నీరుతోడి తక్కినవానికి దోడకపోయిన నెవ్వరైన ననుమానింతురేమోయని భయ పడి యన్నిమొక్కలకును నీరు దోడుట మొదలుపెట్టెను. వెంటనే వీనికి సంకెళ్లుదగిలించి యాగోయిత్రవ్వి యాశిరము దీసితిమి. అందుండి తీసినమూటయే యిది. ఇది యావిధముగా నే నందున్నది చిత్తగింపుడు.

రాజా—లాలా నీపేరేనా?

లాలా—చిత్తము.

రాజా—ఈకానిస్టిబులు చెప్పినదంతయు వింటివా?

లాలా—వింటిని బాబూ! వింటిని.

రాజా—ఆతడుచెప్పిన దెంతవఱకుసత్యము?

లాలా—అంతయు సత్యమే బాబూ!

రాజా—నీవే యీశిర మచ్చట పాతితివా?

లాలా—చిత్తము.

రాజా—ఈతలకాయ తాలూకు దేహమేది?

లాలా—నాకు తెలియదు.

రాజా—ఈతలకాయ నీకెట్లు వచ్చినది?

లాలా—తెలతెలవారుగట్ల సుమారు నాలుగుగంట లవేళ నేను లేచి వీధిలోనికి వెడలవలయునని తలుపు దీసితిని. ఇది గుమ్మమున కడ్డుగానున్నది. బాటసారు లెవ్వరో యిది మఱచిపోయియుందురనియు- మూట చాలా పెద్దదిగానుండ నగనుక చాల డబ్బుండితీరునను నపేక్షతో దీనిని లోనికి బట్టుకొనిపోయి యొకచో భద్రపఱచి వెంటనే కాల్యకృత్యం బుల దీర్చికొనివచ్చి నాభార్యనుగూడ బిలిచి యామె యెదు టనే యామూట విప్పితిని. ఈశిరస్సు జూచుటతోడనే నాతల దిరిగిపోయినది. నేను చైతన్యవిహీనుఁడనై పోయితిని. ఎట్ట కేలకు నాభార్యయే నాకు ధైర్యముపదేశించి—చేయవలసి నపనిగూడ చెప్పినది. ఎంతనిగూఢముగా మాపని మేముజేసి నను మా కర్మముగాలి యదియెట్లో బయటబడినది. పోలీసు వారి చేతులలో బడితిని.

రాజా—నీకిప్పుడు వచ్చినభయ మేమియు లేదుగాని

యసత్యమాడకుము. నీకీ శిరస్సు దొరకినకథ సత్యముగా జెప్పితివా? కొంత మభ్యపఱచితివా?

లాలా—లేదుబాబూ! ఇందు నానేరమేమియు లేదు.

రాజా—నీనేరము లేదందువేమి? ఈశిరస్సు నీకు దొరకినప్పుడు- పోలీసువారికి దెలియజేసినచో నీయందు నేరములేకుండ నుండియుండును. నీవు నిర్దోషివని నమ్మియుందుము. అట్లుచేయక నేరమును రూపుమాపుటకై యత్నించితివి. అగునా కాదా?

లాలా—బాబూ! బుద్ధి గడ్డితిన్నది. వెంటనే యీ సంగతి నేను బోలీసువారి కెఱింగించినచో- వారింక నన్ను బ్రతుకనిత్తురా బాబూ! ఏదోమసిబూసి మారెడుగాయజేసి లంచములక్రింద కొంత- చేబదుళ్ళక్రింద కొంత- లాగివైతురు. ఏమనుటకును వీలుండదు. అనినచో ముప్పు. తొంబది తొమ్మిది తప్పులువచ్చి నానెత్తిపైబడును. నిత్యమును న్యాయస్థానముల కరుగలేక చావవలయును. ఇన్నియల్లరు లేల కొనితెచ్చిపెట్టుకొనవలయునని తలంచి- సులభముగా దేలిపోవునని యీపని కంగీకరించితిని. క్షమింపుము బాబూ! ద్రవ్యాపేక్ష- కాదు. బాబూ!- అంతకంటె మంచిముక్కయున్నది. డబ్బుకక్కుర్తి- యిట్టి కానిపనికి బ్రేరేపించినది. ఇంత దూరదృష్టి యప్పుడు లేకపోయినది. ఉన్నచో నింతటిముప్పు రాకుండ నుండెడిది. క్షమించండి. బాబూ! క్షమించండి.

రాజా—ఈశిరస్సెవ్వరిదో నీవు చెప్పఁగలవా?

లాలా—అది నేను బాగుగా జూడనైనలేదు బాబు. శిరస్సు కంటబడినది. ఎఱ్ఱగా కరఁకుగట్టిన నెత్తురుగాన్పించినది. మఱిపోయినది. మఱిచూడలేదు.

రాజా—ఇప్పుడుచూచి యాశిరమెవ్వరిదో బోల్పుము.

లాలా—బాబూ! ఇట్టిదారుణములను చూడజాలను బాబూ! రక్షించండి.

రాజా—చూడలేననిన తప్పిపోను. తప్పకచూడవలయును. చూడుము.

విధిలేక లాలా యామూట విప్పి రెండునిమిషములు చూచి—"బాబూ ! నేనీతని నెచ్చటను చూచినట్లు లేదు. అందుచే నేను బోల్పఁజాలను." అని లాలాయనెను.

రాజా—ఈయూరిలో నీకెవ్వరైన విరోధులుగలరా?

లాలా—లేరు బాబూ!

రాజా—ఇచ్చట నీవ్యాపారమేమి?

లాలా— తాకట్టువ్యాపారము.

రాజా—నీవు దొంగవస్తువులు కొందువఁట నిజమా?

లాలా—బుద్ధిగడ్డితిని యప్పుడప్పుడు కొంటిని క్షమించండి బాబూ!

రాజా—ఓరి నీక్షమాపణ గాలిపోను, మాటిమాటికిని క్షమాపణయేనా? నీయందు దోషము లేనప్పుడు క్షమింపకేమిచేయుదుము. నీకు విరోధు లెవ్వరైన నుండిరేమో జ్ఞప్తికి దెచ్చుకొమ్ము. అన్నిటికిని సరియైన సమాధానమిచ్చి యుఱితప్పించుకొనుము.

లాలా—బాబూ! నేనేఁటికిని ప్రాణహాని యెన్నఁడును జేయలేదు. ఒక సంవత్సరముక్రిందట జరిగినకథ జరిగినది జరిగినట్లుగా జెప్పివైచెదను. ఒకనాటి రేయి రాముఁడు, భీముడు- అను దొంగలిరువురెక్కడనో దోఁచుకొని యొకతట్టతో తట్టెఁడువస్తువులు రహస్యముగా నాచెంతకుఁదెచ్చి నన్నుఁ గొనుమనిరి. నాకదివఱకట్టి దొంగవస్తువులు గొనుమామూలు లేదు. కాని యీవస్తువులుగాంచుటతోడనే నాకనులుగుట్టినవి. ఎంతకైనఁ గొందమని భావించి యీభావన పైకి గన్పడకుండ నణచిపెట్టి వారిని చూచి—

భాయీ! మీరు మాబాగా టోపీలులో పడ్డారురా? ఇవియన్నియు నిజమగు బంగారునగలని మీరనుకొంటిరి. ఇవి మెఱుఁగుబిగిమీద నిల్లున్నవిగాని యివియన్నియు మదరాసు సుబ్బారావుగారి మాయవస్తువులు. ఒక్కపాతికరూపాయలు వెచ్చించినచో నిట్టివిరెండుతట్టలు గొనవచ్చును. ఏదో- మీరువచ్చితిరిగనుకను- క్రొత్తబేరము గనుకను- ముందుముందామాత్రముఁలాభము జూపింపక పోవుదు గాయను నాశతోడ

ను పాతికరూపాయిలిచ్చెదను. ఇష్టమైననిండు. కష్టమైనబొం డు" అని యంటిని.

రాజా—చాలమంచి యెత్తెత్తితివే- అవి బంగారునగ లేనా?

లాలా—క్షమించండి బాబూ! స్వచ్ఛమైన మేలిమి.

రాజా—బాగున్నది. అందులకు వారేమనిరి.

లాలా—వారిరువురును నాపై గోపపడి వస్తువులు పట్టు కొనిపోయిరి. అప్పుడు సమయము తప్పివచ్చినదిరా యని గ్ర హించి "మీ సంగతి పోలీసు వారికెఱింగించితీరెదనని" బెదరిం చితిని. దానితో వారి ప్రయాణము కట్టుబడి యేమాలోచిం చుకొనిరో యేమో యూ పాతికరూపాయిలిమ్మని వస్తువులు నాముందు బెట్టిరి. వారు లొంగిపోయిరిగదా యని దలంచి మ రలబేరమాడి పదిహేనురూపాయలకు వారినొప్పించి- ఆకరి న్యము గూడ నిచ్చుట కిష్టము లేక పండ్రెండురూపాయిలమె సిమిదణాలనిచ్చి- మిగిలినవానికొఱకు రేపురమ్మని యంటిని. వారందులకు సమ్మతించి యాత్రిముతో బోయిరి. తరువాత నొకటి రెండుమాటులు వారువచ్చితక్కిన లెక్కయిమ్మనిగోరిరి. అదిగూడ నపహరించుతలంపున వారిని తూలనాడి పొమ్మం టిని. మమ్మిట్లు మోసగించితివిగావున నీకొంపనట్టేట ముంపక పోయినప్పుడనుము" అని వారు నిష్క్రమించిరి. వారేమిచే

యుకురని యూరకుంటిని. ఈపిల్లలపిసుగు వారే నానెత్తిపై బడద్రోసియుందురని భావించుచున్నాను.

రాజా—సరే నీవానస్తువులన్నియు విక్రయించితివా?

లాలా—విక్రయించితిని.

రాజా—ఎంతకు విక్రయించితివి.

లాలా—ఏమాత్రిమో తక్కువగా నాలువేలువచ్చినవి.

రాజా—నీమోసమునకు దగినమోసము వారుజేసిరి. కుక్కకాటునకు జెప్పుదెబ్బ సరిపోయినది. అదొంగలనివానమెచ్చటనో నీకుదెలియునా?

లాలా—నాకు తెలియదు.

రాజా—నాలుగైదుదినములూ-యీమధ్యవారు నీకుగానిపించిరా?

లాలా—శనివారమునాఁటి సంతలోగన్పడి "తొందరపడకుము" అని హెచ్చరించిరి.

రాజా—వారిరూపము లెట్లుండునో చెప్పగలవా?

లాలా—రాముఁ డెట్టిగా జమీన్‌దార్‌బిడ్డవోలె మిగుల వేషభాషలతో నుండును. ఆఱడుగులపొడవుండును. గిరజాలుగలవు. వాఁడెన్నివేషములువేసినను మారనిచుట్టకాల్పొకటి- దానిప్రక్కను పుట్టుమచ్చయొకటియు గలదు. భీముఁడుగూడ యంతపొడువుండును గాని- నలుపు. రాముఁడు

జమీాదారైనప్పుడు- యీాతఁడు సేవకుఁడగును. రాత్రిలంది ద్దలును మాధుకరమొనర్తురు. ప్రతిసంతకును భీముఁడు సంతలో "చిల్లరమూరకము" దుకాణముబెట్టును. రాముఁడుప సువులసంతలో పొసుగుడుగాడగును. ఎక్కడెప్పుడు వీరైనను సరళీ కొట్టివెతురు. భాగ్యవంతులను గనిపెట్టి- వారియునికి దెలుసుకొని- సమయముజూచి కొల్లగొట్టుదురు.

రాజా—అట్లయిన నీవు వారిని పోల్చగలవనుమాటయే.

లాలా—చిత్తము.

లక్ష్మి—రాజారావుగారూ! జరుగుచున్న వ్యవహారమొకటియు- మీారు జరుపదలఁచుకొన్న వ్యవహారమింకొకటియు నని నాకు దోఁచుచున్నది. ఒకటిపూర్తిచేసి రెండవది బట్టిన మంచిదని నాయభిప్రాయము.

రాజా—అట్లేగాని యింకొక చిత్రమున్నది. అదియేమందురా? హత్యాపరాధకు లెవ్వరైనను- వానికి బెక్కుమంది యుండవచ్చునుగాని- హత్యాపరాధకుని యొక్కని వలనను నిర్వర్తింపఁబడు కార్యములు గావివి. సుభద్ర హత్యాపరాధకురాలయి యుండునని మన మొక విధముగా నిర్ణయించి యామెను బంధించితిమిగదా? ఇప్పు డానేరమామె యింకొకరి నెత్తిని బులుముఁటకై యత్నించుటయే గాక- పూర్తిగా బులిమివైచినది. ఆమెయైనను గాని- ఆమెచే

నిరూపింపఁ బడినవారైనను గాని- ఎవరైనను గాని- వారికీ మాఱువాడీయుంట శిరముబడవైచిన వారనుచరులై యుందు రని నేను నిశ్చయముగా నమ్ముచున్నాను. వీరినిబట్టి దండిం చినచో- గట్టువెల్లడియైనను గావచ్చునను యాశయముతో నున్నాను.

లక్ష్మి—మీరు చాల తెలిసినవారే గాని నాయల్ప బుద్ధి కింకొక సందియ మొదవుచున్నది. మన మెఱుంగుట కవకాశములేని యింకొక చిదంబరరహస్యమేదియో యుం డి- వీడే యాదుర్మార్గులచే నిట్టికార్య మొనరించి యుం డును. కాదేని యాంశిరమీరాతఁ డంత జాగ్రత్తగా బాతిపెట్టవ లసిన బనిలేదు. ఈమువ్వురేకమయి- యీనేర మేయభాగ్యు నిపైకైన నెట్టివేయుటకు సంకల్పించుకొని- వీని నిర్దోషి యట్లు గాన్పించుట కిట్టిపన్నుగడ బన్ని మీకండ్లలో గారమును గొట్టి- తాను గృతకృత్యుండు గాదలంచెనని నే ననుమానిం చుచున్నాను. ఇట్లైయైనచో మీది వృథాప్రయత్నమగును గాదా ?

రాజా—సింగుగారూ ! మీరన్నదే సత్య మనుకొ నుఁడు. వీని యనుచరులైనను మనకు జేచిక్కుదురా? అప్పు డువారి యజమానుఁ డీతఁడైనను- లేక యింకొకరయినను- మబ్బువిడచిన మార్తాండునివలె బయటఁ బడవలసినదే. ఎట్ల యినను మన ప్రథమయత్నమునకు లోపముండదు.

సింగు—ఆదుర్మార్గులు దొరకినచో నట్లే యనుకొనుఁడు. ఒకవేళ యీతఁడే వారికి యజమానియైనచో- వీఁడు నిజముగు తన యనుచరులను మీకు జూపించునా? తన విరోధులును- నిర్దోషులును నైనవారినేని చూపించు ననుకొనుఁడు. అప్పు డింకేమిచేతురు ?

రాజా—అప్పు డాప్రియత్నము వ్యర్థమగుట- మారువాడీపై నేరము స్థిరపడుట- అసత్యమాడినందులకు దగిన ప్రతిఫల మీతఁ డందుట. జరిగితీరును. సింగుగారూ! ఈతఁడు నేరస్థుఁడు కానిండు- కాకపోనిండు. నరుకబడిన శిరస్సుతో దొరుకుటచే నీతఁడు ద్రోహియని తెలిసినదికదా ? ఈనేర మీతనిపైనుండి తొలగించుకొనుట- యీతనికి ముఖ్యముగదా ? అందుచే నీతఁ డవకతవక మార్గంబులు దొరికినచో- నేరస్థుఁడై. దొరతనమువారి యురికంబమున వ్రేలాడును. ఎట్లయిననేమి ?

సింగు—మీఁది చాలదూరాలోచనము. అట్లేగానిండు. అట్లయిన నీతని నిప్పుడు విడచుటయా ? బంధించియుంచుటయా ?

రాజా—నాయనుమానము సరియైనచో నీతఁడు పరారీ.గాడుగాని- మీయనుమానము సరియైనచో సంధించి విడచిన బాణమువలె రివ్వున నెగిరిపోయి యెందో డాగియుండును గాని మరల దొరకుట దుర్లభముగదా ? అందుచే

మీాయనుమానము ననుసరించి వీఁని బంధించియుంచు టుత్తమము.

సింగు—అట్లయిన నీతఁ డామర్మార్గుల జూపించు టెట్లు ?

రాజా—దానికొక విధానమున్నది. తరువాత జెప్పెదను లెండు.

ఇంతలో దపాలాబంట్రోతువచ్చి కొన్నియుత్తరముల నిచ్చి వెడలిపోయెను. సింగాయుత్తరములు వీక్షించి యెవరివి వారికి యిచ్చివైచెను. వానిలో రాజారావుపేర రెండుత్తరములుండెను. వానిని దీసికొని యందొక్కటి చూచెను. ఆతరువాత రెండవది చదివెను. అదిచూచి యించుకచిఱునగవుతో:—

"అయ్యా! చూచితిరా? ఈరెండుత్తరములునుచదివినచో యీాహంతకుని చాతుర్యమెంతయో కొంచెమించుమించుగా వెల్లడియగును. చదివెదనువినుఁడు" అని వెంటనే మాధువాడీని కారాగారమునకు బంపివైచి సావకాశముగా గూర్చుండి యందొకయుత్తరముదీసి రాజారా విట్లుచదివెను.

ముప్వాన్నెమెకము. నెం 1 రు. పీఠికాపురము.
విలాసోద్యానవనము. మాఘ బ ౬ గురువారము.

"ముప్వాన్నెమెకము. కాలసర్పము." అను బిరుదులు వహించిన నేను నీకిప్పుడు దెలియఁజేయున దేమనఁగా నీవు

మా "సుభద్ర"ను తెలిసియో, తెలియకయో బంధించితివి. నీవు పైగ్రామవాసివిగాన నిన్నీతప్పునకు క్షమించితిని. ఆమె నీయుత్తరమందిన రెండుగంటలలో విడిచిపుచ్చుము. లేనిచో నీవు నాకు వృథాశ్రమమిచ్చినవాఁడ వగుటయేగాక- నా యాగ్రహమునకు గుఱిగావలసివచ్చునని చెప్పవలసివచ్చి నందులకు విచారించుచున్నాను.

నేనిచ్చినగడువులోపున నీవామెను విడిచిపుచ్చుచో నీవు గోరినంతద్రవ్యమిచ్చెదను. అట్లు విడిచిపుచ్చినచో నేఁటి రాత్రి యొకటి రెండుగంటలమధ్య సుభద్రనెగురగొట్టి, పని వచ్చినచో నీపని బట్టెదను. నాశక్తిసామర్థ్యము లీవెఱుంగవు. ఆహారమునుదినుచున్న శార్దూలమును జెవులుబట్టి యాడింపకుము. దానఁ బ్రమాదముగలదు. జాగ్రత్త.

ఇట్లు,

కాలసర్పము.

ఇందున్న సంగతులువింటిరిగదా? ఇఁక నీ రెండవ యుత్తరమునుగూడ జాగ్రత్తగా వినుఁడు. అప్పటి కీతత్వము బోధపడును.

మువ్వన్నె మెకము. నెం 2 రు పీఠికాపురము.
విలాసోద్యానవనము. మాఘబ౹౹ గురువారము.

క్షణముకిందట లాలాను పోలీసుభటులు పట్టినట్లు వింటిని. అతఁడు నాయనుచరుల రహస్యవృత్తాంతము

గొంత మీకెఱింగించును. దాని నాధారముగా గొని వాని ని బట్టుటకై మీరు యత్నింతురు. కాని యదియు వృథా ప్రయాసయే. నాయనుచరులుగాని, నేనుఁగాని నీకుఁ జిక్కుటసంభవము. నన్ను జూడవలయునను కుతూహలము నీకు మిక్కుటముగా నుండును. అట్లున్నచో రాత్రి 11 గం టలకు నీవు వెనుకపొంచున్నస్థలమున నిలువబడుము. నీవు పోలీసువారి సహాయముతో వచ్చినను- పిస్తోలుతో వచ్చినను నీ కాక్షణముతో నాయుర్దాయముసరి. సుభద్రనువిడచిపుచ్చు ట సర్వవిధముల నీకు క్షేమము. అట్లు గానిచో- నీ-సో-ద-రి-శ్యా-మ-ల—ఆసంగతి రేపు చెప్పెదను.

ఇట్లు.

“కాలసర్పము.”

సింగుగారూ! ఇప్పు డర్థమైనదా? ఈశిరము దొంగి లినవా రీహంతకుని ప్రియమిత్రులే. ఆసంశయనివారణమై నది. ఈవిషయమున మారువాడీ పాపము నిర్దోషి. అయినను వానిని విడిచిపుచ్చుట కీయొక్కనిదర్శనము జాలదు. అందు చే నాతనికి చెఱ తప్పదు.

ఇఁక మన మాలోచింపవలసిన ముఖ్యవిషయ మొక టున్నది. మాసుభద్ర తాను నేరస్థురాలనుగానని నిరూపిం చుకొనుచు- ఈనేరము నింకొకనిపైకి ద్రోసివైచినదని మనవి చేసుకొంటినిగదా? ఆమెను విడిపించుకొని పోయెదనని మన

కాదు ర్మార్గుఁడు తెలియజేసినాఁడు. మనస్వాధీనములో నున్న యీమెను దోడ్కొనిపోవు టంతసులభమైనపనిగాదు. ఆమె ను గాపాడు టెట్లాయనువిషయము తరువాత నాలోచింతము. కాని యబలతో నాహంతకున కేమిపనియున్నది? ఈమెను బ్రాణములతో నుంచుటలో వానియభిమతమేమి? ఈరెండు విషయములును మనము జర్చింపవలసి యున్నది.

అందునొకటి—ఈమె యాఁడుది. ఎంత ధైర్యస్థైర్యములున్నను నాఁడు దాడుదియే. మనము తొలుత ననుమానించినయ ట్లీమెయే పురుషరూపధారిణియై వ్యవహరించుచున్నదేమో వీరీమెయనుచరులేమో? మనలను మభ్యపెట్టుటకై ఈమె హంతకురాలు గాదనుకొనుటకై- హంతకుఁడు పైనున్నటుల మనకీయుత్తరములు వ్రాసియుందురు. ఈయనుమానము సత్యమేయైనచో దమయజమానురాలిని విడిపించుకొనుటకై యామెయనుచరులు బైనుండి ప్రయత్నింపక మానరుగదా? నాయనుమానముగూడ నీమె వీరియజమానురాలనియేగాని- ఆమెమాటలు గొన్నిగొన్ని నమ్మవలసి వచ్చుచున్నది. అందుచే నీమె యెట్లును వారి హస్తంబులఁబడకుండ జూడవలయును. ఈమె వారియజమానురాలు గావుననే ఈమెను వా రానాఁడు జంపలేదు. సరిగదా శ్యామలా కామేశ్వరరావు పార్వతులను దలకిందుఁగా వ్రేలాడదీసిన ట్లీమెను వ్రేలాడదీయలేదు. అనగా సుభద్రిప్రాణములతో వారికి ని

మిత్తములేదు. ఎందుచేత వారి కాయభిలాషలేదు. వారి కామె యజమానురాలుగనుక.

అందు రెండు—ఇందు మీరెఱుంగని క్రొత్తవిషయమొకటున్నది. ఇప్పుడు మీకదిచెప్పక తప్పనిసరివచ్చినది. ఈ సుభద్ర నిజముగారూపవతి. ఈమెను జూచినవారెల్ల నీమె రూపమునకు ముగ్ధులు గావలసినదే. నాసహోదరీమనోహరుండును-చపలచిత్తుండును నగు-కామేశ్వరరా వీమెను మోహించెననియు- దానిపై నించుమించుగా నిన్నియల్లరులును బయలుదేరి యుండవచ్చుననియు- తనయనుమానమును నిరూపించి- నించుమించుఁగా సాక్ష్యములతో జూపినది. అందే మాత్రము సత్యమున్నను మనమిదివఱకెల్ల బడినప్రయాసమంతయు వ్యర్థమయి- కథ యడ్డముగా దిరిగిపోవును. ఇందున్న చిత్రమేమనఁగా నీసంగతి సత్యమైనను సుభద్రకు మరణప్రాప్తిలేదు. ఇప్పుడుగూడ నామెనుజీవములతో నుంచుటకును- మనచేతులనుండి దాటించుటకును- వారు బ్రయత్నింతురు. ఎందుకన—ఈమెకూటమినాశించియే నాతఁడింతకు దెగించియున్నాఁడు గావున.

ఇప్పుడు మనము జేయవలసిన ముఖ్యకార్యములు రెండు—ఒకటి ఎంతమంది యెన్నివిధముల బ్రయత్నించినను సుభద్రను వారికి జిక్కనీయకుండుట. అది ముఖ్యము.

రెండు—ఎట్లయిన బ్రయత్నించి హంతకానుచరులను

బట్టుకొనుట. ఈరేయి 11 గంటల కాతఁడు రమ్మనినచోటికి కొక్కరుఁడను వెడలి మాటాడివచ్చుట.

ఇందు రెండవసంగతి నేను సవరించుకొనవలసినది. మొదటిసంగతి మీరు సవరణజేయవలసినది. కావున మొదటిసంగతినిగూర్చి మీరు కట్టుదిట్టమైన యేర్పాటులొనరింపుడు. సుభద్ర మనచేయి దాటిపోయినచోఁ జాలప్రమాదము లుత్పన్నమగుననుమాట మఱచిపోక నిద్రాహారములను ద్యజించియైనను సుభద్రను గాపాడుడు. నే నీవిషయమై తగినశ్రద్ధ దీసుకొనకుండుటకే యాదుర్మార్గుఁడు రాత్రి 11 గంటలకు నన్నుగలుసుకొమ్మనిన ట్లూహించుచున్నాను. ఇఁక నేను వెడలెదను. మీరు మీమీప్రయత్నములలో నుండుడు. అని రాజారావు వెడలిపోయెను. రాజారావు వెనుదిరుగగనే లక్ష్మణసింగు వెకిలినవ్వు జూపించెను.

## తొమ్మిదవప్రకరణము.

అట్లయిన మీరుమాత్ర ముండురా ?

సోదరీ ! శ్యామలా !! ఇది కల్పితకథకంటె మిగులచిక్కులుగా- చికిబికిలుగా నున్నదిగాని యీవ్యవహార మింతయుంతట తేలునట్లు కన్పింపకుండనున్నది. ఇప్పటికి సరియైన మార్గమే నాకవగతముగాలేదు. తుట్టతుద కీవ్యవహారమంత

యుఁ జుట్టుజుట్టుకొని మాబావ నెత్తిపై బడునేమోయని భయ
పడుచున్నాను. సుభద్రిఖండనమును ఆమె సందేహములును-
జరిగిన సమాచారమును నీకెఱింగించితినిగదా? గడబిడజేసి
వ్యవహార మింకను బాడయిపోవున ట్లొనరింపక:—

ఆవాక్య మింకను రాజారావు ముగింపకుండఁగనే
శ్యామలయందుకొని- వ్యవహారమంతయు బాడయిపోయినను
సరియే. ముల్లోకము లొక్కమాఱుగాఁ గూలిపోయినను సరి
యే- నాహృదయేశ్వరున కాపద దెచ్చిపెట్టువారినిజూచి నే
సహింపఁజాలను. నాపతిగుణము నాకంటె- సుభద్రి కెక్కువ
దెలియునా? తన దిక్కుమాలినరూపమున కాసించి నాభర్త-
అమాయకుఁడగు నాభర్త- పరకాంతాపరాఙ్ముఖుఁడగు నాభ
ర్తతన్నుఁ గామించెనా? అందు కాయిల్లాలు తనయసమ్మతిని
జూపి- అల్లరిబెట్టకుండ- నోరుమూసికొని యూరకుండెనా?
ఇది నమ్మనర్హమైనమాటా? అన్నయ్యా! నీవు బ్రహ్మచారి
వైనను- లోకానుభవ మించుక తెలిసినవాఁడవుగనుకను -
ఇంగితజ్ఞానముగలవాఁడవు గనుకను- పురుషుఁడవైనను నాక
గ్రజుడవును - బితృతుల్యుండవును గనుక నీకు- చెప్పరాని
వాక్యమైనను జెప్పుచున్నాను. అందు కీ నీ చెల్లెలిని క్షమిం
పుము.

లోకములో సాధారణముగా బురుషు లెంతదుర్వ్య
సనాసక్తులైనను ముందు వెనుకలాలోచింప రను టసంభ

వము. అందున సంసారస్త్రీకూట మభిలషించిన పురుషుఁ డెన్నఁడును తెలివితక్కువగా సంచరింపఁడు. తాను వాంఛించిన స్త్రీ యభిప్రాయ మెట్లనను ముందు గ్రహించుటకై ప్రయత్నించును గాని- ఒక్కమారుగా చెట్టువిరిగి మీఁద పడ్డట్లు- కొంపఁ గూలి మీఁదఁ బడ్డట్లు- చటాలున నామె మీఁద బడడు సరిగదా? తన వాంఛగూడ నోటివెంట నామె కెఱింగింపఁడు. చిఱునవ్వో- నేత్రావధానమో- పాడిదగ్గో- హస్తసంచాలనమో- దేనిచేతనో- వీరిరువురికిని కొంతగ్రంథము నడచిన పిమ్మట గాని పురుషుడు చటాలున స్వతంత్రింపడు. నమ్మకమగు దూతిక దొరకినచో- దానిచే నడిగించును. అదియైన నెప్పుడు? దానియభిప్రాయము తా నెఱిఁగినప్పుడో- దానిగుణ మట్టిదని తాను దెలిసికొనినప్పుడో- అంతవఱకు గూడ నాప్రస్తావన జేయఁడే- పురుషుఁడు తన యభిప్రాయ మేదోవిధముగా నభినయముద్వారా నామె కెఱింగింప- మరల నారీతిగనే తనకు సమాధానము వచ్చినచో- నెట్టియాటంకమును లేదు. రానిచో బురుషుఁడు విశ్వప్రయత్న మొనరించియు నాయువతిని గూడ జాలఁడు. సూది చేతితో నూరక త్రిప్పుచుండ దానిలో దార మెక్కించుట నీతరమా? బ్రహ్మదేవుని తరమా?

ఇంక స్త్రీవిషయము:—స్త్రీహృదయ మిట్టిదని చెప్పుట కేరికిని వశముగాదు. ఊసరవెల్లిరంగులవో లె

దానిబుద్ధి క్షణక్షణము మారిపోవును. ఇప్పుడున్న బుద్ధి మరు క్షణమున నుండదు. నేను జెప్పునది సామాన్యకాంతల మాట సుమా? ఉత్తమ స్త్రీల మాటగాదు. పురుషు డభి ప్రాయ మెటింగించితిగదా? అట్టి యభిలాషయే స్త్రీకి గల్గి నచో నింక జెప్పవలసినదేమున్నది? వేయునుంది భోగవనిత లామె కాలిక్రింద దిగదుడుపు. కటకటా! తాను వాంఛిం చిన పురుషుఁడు కంటబడినప్పుడెల్ల నాయిల్లా లొనరించు దుశ్చేష్టలు- శ్రీరామ- రామ- అన్న వైనను నీకెఱింగింప రానివి. ఆపైన నీవూహి ---- ---

ఇందున్న పరమరహస్య మింకొక టున్నది. ఆఁడుది తన కోర్కెవెలిబుచ్చిన తరువాతగూడ నాపురుషుఁడు సారంగధరుఁడైనచో- నూరు "చిత్రాంగి"నాటకము లంత గత్తరయగును. ఆఁడుది ముందు తేల దనుదురభిప్రాయ మొక టి లోకమున బాదుకొని యున్నది. అందుచే బురుషుఁ డెన్ని వాదించినను వాఁడు బొంకరియే. స్త్రీ యెంత చపలచిత్త యైనను- గుడ్డి నమ్మకమే.

ఇదిగో! నే నీవిషయమున నెన్నియో యుపమాన ములు దెచ్చి నిన్ను నమ్మించుటకై ప్రయత్నించు టనవస రము. చిన్ననిదర్శన మొకఁడు జూపెదను చూడుము.

అని శ్యామల లోనికి వెడలి యొక కాగితపుముక్క దెచ్చి రాజారావు చేతికిచ్చి యిది చదువుము. సంగతి బోధ

పడును అనెను. రాజారా వది యందుకొని యిట్లు చదివెను.

"అక్కచూడకుండ- ఆమె యేదియో పనిలో నున్న ప్పుడు- నేను పెరటిలోనికి వచ్చెదను. మీరు- ఇదివఱకు వలె నభ్యంతరము జెప్పక- వచ్చి నన్నాదరింపుడు. ఈమారుగూడ మీరు- నాకోర్కె దీర్పనిచో- నాశక్తి చూపింతును."

రాజా—సరిసరి. తుంటికిపెట్టిన- పంటికిని- పంటికి బెట్టిన- కంటికిని వచ్చుచున్నదే. చెల్లీ! ఈయుత్తర పత్రికారము వారు గలుసుకొనిరేమో నీవేమైనఁ గనిపెట్టితివా?

శ్యామ—మీబావగారి హృదయ మెట్టిదో నాకు తెలియదా? సుభద్రిగాదు గదా? సురలోక కాంతలెల్ల విచ్చేసి నీచే స్వర్గలోక మేలింతుమని ప్రతిన యొనర్చినను- తలనడ్డముగా నూపు విరాగి. అట్టివా రీమెకు లొంగునా?

రాజా—ఈయుత్తర మెప్పుడు నీచే చిక్కినది? ఎట్లు చిక్కినది?

శ్యామ—మీబావ మధ్యాహ్నము భోజన మొనర్చి పండుకొను నలవాటు. అందుచే నామె యిది వారితలగడక్రింద కనబడులాగుంచినది. ఆయన భోజనమొనరించి పరుండక వెడలిపోయెను. నాభోజనమైనవెనుక గదిలోనికి వెడలి పరుండమని- పక్కదులుప నిది గాన్పించినది.

రాజా—ఎంకాలమైనది?

శ్యామ—శనివారమునాడు గదా మామగారు గతించిరి. శని, శుక్ర, గురు, బుధ, ఆఁ- బుధవారము. ఆనాఁడేదియో పనిపై వీధిలోనికిఁబోయిరి.

రాజా—బావ కీసంగతి తెలియునా?

శ్యామ—తెలిసినట్లు గన్పడదు.

రాజా—నీవు చెప్పనూ లేదా?

శ్యామ—లేదు.

రాజా—సుభద్రపై నంతకుపూర్వ మనుమాన మేదేని నీకున్నదా?

శ్యామ—ఆమె లోకమాత. కపిలవాయి శంకరరావునుగూర్చి- కావలసినంత గత్తరమైనది. అప్పుడును- ఇప్పుడునుగూడ- ఆమెకోర్కె- నిరర్థకమైనది.

రాజా—దీనినిబట్టి చూడ నామెచెప్పినదంతయు నసత్యకల్పనమనియే యూహింపవలసివచ్చుచున్నది.

శ్యామ—నీవిట్లు మెట్లూహించినను సరియే- దానికి నాయాటంకము లేదు. కాని యింతయు వినిగూడ మూర్ఖ్యము వహించి- ఆయువతిమాయలకు లొంగిపోయి- నీబావను నిర్భాగ్యునిగా నొనరించి నన్ను దిక్కులేనిదానినిగాఁ జేయకుము. ఆతరువాత సాధ్యమైనంతవఱకు నేఁడుగాని- తప్పిన రేపుగాని తండ్రిగారిక్కడకు వచ్చునేర్పాటు లొనరించుము. రేపటికిని వారు రానిచో మీబావను వెంటబెట్టుకొని-

మాయాఁడుపములను దీసికొని నేనే వెడలిపోయెదను. శ
త్రుమధ్యనుండి- ప్రాణములు గోల్పోవజాలము.

రాజా—తండ్రిగారికి రెండుటెలిగ్రాములిచ్చితిని. వా
రే కారణముననో రాలేదు. రేపురానిచో దరువాతవిషయ
మాలోచింతము. నేను కాకినాడనుండి వచ్చుచుండ నొక
యింట గుసగుసలు వినబడ నవి యేమైయుండునా యని పొం
చుంటిని. ఇంతలో వారిమాటలు ముగియుటచే నొకఁ డీవల
కువచ్చుట గ్రహించి నేనొకమూల నక్కితిని. వాని వక్రశ
కటముచ్చుట నేయున్నది. అట్లీవలకువచ్చినవాఁడు వచ్చినట్టే
వెడలెను. నన్నుచూడ లేదనుకుంటిని. వాఁడెట్లో నన్నుచూ
చుటయేగాక- నేను రాజారావునని గూడ గ్రహించెను. ఈ
రాత్రి గం 11 కు నన్నక్కడకురమ్మని వ్రాసెను. అక్కడకు
వెడలి వానిని గలిసికొనివచ్చెద. ఈ రేయి స్థితిగతులుచూచి
గాని యేసంగతియుఁ జెప్పజాలను. నీవాక్యములవలన నుఱి
ల గొడవలోబడిపోయితిని. ఈ తెప్ప తేలుటెట్లో తెలియకున్న
ది. కానిమ్ము. అన్నిటికిని బరమేశ్వరుఁడే గలఁడు.

ఇట్లని రాజారావు తిన్నఁగా వెడలిపోయెను.

అయుత్తరక్షణముననే రామేశ్వరరావు లోనికివచ్చి
యొకచో గూర్చుండి—

ప్రియా! నీవెన్నివిధముల సమర్థించి చెప్పినను నాకు
మీయన్నపై బాడమినయనుమానము దొలగుటలేదు. నా

నాటికి మనకష్టములు దలమున్కలై పోవుచున్నవి. ఇప్పుడో కక్రొత్త యవాంతరము రానున్నది. దానిని మనమెట్లు దాటఁగలమో నాకేమియు దెలియుటలేదు. నేను కాఫీహోటలులో గాఫీదీసుకొని డబ్బులిచ్చువలయునని మనీపర్సు దీయఁగా నందుండి యొకకాగితము బడినది. అది యేమయియుండునా యను సంశయముతో దీసి చూచితిని. అదియొకయుత్తరము. దీనినిజూచినచో నీకు సర్వమును విశదమగును. చూడుము." అని యొకయుత్తరమిచ్చెను. శ్యామల యాయుత్తరమిట్లుపఠించెను.

కామేశ్వరరావూ!

జరిగినసంగతులనుగూర్చి విచారించుటగాని- జరుగబోవు మరంతములు జరుగకుండ నడ్డుకొనుప్రయత్నములుగాని- నీవు చేయకుండుట మిగులశోచనీయము. దొంగవానిచేతికి దాళమిత్తువా బుద్ధిహీనుఁడా? ప్రతికక్షుల యుత్తరమునునమ్మి రాజారావును విశ్వసింతువా బాలిశా? అతఁడు చేయుచున్న ప్రయత్నము నీవేమైనఁ గనిపెట్టగలుగుచుంటివా? ఇప్పటికి నీయిల్లు సర్వనాశనమైనది. నీయొక్కనిత్తో యాతననిశని వదలిపోవును. హంతకురా లనునెపంబున నీమరద లురికంబుపై వ్రేలాడుటో- శిశువుసహితముగా నండమానుదీవులు సేవింపఁబోవుటో జరుగును. అప్పుడు గొడ్రాలయిన నీభార్యయు- అమాయకురాలయిన నీచెల్లెలును- నీ

యాస్తికుత్తరాధికారిణులు. గుట్టుతెలియక పార్వతి రాజా రావును బెండ్లాడవలయుననుకొనుచున్నది. ఇంకాతని కేమియభ్యంతరము? నిర్దోషి దోషిక్రింద శిక్షింపఁబడును. అయిన వారంతరించిపోయిరి. ఆఁడువారగు వారియుప్పురుమాత్ర మేమిచేయఁగలరు? ఒకతె యాతనికి సోదరియే. తనయన్నగారి ప్రవర్తనము మంచిదనియే యామెనమ్మకము. మోహార్ణవంబున మునింగియున్న పార్వతి యాతనిదాసురాలే. ఆమె కీవిపుల ప్రపంచంబున నాతఁడును- ఆతని ధర్మపన్నములు దక్క- తదన్య మేమియు- కనఁబడవు. వినఁబడవు. ఈవిధముగా నీకుటుంబము సర్వనాశనమయిపోవుటయు- నీయావదాస్తియు మీకుటుంబనాశనకారకుం డనుభవించుటయు- అంతకంటె ప్రపంచవిరుద్ధముగా- హంతయు- దొంగయు దానిప్రక్కలో- కన్నతండ్రిని- తాతను- చిన్ననుజంపిన దురితాత్ముని ప్రక్కలో- బడి- నీచెల్లెలు కులుకదలంచుకున్నది. ఛీఛీ ఎంత సిగ్గు. ఇఁకనైనను మేల్కొనుము. చచ్చినవారికై విచారింపక- బ్రతికియుండియు- లేనట్టులేమైపోయిన నీకన్నతల్లి యెచ్చటనున్నదియో దెలిసికొమ్ము. అన్నిటికంటె ముఖ్యముగా నారాజారాయహంతకుని బందెకు బంపించుటయో? నీఖడ్గధారకు బలియిచ్చుటయో? గానిమ్ము. నేనీసాయంత్రము పిస్తోలునొసంగెదను. దానితో నీశత్రుసంహారమొనరింపుము. అందులకు నీ కంగీకారములేనిచో- నీకు నీవే- యాత్మహత్య

యొనరించుకొని- పురుషలోకమునకు దలవంపుదూర్పుము. బుద్ధిహీనుఁడా! నీయిష్టమువచ్చినట్లు జేసికొమ్ము. మాకుటుం బముపైగల నభిమానమే నన్నీహెచ్చరికకు బ్రేరేపించినది. నీబాగోగులు నీచేతిలోనున్నవి.

ఇట్లు నీశ్రేయోభిలాషి,
"కాలసర్పము."

జీవితేశ్వరా! ఈయుత్తరము జదివినపిమ్మట మీమనుటకు ను నాకు వాయిరాకున్నది. ఆదుర్మార్గుఁడు నాపినతండ్రికు మారుఁడని యనుకొనుటకుగూడ సిగ్గుగానున్నది. అతనిమా యమాటలన్నియు యథార్థములనియే విశ్వసించితిని గాని యిట్టికుటిలుఁడని గ్రహింపలేదు. కానిండు. గతజలసేతుబంధ నమేటికి? ఇప్పుడు మీప్రయత్నమేమి? అని శ్యామల భర్తను ప్రశ్నించెను.

కామే—నిరాధారుఁడనై యున్నాను. ఆపత్సముద్రమం దున్నాను. ఏమిచేయుటకును బాలుపోవుటలేదు. పోనీ నిన్ను సలహా యడుగుదమన—

శ్యామ—ఊఁ. అన- నందియమెందులకు చెప్పవు?

కామే—మదుకసామెత చెప్పినట్లువచ్చినది. నీయన్న గారిని నీవుపురస్కరించుకొని—

శ్యామ—నా కన్నగారా? ఆదుర్మార్గుఁడు నాసోద రుఁడా? నన్ను గనిన బంగారుగర్భమున నాతల్లి యిట్టి పర

మదుర్మార్గుని గనునా? మీకు చేతగాకున్న నాకు విడచి
పెట్టుడు. ఆదుష్టుఁడు నాగృహమున కష్టమశనివోలె దాపు
రించినాఁడు. ఈతఁడిట్టివాఁడని తెలియనంత కాల మెంతేని గౌ
రవించితిని. ఇంక సహింపఁగలనా? ఈమూ రాదుర్మార్గుఁడు
నాకంటఁ బడనిండు? ఈనినబులియట్లు విజృంభించి వానిపైఁ
బడి వక్షస్థలమును జీల్చి వానిప్రేగులు మీకు జంఝుంబు
లట్లమర్పకున్న నాపేరు శ్యామలగాదు. ఇదే మీపాదము
లంటి శపథ మొనర్చుచున్నాను.

వదినా! ఇంచుక వెనుకముందు లాలోచించి మాటా
డుము. చిరకాలపరిచయంబుగల నీవే నీయన్నగారి సట్లు శం
కింతు వేమిపాపము. ఆనాఁడాధీవిశారదుఁడు ఖండించిన ఖం
డనమంతయు నింతలో మరచిపోయితివా? ఆయనే హంతకు
లైన మనమింతకాల మిందు నిర్భయముగా నిలువఁగలుగుదు
మా? చిన్నవదిన సివంగివోలె- ఆఁడుపులివోలె చెలరేగి
సర్వనాశన మొనరింప బంధించి మిగిలినవారు జావకుండ
గాపాడిన బుద్ధిమంతుఁడు- చిన్నన్నశిరముగనిపెట్టి యది తెచ్చి
మారువాఁడిని బంధించిన మహానీయుఁడు- మనకొఱకై- మన
కుటుంబక్షేమమునకై- తనప్రాణములు తృణప్రాయము లట్ల
దలంచి యామె యనుచరులతో ముఖాముఖీ- చరాపికీ- ఢీ
కొన సిద్ధముగానున్న ప్రతిభాశాలి- మీరేదియో మాయ
దారియుత్తరము గాంచి- మన కుటుంబమున కాధారభూతుఁ

డైయున్న యీయాయొక్క పురుషావతంసమును నిందించివై
తురా? అయ్యయ్యో! ఎవని కాధారమైన కొమ్మను వారే
నరకుకొందురా? అట్టి మూర్ఖులుందురా? వదినా! నీజ్ఞాన
వల్లి వెఱ్ఱితలలువైచుచున్నదేమి? తప్పు తప్పు. నిన్నుగు
ఱించి యీమహానుభావుఁ డీకార్యమునకు బూనుకొనెనుగాని-
నన్నును- నాచక్కదనమును జూచిగాదే? ప్రతిఫలమున కా
శింపని పరోపకారపారీణుఁడే. నీపినతండ్రికుమారుఁడే. నిన్ను
తనతల్లికంటె నెక్కుడుగా ప్రేమించువాఁడే. సజ్జనుల కంద
ఱకును దలమానికమువంటివాఁడే. హర! హరా! అట్టివాఁ
డిట్టిహంతకుఁడగునా? హంతకుఁడే యపరాధరహస్యపరిశో
ధకుఁడగునా? ఇది కల్పితనవలలో నుండవలసిన విషయము
గాని యథార్థకథనములందది యెట్లు పొసఁగునమ్మా! వదినా!
ఆగ్రహ మాపదలకు మూలము. శాంతము సర్వార్థసాధక
ము. నిజము నిలకడమీఁద దెలియును. ఇఁక లెక్కనాలు
గైదుదినములలో హంతకు నుఱికంబ మెక్కించి తీరుదునని
యీవిజ్ఞానమూర్తి శపథమొనర్చినాఁడు. బ్రదికియున్నచో
మాతల్లిగారి నప్పుడు దోడ్కొనివత్తునన్నారు. ఇందుల కేమా
త్రము దప్పినను నిలువునఁ గాల్చివేయుమని- నా- కిదిగో-
వ్రాసి యిచ్చియున్నారు. ఈక్షణమునుండియు నేనాతనిని వె
న్నాడి యాతని ప్రయత్నములను గనిపెట్టెదను.

కామే___ఏమే నీయీయుపన్యాసమున కంతుదరి లే

కుండ పోయినదే. రాజారావెట్టివాఁడో నీవదినెకంటె- నా కంటె నీకెక్కువ తెలియునా? ఆతనికేదియో జన్మరహస్య మున్నదఁట. వాఁడెవ్వఁడో దొంగవానికొడుకఁట. అట్టివాఁ డు- నటనకై- మనలను నమ్మించుటకై- దొంగవాఁకిట మం చము వేయుచున్నాఁడు గాని యాతఁడు విశ్వాసపాత్రుఁడా? అపరాధి పరిశోధకుఁడు కాఁగూడదేమి? అది కథలలోనివిష యమేమి? అబ్బ ఏమి నీబుద్ధిచాతుర్యము? ఏమి నీవాక్చమ త్కృతి? ఇంత తెలివితేటలు నీకెప్పు డుద్భవించినవి. దొంగ వాని నుద్వాహ మాడవలయునను.—

పార్వ—అన్నా! నన్ను నీ వెన్నియన్నను సహింతును గాని- అసత్యమూర్తిని నీవు దొంగవనియనుట విని సహింప జాలను.

శ్యామ—పార్వతీ! నీవుచిన్నదానవు, మామాటయం దు విశ్వాసముంచుము. దుడుంగుమనగనే గాలము వేయకు ము. అట్లు వేసితివేని- దానినున్న మెఱపోవును- మత్స్యము పాఱిపోవును. ఆయాసము నీకు మిగులును.

కామే—ఇంటిలోనివారెల్ల జచ్చి మేమేడ్చుచుండ- ఇంకను నెట్టికొత్తకష్టము లుత్పన్నమగునోగదా యని యే డ్చుచుండ- చేతికి దొరకినదొంగ నేమిచేయుదమాయని యూ హించుచుండ- నీవాతని పరిణయమాడదలంచితివా? ఆతని మెడపై బడనున్నకత్తి దొలగించి- పుష్పమాలాలంకృతుగా

సౌనర్పఁ దలంచితివా? నీకట్టి యుద్దేశముస్నచో నీవలపుకాని నీకుణము జంపి—

పార్వ—ఆతనినిజంపుట నీతరము గాదు.

కామే—ఎందుచేత?

పార్వ—ఆతనిని మనోవాక్కాయకర్మభి వరించినపార్వతి సర్వదా యాతనికఁగరక్షకురాలై యుండదలంచుటచేత.

కామే—ఆతఁడు నీపితృహంతకుఁడు పార్వతీ! నీభాతృహంతకుఁడు చెల్లీ! నీమాతృదేవతను మఱుమాయము జేసినాడమ్మా! అవి యన్నియు మఱచి నీవాతనిని బెండ్లాడుకువా?

పార్వ—అన్నా! నీవు కేవలము పొరబడితివన్నా!

కామే—నాది పొరబాటుకాదు.

పార్వ—నిదర్శనము?

కామే—ఆతనిని బాధించి చూపెదను.

పార్వ—పనికిరాదు.

కామే—మనకుటుంబములో మిగిలినవారము మనము ముప్పురము. అమ్మను చోరులు దస్కరించినవెనుక తమ్ముఁడు పోయినాఁడు గాని- ఇం దమ్మ దోషిగాదనుమాట రూఢియే గదా ? ఈయాపదనుండి యెట్లో బయట బడుదుమాయని యేమ్చు మనము ముప్పురము కాముగదా ? సుభద్రి తన పెనిమిటిని తాను చంపుకొనదా? మనకింక విరోధి యెవ్వరున్నారు.

పార్వ—పురుషసాంగత్య మభిలషించిగాని- స్వాతంత్ర్యమున కాసించిగాని- కన్నసంతానము జంపుకొనినకాంతలుండ- భర్తకు విషమిచ్చిన పడతులుండ- నీవనుమానింతువేమి? నీదింత గుడ్డినమ్మకమేమి? సర్వాధికారమున కాసించి నీవుచేయుట సబబు- ఏదియో యొకదురభిప్రాయముతో పెద్దవదినగాని- నేనుగాని చేయుట సమంజసము. అంతియేగాని_ యేపాపము నెఱుంగనియాతనియెడ ననుమానింతువేమి? ఈనేర మొక్కరిపై కేగాదు. సుడిగాలివోలె యందరిమీదను చుట్టుకొనిపడినది. పడబోవుచున్నది. నామాటలు మీతల కెక్కుటలేదు. నీవు హంతకుడని వచ్చినయుత్తరము నమ్మవలసినదేనా? వెంటనే నిన్ను బరిమార్పవలసినదేనా ? పెద్దవదినే దోషియని తేలినది. అంతే ముందువెనుక లరయకుండ ముక్కముక్కలు క్రింద నఱుకవలసినదేనా? పార్వతి పాపాత్మురాలని యుత్తరమువచ్చినది. వెంటనే నాప్రాణములు బుచ్చుకొనవలసినదేనా? ఇంతసందర్భము లేకుండ మాటాడుదు రేమిపాపము? చిన్నవదినెదగ్గఱ నొకటిరెండు ప్రబలనిదర్శనములు లభించుటచే నామెను బంధించెను గాని_ లేకున్న నామెనుమాత్ర మ్మాతఁడు నిర్బంధించునా? కథ విడిపోవుకాలమున కీగడబిడ లెందుకు?

కామే—పార్వతీ ! అతఁడు దొంగయైనను వాతనిని పెండ్లాడెదవా ?

పార్వ—ఆహా!

కామే—అట్లయిన మీరిరువురు జత్తురుసుమా?

పార్వ—అట్లయిన మీరుమాత్రి ముందురా?

# పదియవప్రకరణము.

## చీఁకటిలో చిందులాట.

పాఠకమహాశయులారా! రాత్రిసరిగా పదునొకండు గంటలు కావచ్చినది. ఇంచుమించుఁగా నాపురమంతయు జో కొట్టినట్లు నిద్రించుచున్నది. నలుదిశలయందును గాఢాంధ కారము లలముకొనియుండెను. దానికితోడున్న నక్షత్రకాం తియైన లేకుండ ఘనాఘనంబు లలముకొని మరింతగాఢాంధ కార మొనరించివైచెను. ఇంతకొకగంటకు ముందు వీచిన ప్రబల జంఝూమారుతంబున కక్కడక్కడనున్న గుడ్డిదీప ములుగూడ కొండనెక్కెను. కాళరాత్రి బ్రిబలియుండెను. ఇప్పు డిప్పుడే వాయుప్రచార మడగినది.

ఇట్టిసమయంబున నొకవ్యక్తి నీలాంబరధారియై పంచ పంచలఁబడి వచ్చుచుండెను. ఆవ్యక్తియెవ్వరో—ఎచ్చటి క ట్లర్ధరాత్రింబునఁ బడిపోవుచుండెనో మనకేమియు దెలియదు.

ఇట్టిసమయంబున నింకొకవ్యక్తియొకచో నిలువంబడి:- “మంచిది. వచ్చితివా?” అనియనెను.

"వచ్చితిని" అని మొదటివ్యక్తియనెను.

నాయనలారా! ఈప్రకరణము వ్రాయుటకు నాకును-చదువుటకు మీకునుగూడ చిక్కుగానేయుండును. ఎందువలననని యడుగుచున్నారా? వారెవ్వరో మనకు తెలియదయ్యెను. పోల్చుకొనుటకు దగిన యవకాశములు లభింపవయ్యెను. వారెవ్వరో తెలిసికొను పర్యంతము వారిరువురనుగూడ వ్యక్తులనియే బిలువవలయును. ఇది కష్టముగాదా? ఈచీకటిలో చిందులాట సులభమా? కానిండు మనమేమిచేయగలము. మనసౌకర్యమునకై యొకటి, రెండు, అను యంకెలుంచి యీయిరువుర నంకె లనుకొని వ్యవహరింతము. అందేమి ప్రమాదమున్నది. ముందు పలుకరించినవ్యక్తి రెండనియు, తరువాత పలికినవ్యక్తి యొకటనియు బిల్చుకొని కథాకథనములోనికి బోదము.

రెండు—ఒక్కడవేవచ్చితివా?
ఒకటి—అట్లేరమ్మంటివిగదా?
రెండు—నమ్మవచ్చునా?
ఒకటి—త్రికరణశుద్ధిగా!
రెండు—చేతియందు బిస్తోలున్నదా?
ఒకటి—నీకో?
రెండు—నాకు దానితోబని లేదు.
ఒకటి—నీకు వెనుకసహాయమున్నట్లున్నది?

రెండు—అగును.

ఒకటి—నాకు వెనుకసహాయము లేదుగాన పిస్తో లున్నది.

రెండు—నేను నీకిచ్చుచుట్టికీడును దలపెట్టలేదే.

ఒకటి—నేనేనా నీకు కీడుదలపెట్టినది?

రెండు—అట్లయిన సంతోషమే. నీవీవ్యవహారమును విడచిపోయెదవా? లేదా?

ఒకటి—నేను దీనిని తుదముట్ట జూతును.

రెండు—నీతరముగాదుసుమా?

ఒకటి—అప్పు డాలోచింతునులెమ్ము.

రెండు—వలను. ఇప్పుడేపొమ్ము. అట్లయిన మిగిలిన వారు జీవింతురు?

ఒకటి—వారి శిగపూవైన నలగ వాడకుండ చేయ గలను.

రెండు—అదికల్ల.

ఒకటి—నీది నిరర్థకప్రయత్నము.

రెండు—వృథావాగ్వాద మెందులకు? కత్తిగట్టెద వనుమాటయే.

ఒకటి—కత్తి సదివరకే గట్టితిని. విడువవనుమాటయే నాయని యడుగుదును.

రెండు—అట్లే యుంటిననుకొమ్ము. ఏమందువు?

ఒకటి—విడువనంటిని.

రెండు—నావలన నీవట్టియుపకారమును వాంఛించి నను నాచేసైన దీర్చెదను. నీవిందు జోక్యము కలుగజేసు కొనకుము.

ఒకటి—లంచమిచ్చి విరోధిని లోబరచుకొన యత్నింతువా? ఇది నీబహాద్దూరికి కళంకముగాదా?

రెండు—నే నిదివఱ కిట్టి క్రౌర్య మెన్నఁడును బూన లేదు. ఇట్టివొకటిరెండు విషయములు జూచినగాని- నేను రప్తుదేరను. అప్పుడు నే నెవ్వరికిని లొంగను. అంతవఱకును సామ, దాన, భేదము లుపయోగింపదలంచితిని. వానివలన నాకు జయమొనగూడనిచో- కట్టకడపట దండనోపాయము న్నది. అదియే మాయట్టివారికి సర్వశరణ్యము.

ఒకటి—దండనోపాయము నీవవలంభించునాఁటికి నీవు బాధింపఁబడకుందువా?

రెండు—నే నీవిషయముల కెంతకొత్తనైనను మిమ్మే డాట లాడింపక విడువను. నీవు నాశక్తిసామర్థ్యంబు లెఱుంగవు. నీవీవ్యవహారంబున జేసినదావంతయును లేదను సంగతి నీకే తెలియును. నీవీ రేయియు- రేపును- దీర్ఘముగా నాలోచింపుము. నీవిందు విముఖుఁడవైతివేని యేఁబదివేలిచ్చెదను. రేపురాత్రి సరిగా నీవేళకిక్కడకు రమ్ము. అందులకు నీవంగీకరింపనిచో- ఎల్లుండిరాత్రి నీయొక్క- నీచెల్లెలియొక్క-

నీవలపుకత్తెయగు పార్వతియొక్క- శిరస్సులు- ఇదిగో- మీా మూఁడుశిరస్సులు- పోలీసుస్టేషనుగుమ్మమునకు వ్రేలాడ దీయుదును ఈసంగతి జ్ఞాపకముంచుకొమ్ము. నీవు సుభద్రతో మాటాడదలంచితివేని విలాసోద్యానవనమునకు రమ్ము. ఇదిగో! ఈత్రోవగుండ నొకమైలు దూరమునడచినచో గన బడు తాటితోపుచెంతకు రమ్ము. నేనుగాని- నాయనుచరులుగాని నిన్ను గలుసుకొందుము. ఒక్కడవే రమ్ము నీకేమియు భయములేదు.

ఒకటి—సుభద్ర పోలీసుస్వాధీనములోనున్నదిగాదా?

రెండు—తప్పించివైతుము.

ఒకటి—ఎప్పుడు.

రెండు—ఇంకొక్కక్షణములో-

ఆరెండవవ్యక్తి మాటాడుచునే మాయమైపోయెను. ఈరెండవయాతఁడేమేమియో గుణించుకొని ముందునకు నడచుచుండెను. ఇంతలో నావ్యక్తికింకొకవ్యక్తి యెదురయి "ఆగుము" అనియెను.

"నీ వెవఁడవు?" అని మొదటివ్యక్తి యనెను.

"నీ వెవఁడవు?" అనిమూఁడవవ్యక్తి మఱలబ్రశ్నించెను.

"నేనా! నేను డిటెక్టివు పోలీసును" అనెను.

"రాజారావువా?"

"అగును. నీవెవ్వఁడవు?"

"నేనెవ్వఁడనైన నీకేమి? నీకొక సంగతి దెలుప వచ్చితిని."

"నీవెవ్వఁడవో తెలియకుండ నీసంగతి వినుటెట్లు?"

"ఇంతవఱకు నీతో మాట్లాడినవాని సంగతి నీకు తెలిసినదా?"

"ఆతఁడు దొంగయనియు- హంతకుఁడనియుఁ దెలిసినది."

"నేను దొంగలగురువునను కొని నాతో మాటాడుము"

"సరే చెప్పుము. నీయభిప్రాయమేమి?"

"ముప్వరో నలువురో సరిగా చెప్పఁజాలను. నీ చెల్లెలు శ్యామలను నోటఁగుడ్డలుగుక్కి దీసికొనిపోవుచున్నారు. పోయిరక్షించుకొమ్ము."

"ఆఁ. నాచెల్లెలే దొంగలపాలయ్యెనా?"

"అగును"

"నాచెల్లెలో?- పార్వతియో? నీవుచెప్పఁగలవా?"

"శ్యామలయే శాత్రవులకు జిక్కినది. స్పష్టముగాజూచితిని."

"వారెటుబోయిరో చెప్పఁగలవా?"

"విలాసోద్యానవనమట. ఆవైపునకుఁబోవుచున్నారు"

"సరే. నేనిప్పుడే యటుపోయి విడిపింతునుగాని నీవు

పోలీసువారి చెంతకరిగి పదిమందిని నాకు సహాయముగా బం పఁగలవా ?

"వారు నామాట నమ్ముదురా ?"

"అట్లయిన నీయానవాలు వారి కిమ్ము" అని తన మొ హరున్న వుంగరమిచ్చెను.

అది యందుకొని రెండవవ్యక్తి వెడలిపోయెను. వెంట నే రాజారావు విలాసోద్యానవనమునకై పునరుఁబోవుచుండెను.



# పదునొకండవ ప్రకరణము.



## చి దం బ ర ర హ స్య ము.

రాజారావునకు మొదటివ్యక్తి చూపించిన తాటివన ము బీరికాపురమునకుత్తరముగా నొకమైలున్నది. ఆసంగతి యాతఁడు జ్ఞప్తికిదెచ్చుకొని యటుఁబోవుచు నిట్లనుకొనియెను.

ఔరా ! నాకంతయు నగమ్యగోచరముగానున్నది ? మెఱుపుదీఁగకైన నించుక నిలుకడగలదేమోగాని నాబుద్ధి కామాత్రముగూడ స్థిరము లేకుండబోయినది. హత్యలపైహ త్యలు జరిగిపోవుచున్నవి. కొందఱను హత్యలొనరించి- మ ఱికొందఱను దొంగిలించుట కెందులకో నాకేమియు నర్థమ గుటలేదు. కారణములేనికలహము లుత్పన్నమగునా ? ఎం

తచిత్రము? ఆకారణమెట్టిదో యూహింప శక్యముగాకుండ
నున్నదే.

ఇంతవఱకుత్తరములగడబిడ నాధారముగాబనిచేయు
చు ముందునకు బోవుచుంటిమిగాని యాహంతకుని చహారా
యేమియు లభించినదిగాదు. తనగుట్టు నావగింజంతో నాఱవ
పాలైన నితరులకు దెలియుటకవకాశము లభింపనీయక- స
హస్రాక్షుఁడల్లెల్లెడ దానయై- యెల్లరహస్యవర్తనాములను
దానెఱుంగుచున్న యాగజదొంగ- ఆహంతకుఁడెంతవాఁడో
వేరెజెప్పవలయునా? తానొనర్చిన చిత్రవిచిత్రంబులగు నేర
ములన్నియు- ఎవరెవరికేయేవిధముగా ముడిపెట్టిన టంకము
లేకుండ నతుకుకొనిబోవునో నిమిషమాత్రమునగ్రహించి-
వారివారికావిధముగా- బోడిజుట్టునకును- బోటవ్రేలికిని
ముడిపెట్టి రజ్జుసర్పభ్రాంతితో మేమెల్ల దెయితక్కలాడుచుం
డ- మాతెయితక్కలు- మాపీకులాటలు- మాయవస్థలుగాం
చి యాతఁడు లోలోననే నవ్వుకొనుచుండునుగాబోలు. ఆతఁ
డు బహిరంగముగా మమ్ముజూచి పండ్లిగిలించినను మేమాత
నిని బట్టగలుగుదుమా? మాకంతపాటి చాకచక్యమున్నదా
యని నేనిప్పుడు సంశయించుచున్నాను. ఔరా! ఊహాతీత
మైయున్న యాతని బుద్ధిచాతుర్యమెంతేని సంస్తవనీయముగ
దా? ఈదిక్కునింతటంతట విప్పుటకవకాశమున్నట్లు గానబ
డకున్నది. ఇప్పుడీయద్భుతరహస్యోద్భేదన మొనర్చుటకు

గనంబడుచున్న మార్గ మొకటున్నది. నాల్గుదినములైనచో పరహస్తంగతమైన కాంతమ్మగారైన దొరుకవలయును. లేదా యిప్పుడిప్పుడే వారిపరమయిపోయిన శ్యామలయైన లభింప వలయును. వారించుమించుగా దస్యుదళనాయకుని గుర్తించి యేయుందురు. వారివలన నారహస్యమెఱుంగుట కవకాశము లభించునేని యాక్షణమే యాతనిని బంధించివేయవచ్చును కాని యదిమాత్రము సామాన్యమా? ఈకాఱుచీఁకటిలో వారు నాకిప్పుడు గాన్పింతురా? ఒకానొకవేళ వారిదర్శనలాభ మిచ్చుట నాకుఁ గలిగినను నేనొక్కఁడ వారి నెదిరించి పోరగలనా?

"అన్నలారా! రక్షించి విడువుఁడు విడువుఁడు."

ఆఁ- అదిగో! మా చెల్లెలే గాఁబోలు నార్చుచున్నది. ఔరా! ఆనుష్కారాధముల కెంత నిర్భయము. కానిమ్ము ఈసందర్భమున నాప్రాణములకు దెగించియైన నాచెల్లెలను గాపాడుటకై బ్రయత్నింపకమానను.

ఇట్లనుకొని వెంటనే గుప్తముగా దాచి యుంచిన పిస్తోలునుదీసి చేతఁబట్టుకొని యార్తనాదము వచ్చిన దిక్కుగా బయలుదేఱి:—

చెల్లీ! శ్యామలా!! భయపడకుము భయపడకుము. వైరినిశ్శేష మొనర్ప సమర్థమగు పిస్తోలుతో వచ్చుచున్నాను. భయపడకుము. నాకంఠంబున బ్రాణము లుండఁగా నిన్నేదు

రితాత్ములను హింసింపఁజాలరు. నాచేతనున్న నీయగ్ని గోళమునం దాఱుగుండ్లున్నవి. దీనితో దడదడ నీవైరులను గూల్చి నిన్ను రక్షింతును.

ఇ ట్లనుచు- ముందునకు బరుగిడుచు- చేతియందున్న పిస్తోలు నాకాశమునకు గుఱియుంచి "ఢాం" మని పేల్చి, మేఘగర్జనస్వనంబున నార్చుచు ముందునడచుచున్నవారి కడ్డముగా బోయి పిస్తోలు చూపించుచు:—

"దుర్మార్గులారా! నేటితో మీపాపము బండినది. మాశ్యామలను విడచిపెట్టి చేతులు జోడింతురా? ఈపిస్తోలునకు మీవక్షస్థల మర్పింతురా?"

నీయట్టివా రెంతమందియో నీకంటె వేయిరెట్లెక్కువ గంభీరముగా మాటల బొంకము జూపించి క్రియలో శూన్యహస్తులై మాంకే జేమోడ్పు లిడిరి. వీరాధివీర- విజయగండర గండ- దోర్దండమండిత- పురుషకేసర బిరుదాంకితుండగు- దుర్దమాభిదాన చోరనాయకుని యనుచరుల మగు- మే మాతని యాత్మశాంతికై- యీపవిత్రకార్యము లొనర్చుచుంటిమి. ఆతని యనుచరులు- ఆతని సేవకులు- నదురు- బెదురు లెఱుంగని ధీరులని నమ్ముము. ఆతని యుపనాయకుండగు భీమేంద్రసింహు మీాతన్వంగి నేలుకొనఁ దలఁచుటచే నీమె నిట్లు కొనిపోవుచుంటిమి గాని- ఆయాశయే మాకు లేకున్న- నీమె మృతకళేబరమో? మొండెమో నీకు దొరు

కవలసినమాట. వచటా! వదర కావలకు బొమ్ము. నీపిస్తోలు మాకిచ్చి నీసనాతన భావమరది కాళ్లపై నీవు వ్రాలుము. అప్పుడు నీప్రాణములు నిలుచును.

"ఏమా మాహాత్మ్యము" అని చటాలున పిస్తోలు గుంజి చూసికొట్టెను. ఎట్టయెదుటఁ గ్రమ్మిన పొగబోయి చూచు నప్పటి కట నెవ్వరును లేరు. కాని శ్యామలమాత్రము మట కట్ట బడియుండెను.

"అన్నా! ఆదురితాత్ములు నీపిస్తోలునకు వెఱచి పాఱి పోయిరి. వెంటనే నాకట్లు విప్పుము. నేను గూడ నాపిస్తోలుతో వారి నెదుర్కొందును." అని శ్యామల యనెను.

ఎట్లయినను మొత్తముమీఁద రాజారా విట్టిశివప యలం దాఁటిపేటిన వాఁడుగాఁడు. నూనూగు మీసములును-పడుచుదనపు గర్వమును నేర్పరితనమునకు దృష్టాంతము లగునా? కాని మేకపోతుగాంభీర్యమునను కరించి నిలువఁ బడగలుగుచుండెను.

అతఁడు తన పిస్తోలు గ్రిందం బెట్టి దానిపై గాలు మోపి శ్యామల కట్లు విప్పివేసి లేచుటకు యత్నించుచుం డఁగా నొకదొంగ హఠంబుగా వచ్చి మీఁదబడి యొక్క 'గలాతా' తో రాజారావును బడద్రోసి యాపిస్తోలు దీసి కొని:—

రాజా! ఏది? ఇందాకటి నీప్రగల్భవాక్యము లిప్పు

డు బలుకుము. చేత బిస్తోలున్నదని చెడగొంటితివే. ఇప్పుడైన మా కాళ్లుబట్టి రక్షింపుమని యాదువా ? నీవి శాలవక్షస్థలము నం దీయగ్నిగోళమునకు జోటొసంగదవా ?" అని యనెను.

రే దుర్మార్గులారా ! ఇల్లలుకగనే బండుగకాలేదు. శ్యామల సజీవినియై యున్నది. ఆమెచేగూడ నాలుగుండ్లపిస్తో లున్నది. మీ నేర్పు నెఱుంగనివారిని నీవు బెదిరించుము. పిస్తోలు గాల్చుటయన- తుప్పచాటుననో- డొంకచాటుననో నిలచి- యలుగువిడచుటయనుకొంటివిగా బోలును. అది బ్రయోగించువిధము నీ వెఱింగియున్న నిదివఱకే బ్రయోగించి యుందువు. నీకా చాకచక్యము లేదు. పాఱిపోక నిలచితిరేని మీ ప్రాణములు దీసెద.

అని శ్యామల వెంటనే బిస్తోలుగాల్చెను. దొంగలు చెల్లాచెదరై పాఱిపోయిరి. సమయమునకు దనసోదరి జూపిన ధైర్యసాహసముల కెంతేని రాజారావు మెచ్చుకొని యామె ననేక విధముల బొగడి యామెచేయి బట్టుకొని గ్రామములో నికి నడిపించుకొని బోవుచుండెను.

అట్లు కొంతదూర మరిగి:- సోదరీ ! మనము సరియైన మార్గమున గ్రామములోనికి బోవుచుంటిమేని యాదుష్టులు మనలను వెన్నాడి మఱల బట్టినను బట్టవచ్చును. కావున మనము సందుగొందులం బడిబోవుదమురమ్ము."

అని సందులలోనికి మరలించి దీసికొనిపోవుచుండెను.

వీరు నడచుచున్న సందొకసానివాఁడ. సమయము సుమారు రెండుగంటల వేళ. ఇట్టిసమయంబున నొకమేడపైనుండి చక్క నిగీతములు శ్రావ్యముగా వినవచ్చుచుండెను.

తే. గీ. పంజరముదీసియుండెను । సంజవేళ
నుండియును మానుబిల్లి ని । న్నొడిసిబట్ట
గాచె, రోగార్తనై నిను । గావలేక
యుంటి, బ్రదుకుమీ తటకున । మింటికెగసి.

అట్లు పాడుచున్న రాజారావా పద్యమాలించి శ్యామల చేయిబట్టుకొని మెల్లగా నాపంచకు జేరెను. ఇంతలో నొక యొంటెద్దుబండి యాసందుకుండ వచ్చుచుండుటగాంచి యందెవ్వరుందురాయని సంశయించుచునే రాజారావా బండిని సమీపించి—

"ఈబండికి దీపములేదేమి? ఇందెవ్వరుండిరి? ఈబండివాఁ డెవ్వఁడు?" అని యడిగెను.

"నీవెవడవు? దొంగవా? పోలీసువాడవా?"

"నేను పోలీసువాఁడనే? నీబండినాపుము"

"ఇంకొకమా రాపుమంటివేని తన్నులు దినగలవు? బుద్ధిగలిగి పాఱిపొమ్ము."

"ఓమనుష్యులారా! ఒక నిముస మాగుఁడు. మీకొరి వ్యడగించెదను."

అని యీలనూదెను. మఱియొకమా రూదెను. పోలీసువారి సహాయములేదు.

ఎచ్చటనుండివచ్చిరో యెట్లువచ్చిరో యేడెనమండుగురు దడాలునవచ్చి రాజారావు పైఁబడి—

"ఏమిరా! ఈబండియం దెవ్వరుండిరో తెలిసినదా? బండివాఁడు గాన్పించెనా? తులువా! నీమార్గమున నీవు బోక జోలిమాలినపనికి చొరబడుచో నిట్టివైపరీత్యము లుద్భవించును. మూఢుఁడా! శరణని ప్రాణములు దక్కించుకొందువా? చేయిచేయిగలిపి స్వర్గము జేరుకొందువా?

"శ్యామలా! నీవుపాఱిపొమ్ము."

"ఓరిగాడిదా! మాయజమానిచేతులనుండి శ్యామలను దప్పించివైచితివా?"

"ఛి ఛీ! నోరుమూయుము."

ఇంతలో "ఢాం" మని పిస్తోలుపేలెను వెంటనే మఱియొకటి- దానివెనుకనే యింకొకటి.

ఎవ్వరో గుబ గుబ పరుగిడుచున్నట్లు పదధ్వనియైనది. ఒకక్షణ మాపొగలో నేమియు గన్పడలేదు. అంతయునైన వెనుక శ్యామల మూంమునకుఁ జూచెను. అట బండిమాత్ర ముండెను. ఆమె మెల్లిగా వెడలి బండిచెంత నిలువంబడి—

"బండిలోనివా రెవ్వరు?"

"నేనొక యనాథయువతిని."

"పేరు"

"సుభద్ర"

"నీవు సుభద్రవా?"

"అగును"

"నీ కుమారుఁ డేడి?"

"పోలీసువారి చెంతనుండెను."

"నిన్నేలవారు విడచివైచిరి?"

"ఒకదుర్మార్గుఁడు, రాజారావుగారు నన్ను దోడ్కొని రమ్మనిరని నమ్మికబుట్టవచ్చి వారియంగుళీయక మానవాలు జూపెనఁట. అందుచే బోలీసువారాతనిని నమ్మి యీ బండిపైనెక్కించి నన్నుమాత్రమే బంపించిరి. నీవు వెంటనే వత్తువు గాన పిల్లవానినంతవఱకు మేము గాచుచుందుమని వారనిరి? మీరెవ్వరు?

"సోదరీ! నన్నుఁబోల్చుకొనలేదా?

"అయ్యో! పుట్టెడు దుఃఖములోనున్న నన్ను నేనేమఱచు దురవస్థలో నుంటిని. మిమ్ము బోల్చుకొనజాలనైతిని. క్షమింపుడు.

"సోదరీ! లెక్కమూఁడుదినములలో నింతమఱపా? నేను శ్యామలను.

ఇంతలో రాజారావు వచ్చి—

సోదరీ! పోలీసుశాఖలో బనిచేయుచున్న నెం 198 రు

కాళిదాసు దుర్బుద్ధియై దొంగలయొద్ద లంచముదీసుకొని మ
నగుట్టుమట్టులన్నియు దస్యుదళనాయకున కెఱింగించుచున్నా
డు. కావుననే మన మెట్టియుక్తిపన్నినను దస్యుని- హంతకుని
బట్టగలిగితిమిగాము. అనుర్మార్గుని నమ్మి సుభద్రి నొకచో
రహస్యముగానుంచితిని. వాఁడామెను దస్యులపర మొనర్చి
వైచి- అట నొక ఝూటాకోరును సుభద్రిగా నలంకరించి
కూర్చుండబెట్టెను. ఈదుర్మార్గుఁడే ఆసుభద్రి. ముందు వీని
ని బంధించుము.

వెంటనే గుప్తముగా దాచియుంచిన శృంఖలములం దగి
లించి——

శ్యామలా! ఈమారు మనప్రియత్నములన్నియు నిర్వి
ఘ్నముగాఁ గొనసాగును. సుభద్రి మారుమాటాడక దస్యు
లవెంటబోవుట చూడఁగా నామెయే నాయకురాలయి మన
ల నిట్లాడించుచున్నదా యను యనుమానము మరల వృద్ధి
యగుచున్నది. అట్లేగాదేని యామె యేమాత్రమరచినను
సహాయముజేయుటకై బాతికమందియున్నారే. ఆమె యా
ర్వకుండుట కేమికారణము ? నాయనుమానము స్థిరమైనచో
మనకీరేయియో- రేపటిరాత్రియో ప్రిబలమగు పోరు తటస్థ
పడును. అందుకు మనము సిద్ధముగా నుండవలయును. ము
నుముందు నీయునికి తెలియకుండ నిన్ను దాపవలయును.
ఆవెనుక భీకరరణరంగమున కురుకవలయును. ఆలస్య మా

పదలకు మూలము. నిన్ను దాచుట కొరకు రమ్యస్థల మేర్పరచి తిని. రమ్ము పోవుదము.

అన్నా! అట్లనే పోదము. నీవు నన్నాపదలనుండి రక్షించితివి గాన నీతో నిట్లు శాంతముగా మాటాడుచున్నాను. తగినన్ని దృష్టాంతములు నీవు హంతకుఁడవని నిరూపించుటకున్నవి. నీవు నా కన్నగారవు గనుకను- ప్రాణరక్షకుఁడవు గనుకను నిన్ను నేను హెచ్చరించునదేమనఁగా నీమాయలను- నీపన్నాగములును- నీచాతుర్యములును గట్టిపెట్టి- యిఁక నాకంటబడకుండ- పోలీసువారికి జిక్కకుండ- పరారీయై- యెందో మారుపేరున జీవింపుము. నీవు నాకొనర్చిన యుపకారమునకు నేను నీకొనర్చు నుపకార మియ్యదియే. నీవు నన్నెట్లు రక్షించితివో- అనఁగా రక్షించునట్లు నటించితివో- నేనును నట్లే నటించితి ననుకొనుము. నీవు నీబావగారి కంటబడినను- పోలీసువారికంటబడినను నీకిఁక నిష్కృతి లేదని నమ్ముము.

మారు నాకంటఁబడినను నీప్రాణములు నీకు దక్కవు. పొమ్ము. పొమ్ము. అని శ్యామల వెడలిపోయెను.

రాజారావేమియు మాటాడజాలక నిర్ఘాంతపోయి జూచుచుండ:—

"వేము పాలోసి పెంచినన్ । విడదు చేదు
ఖలుఁడు సద్బోధవినియును । గనఁడు గుణము"

అని వినంబడియెను.

ప్రథమఖండము.



# కాలప్రవాహము

## ద్వితీయఖండము.

## మొదటి ప్రకరణము.

### శ్యామలరావు.

ఛీ! దురాత్మా! మఱల నాగుమ్మ మెందులకువ్రాక్కితివి? కలుషహృదయా! "చుట్టమై చూడవచ్చి దయ్యమై దుయ్యబట్టినదన్న" ట్లొనరించితివే? ఇంతకాలమా మహానుభావునియొడఁ బెరిగితివే. ఆఱునెలలు సహవాసమొనర్చిన వారువీరగుదురను సామ్యము నీయొద్ద నిరర్థకమైనదా? ఆపురుషావతంసుని హితబోధలన్నియు నీపట్ల బూదెబోసిన పన్నీరైనదా దుర్మతీ! చెల్లీ! చెల్లీ!! యని బిల్చిబిల్చి క్రియకామెను గూడ నంతర్ధానమొనరించివైచితివా బాలిశా! లెక్కలేనన్ని కష్టములు దొంతరదొంతరలుగాఁ దెచ్చి నా పైఁబడవైచి- నన్నేడ్పించి- నావినాశన మాకాంక్షించియున్న- నీవు- పాపీ! నరాధమా!- మానవరూపపిశాచమా!-

నీవు- సిగ్గులేక- యుచ్చనీచతలు లేక- మానాభిమానము లేక- మఱల నేమని నాయింటికివచ్చితివి. నన్నిట్లైనను బ్రదుకనీ యదలఁచుకొనలేదా? నీవిషయమై దగినకట్టుబాటులన్ని యు నొనరించితిని. సరిగా రెండుదినములలో నిన్నురికంబ మెక్కించు నేర్పాటు లొనరించి- నిన్నురికంబమెక్కింపకున్న నప్పుడనుము. నీ—

బావా! ఏటికిట్టియసంబద్ధాలాపములాడెదవు. నేనే హంతకుఁడనైనచో నాసంగతి నీకుదెలిసినప్పుడుగూడ నింత బహిరంగముగా నీకంటబడుదునా? ఎఱిఁగి యెఱిఁగి జుట్టు చేతికిచ్చు నిర్భాగ్యుఁడెండ్రైననుండునా? నీవింతమాత్ర మాలోచింపవేమికర్మము. అదిగాక నీకీవిషయమున నేనిప్పుడేమి చెప్పుటకును నసమర్థుఁడనైయున్నాను. ఈవ్యవహారమున కిది మొదలని నిర్ధారించుటకే కష్టముగనున్నది. ఒక్కతల వెండ్రుకతో- కాలిగోరుతో- చేతికర్రతో- చినిఁగినవస్త్రముతో- దేనితోనో యొకదానితో- నెట్టివ్యవహారమైనను- నెట్టి గంభీరరహస్యమైనను నిమిషములో ఛేదింపవచ్చును. మనుజుని బట్టవచ్చును. ఇచ్చటట్టిదిగూడ నెద్దియునులేదే. నీవాక్యమువలన మాశ్యామలగూడ హంతకులపాలైనట్లూహించుచున్నాను. కడచినరేయి దస్యులబారినుండి యామెనురక్షించితిని. ఆమె నన్ను నిందించి వెడలిపోయి మఱల ప్రమాదమునబడినట్లున్నది? కట్టా! ఎంతమురవస్థవచ్చినది.

బావా ! ఉపకారమునకుఁ బోవ నపకార మెదురైన దన్నటులనైనది నాపని. మీదూషణభూషణ తిరస్కారం బులు నే సరకుగొనను. సరిగా నాల్గుదినములు దాటకుండ సరియైనకారణములతో- తగిననిదర్శనములతో- హంతకుని బహిరంగబరతును. మాశ్యామలను- మీయమ్మనుగూడ దోడ్కొనివత్తురు. అంతవఱ కిక్కడకు రాను.

అని వెంటనే రాజారావు వెడలి వీధిలో దనకొఱకు గనిపెట్టుకొనియున్న గోవిందుతోఁ గలసి యెక్కడికో వెడలి పోయెను.

అంతయింటికిని యిప్పుడున్నవారు పార్వతియుఁ గామే శ్వరరావునుమాత్రమే. కామేశ్వరరావు ప్రాజ్ఞుఁడేగాని యబ లకంటెను భయస్థుఁడు. అందుచేతనే రాజారావు హంతకుఁ డని పూర్ణముగా నమ్మియు విడచిపైచెను.

ఇంతట పచ్చని దబ్బపండువంటి శరీరచ్ఛాయగలిగిన యిరువదియేండ్ల యువకుఁడొకఁ డరుదెంచి కామేశ్వరరావు ను గాంచి:—

“అయ్యా ! తమరేనా కామేశ్వరరావుగారు ?” అని ప్రశ్నించెను.

“అగును. తమరెవ్వరు ?”

“తమరు కడచినరేయి కాకినాడ D. S. P. గారితో మీవ్యవహారమంతయు జెప్పి చాకచక్యముగల డిటెక్టివుగా

వలయునని కోరితివట. వారు నన్నిక్కడకు రహస్యముగా బంపించినారు."

కామే—అయ్యా! తమరా! ఇటు గూర్చుండుడు. ఇచ్చటిదివఱకు నడచిన వ్యవహారమంతయు D. S. P. గారు తమకెఱింగించిరా?"

"ఆహా! తెలిపిరి."

కామే—"తమ నామధేయము?"

"శ్యామలరావు"

కామే—చిత్రము. మా బావమరదియే మాయీవినాశనమునకు మూలకారణమని నాయభిప్రాయము. మా యాఁడువాండ్రకుగూడ వానిపైననే యనుమానము. అన్నగారనియైనను జూడక వెంటనే యాతని పోలీసుపరము సర్చుమని కోరినది. నేనువింటినిగాను. కట్టకడపట కాతఁడా సుగుణవతిని- నాభార్యను- తనసోదరిని- నాసౌభాగ్యరాశిని- నా శ్యా-మ-ల-ను—

శ్యామ—చంపివైచెనా? ఎక్కడ?

కామే—చంపుటగాదు. నామాతృదేవత నపహరించినట్లే యామెనుగూడ నపహరించెను. ఇంతకొక్కక్షణమునకు ముందే యాతఁడిటకు వచ్చి నాచే చీవాటులఁ దిని వెడలిపోయెను.

శ్యామ—ఇదియంతయు నొకవిచిత్రమగు కట్టుకథ

వోలెమన్నది. కొందఱను దాఁచుట- కొందఱకు విషప్రయోగము జేయుట- కొందఱను గత్తికెఱజేయుట- ఇన్నిరకములగా నాహంతకుఁడు సంచరించుట కేమి కారణమో తెలియదు. రాజారా వేకారణముచేతనో గొన్నిసరళమార్గములు విడచి- దుష్కరమార్గంబుల బట్టినాఁడు. అందుచేతనే యీ వ్యవహార మింతవరకు వచ్చినది. ఆతఁడు కావలయునని యీ వ్యవహార మింతవఱకు బెంచెనేగాని- నిజమున కిది యింతదూరము రావలసినదిగాదు.

కామే—మీకుదోఁచిన సరళమార్గ మేది?

శ్యామ—మిక్కిలి సూక్ష్మబుద్ధిగలవానికిగాని యీ యభిప్రాయము చటాలున గలుగదు. ఇదిగో నాభావము చెప్పుచుంటిని వినుఁడు. రాజారావు దొంగవానికుమారుఁడనియు- అదృష్టవశంబున గౌరవనీయకుటుంబములో బెరిగెననియు నొకయుత్తరములో మీకు దెలియవ్రాయబడియున్నదిగదా? ఏదియో యొకకారణములేని కథయుండదు. ఆవాక్యమునం దీషణ్మాత్రమైనను సత్యముండవలయును. ఆ దుర్మార్గుఁడు మీపార్వతిని మోహించుటయు- మీపార్వతి యాతనిని వరించుటయు మీ కెఱింగినదే. వలపుస్థిరపడినవెనుక తననిజవృత్తాంత మాయమాయకురాలి కెఱింగించి- వారిరువురును గలిసి వారిగూడెమునకుఁ బోవుట కేర్పాటు లొనరించుకొని- మీయాస్థినంతయు నీలోపున గైంకర్యము

నర్ప నూహించి దుశ్ఛేద్యంబగు నీకుతంత్రమును బన్ని యుందురు.

కామే—అయ్యా! మీసమన్వయము వినినగొలఁది నావిచారముబోయి నవ్వువచ్చుచున్నది. ఇదివఱకిట్టి యను మాన మేరికినిగలుగలేదు. మాపార్వతి యాతనిని వరించిన మాట సత్యమే. తక్కినచరిత్రకును- వారివలపునకును నె ట్లు సమర్థింతురో సమర్థించుఁడు.

శ్యామ—నాది కేవలమపోహమైనఁ గావచ్చును. నా సందియమును బూర్ణముగా వినుఁడు. వారివలపు స్థిరపడినది. మీయాస్థి వారికి నిరాఘాటముగా- నిరాక్షేపణీయముగా జెందవలయును. ఈమీయాస్థి కేవలము మాధవరావుగారి స్వార్జితము. మునుముం దాయన పోయినచో మీజనకుఁ డా యాస్థి కధికారియగును. అప్పుడది పిత్రార్జితమగును. ఆతరు వాత ననగా మాధవరావు తరువాతమీజనకుఁడును-తరువాత మీరును-గతించినచో-మీవంశములో నెవ్వరోయొకరు వార సులగుదురు. అప్పుడాయాస్థియంతయు పార్వతికి దక్కుటకష్ట ము. కొద్దియో గొప్పయో యపరాధరహస్య పరిశోధకశా ఖలోఁ బనిచేయుచున్న రాజారా వూహించి- తనప్రియురాలి కెఱిఁగించి- యామె యంగీకారముబడసి- మాధవరావుగారి కంటె ముందుఁగా రఘునాథరావుగారిని జంపదలఁచి సమయ ముజూచికొని యాతనిపైనుండి మోటారుబోనిచ్చి- ఆదెబ్బ

లచే నాతఁడు మరణించిన ట్లనుమానపడుదురనుకొని విషమి చ్చివైచెను. ఆరహస్యమును గ్రహించిన బాహితుఁడెవ్వఁడో బోలీసున కూదివైచెను. కనుగలిగినట్లు ముగియవలసిన వ్యవహారము వెల్లడిలోబడి యల్లరియైనది. అందుచే దప్పించు కొనుటకై వారు బ్రయత్నింపవలసివచ్చి- తానే యపరాధ పరిశోధకునిగా నున్నచో దమరహస్యము వెల్లడిగాదను త లంపున కాకినాడ వెడలి D. S. P. గారి కండ్లలో గారము నుగొట్టి తానందుకు నియమింపఁబడి వ్యవహారమంతయు గాడిదగత్తర జేసివైచి- ఎప్పటికెట్లు వీలయిన నట్లెల్ల నీనేరమిత రులపై నెట్టివేయదలంచెను. రఘునాథరావుగారు చనిపోవు టచే మీతాతగారగు మాధవరావుగారు విల్లువ్రాసిరి. ఆవి ల్లుసంగతి గనిపెట్టి యది పార్వతియే గైంకర్యముజేసి గోవిందుఁడు దొంగయని బట్టిమొప్పగించినది. విల్లుసంగతి యేరి కని దెలియుటకారణమున గోవిందుడు దొంగయని యెల్లరును విశ్వసించిరి. తానే పరిశోధకుఁడు గాన తమపైకి నేరమువ చ్చునప్పుడెల్ల- తమ్మితరులు సంశయించునప్పుడెల్ల- తన బుద్ధిచాతుర్యముచే దప్పించుకొనుచు వచ్చెను. నేర మితరులపై మోపు చేయుచుండెను. నేరమితరులపై మోపుటకు బ్రయత్నించుచుండెనే గాని- వారిపై బలవత్తరములగు సాక్ష్యములు దేజాలకుండెను. ఇట్లే ఇంకొకవారములో నిన్నును సంహరించి నీచెల్లెలీ యావదాస్తికిని యుత్తరాధికారిణియై- స్థిరా

స్థి విక్రయించి రొక్కముక్రిందమార్చి చల్లఁగా దమనిర్ణీత స్థలమునకైనను వెడలిపోదురు. హత్యాపరాధకునిక్రింద నెవ్వరినో నుఱికంబ మెక్కించి- దొరతనమువారి నావిధముగా మోసగించి- బహిరంగముగా నచ్చటనైనను జీవింతురు- ఇది మనమునందిడుకొని పనిప్రారంభించినచో నింకను రహస్యము లున్నచో బయటబడవచ్చును. ఆవిషయములు విసర్జించి- తప్పుదోవను బోవుచో- గమ్యస్థానమే నాటికైన జేరుట కవకాశముగలదా? నేరస్థుఁడు పట్టుబడుటకు వీలున్నదా?

కామే—బాబూ! మీసంశయమెంతయు సత్యమైయున్నట్లు బొడకట్టుచున్నది. నిజముగా వారికట్టిదురభిప్రాయమున్నది గావుననే సరియగుమార్గమున వారిరహస్యమును భేదించుటకు యత్నింపలేదని నేనును సంశయించుచున్నాను. కాని యీవిషయమున మిమ్ము గొన్నిప్రశ్నలడిగెదను. వానికి సముత్తరములిచ్చి నాసంశయవిచ్ఛేదము గావింపుడు. వారిపై నభిమానముతో నడుగుచుంటినని భావింపకుఁడు.

శ్యామ—తప్పకడుగుఁడు. అందువలన నాయనుమానము మరింత స్థిరపడవచ్చునుగదా?

కామే—మాతండ్రియు- మాతాతయు నాతని క్రోధాగ్నికి గురియైనతరువాత- మాతమ్మునిం యామస్తాత్మునియనుచరులు మ్రింగించిరిగదా? ఆరాత్రియే నన్నును, నాభార్యను, నామరదలినుగూడ నేల తుదముట్టింపలేదు.

శ్యామ—చంపవలసినదే కాని మొదులకు సంశ యించిరో యిప్పు డెట్లుచెప్పఁగలము. ఒకటిమాత్రమున్నది. మీముప్వురిలోనను నేరనో యొకరిని హంతగా నిశ్చయించి యురికంబమెక్కించి తమకీసు బాపుకొనదలఁచి యున్నాఁడు గాన నొక్కమారుగా నందఱను సంహరింపకయుండిన నుండ వచ్చును. మిమ్మందఱ నొక్కమారు జంపినచో నేరమింకె వ్వరిమీఁదికి ద్రోయుట కాతని కవకాశముండదుగదా?

కామే—అట్టియభిప్రాయ మున్నవాఁ డింకొక యిరు వురనుజంపి మూఁడవవారిపైకి నేరము నెట్టివైచినచో వారి యాశయముదీరదా?

శ్యామ—అప్పు డింకొకచిక్కున్నది. మీముఃవ్వురిలో నెవ్వరోయొకరును, బార్వతియు నుండవలయునుగదా ? అ ప్పు డాయిరువురనుగూడ దొరతనమువారు బంధించినచో గ ష్టముగాదా? అందుచే నొక్కరినివధించి- మరియొకరిని బం ధించి- మరునాఁడో- మూఁడోనాఁడో యాబంధింపఁబడిన వారి యనుచరులా మిగిలినవారిని దుదముట్టించి యుందురని ప్రజలు న- దొరతనమువారునుగూడ విశ్వసించునటు లొన రింపదలంచి యిట్టి కపటతంత్రమును బన్నియుందురు.

కామే—అగునుగాని నిన్నటిరేయి నాభార్యను ద స్యులెత్తుకొని బోవుచుండ దానువిడిపించితినని రాజారావని యెను. అట్లేమైన నాతఁడామెను విడిపించుటకేమికారణము?

శ్యామ—వెఱ్ఱివాఁడా! ఇట్టివిషయంబులన్నియు నొకేమతలబులో నుండవు. దొంగలచేతులలోఁ బడిన యామెను గనిపెట్టి విడిపించినవాఁడు- హంతకుఁడనియు- దొంగల నాయకుఁడనియు బ్రజలునమ్ముదురా? అట్టివాఁడైనచో నామెను విడిపించుట కేమికారణమని సంశయింపరా? ఈచిన్న నటనచే దాను నిర్దోషినని పించుకొనవచ్చును. ఆనిర్దోషి యనుబిరుదు సంపాదించినవెను కాయబలను జంపుటకెంత గావలయును.

కామే—అట్లయిన మాతమ్ముఁడు వధింపఁబడిన నాఁటిరేయి పార్వతిగూడ తలక్రిందుగా వ్రేలాడుటకును- మామరదలట్లు వ్రేలాడబడక క్రింద సామాన్యముగా గట్టబడియుంటకును గల కారణములుగూడ నివియేయనుకొందును.

శ్యామ—నిస్సందేహముగ!

కామే—ఇంతవరకు దెలసికొనినపిమ్మ టింక సంశయమెందులకు? తొలుత పార్వతిని బంధించు టుత్తమము గదా!

శ్యామ—కాదు. నేనపరాధపరిశోధకుఁడనని యాతఁడెఱుంగఁడు గనుకతనితో నొకమారు నేను బ్రసంగించి నాకెట్టియభిప్రాయము గలుగజేయుటకై యాతఁడు బ్రయత్నించునో చూడవలయును. అదిగాక ముందెప్పటికైన రాజారావును బంధించి పార్వతిని బంధింపవలయునుగాని ముం

దే పార్వతిని బాధించినచో- రాజారావుప్రాణములు దక్కిం
చుకొనును. ఒకటిరెండుదినములలో కార్యముముగించి యా
తనిని బంధింపకున్న- మీయంబయు- మీయాబిడయు-
మీరునుగూడ జీవించుటకల్ల. కనుక ముందు నన్ను రాజా
రావుతో మాట్లాడనిండు. ఇంకొకపరిశోధకుఁడు వచ్చెనని
యేరికిని దెలియనీయకుఁడు. నేనును సామాన్యునియట్లుచ
రించి నేరస్థునిబట్టి యొప్పగింతును.

కామే—మీచిత్తమట్లేగానిండు.

శ్యామ—నేనీనాఁడు లెక్కలేనన్ని మారువేషములు
వేయుదును. లాలాయింట శిరము బడవైచెనని యెల్లరనుకొ
ను రాముని, భీముని గలిసికొనవలసియున్నది. ఒకవేళ వారా
తని యడుచదలెనఁ గావచ్చును. అట్టివానికి కొంత యంగ
బలముండకతప్పదు. వీలుచేసుకొని- లాలామాట సత్యమైన
చో వారినిగూడ పట్టవలయును. ఈనాల్గుదినములనుండియు
గాలక్షేపమైనదిగాని యావగింజంతపని జరుగలేదు. ఇఁక
ముందట్లుగాదు. ఒకటి రెండుదినములు; తప్పిన మూఁడవ
నాఁటితో- నీవ్యవహారము పరిష్కారమైతీరవలయును. మ
రినాకు సెలవిండు. ముందు పోలీసువారిని, తరువాత రాజా
రావుని గలిసికొని పని ప్రారంభించెద. అని శ్యామలరావు
వెడలెను.



# రెండవ ప్రకరణము.



## అనుమానములు-నిదర్శనములు.

శ్యామలరావు వెడలిపోయినతరువాత కామేశ్వరరా వట్లనే యొక క్షణమూరకకూర్చుండి యేమియుదోపక లేచి యిటునటుబచారుసేయుచు- మధ్యమధ్య కిటికీనుండి వెలుపల కుఁజూచుచు- మఱలబచారుసేయుచు- మఱలజూచుచు-నిట్లే పదినిముషములు గాలక్షేప మొనర్చి- అచ్చటనేవిధముగను మనస్సునకు విశ్రాంతిగలుగమి వసారాలోనికిబోయి యట పచారుజేయుచు- నేమేమియో యాలోచించుచుండెను.

ఈవసారా యాయింటికి దక్షిణభాగమునందున్నది. అచ్చటనున్నవారికి వీథిగుమ్మములోనున్నవారు బాగుగా గా న్పింతురు. కామేశ్వరరావట్లు వీథివైపునకుఁ జూడగా గోవిం దుఁడా గుమ్మమునుండి బోవుచున్నట్లు చూచి చటాలున న చ్చటకు వెడలి వానిచేయిబట్టి—

దురాత్మా! నీవు లోని కెందులకు బోయితివి?"

"నేను దురాత్ముఁడనుగాను. నీక్షేమంకరుఁడను."

"నీవెంతటి విశ్వాసివో నాఁడేగ్రహించితిని."

"నిజము బయలుపడువఱకు నీవట్లనే యూహించు కొమ్ము. అందువలన నాకేమిప్రమాదము?"

"అగును. నాసర్వనాశన మాకాంక్షించువాని సేవ కుండవు. నీవు నావలన బ్రమాదము శంకింతువా? నాసెలవు లేకుండ నాయింటబ్రవేశించితివిగావున నీవు శిక్షార్హుండవు. రమ్ము. నిన్నుబోలీసున కొప్పగించెదను."

"నన్నుబోలీసున కొప్పగింతువా ? నీవెఱుంగవుగాని నేను పోలీసులోనే బనిచేయుచుంటిని. నాయిష్టమువచ్చిన చోటికి యిష్టమువచ్చినప్పుడు వెడలుట కధికారముగలదు."

"ఉండుగాక. నీకిక్కడేమిపనియుండి వచ్చితివి? ఏప నిముగించుకొని వెడలుచుంటివి ?"

"నేవచ్చినపని చూచుకొని వెడలుచుంటిని."

"నీవువచ్చినపని యేమనియే నిన్ను బ్రశ్నించుచుం

"నీవదియే బ్రశ్నించుచుంటివని నేనెఱుంగుదును. దానికి సమాధాన మీయవలసినపని లేదనియు నెఱుంగుదును. కాని నన్ను నీహితులలో నొక్కనిగ నెంచుకొనినచో నీకు జాలక్షేమము."

"నీతీపిమాటలకు నేను మోసపోను. నీచేతియందున్న కాగిత మిటుదెమ్ము."

ఇట్లనుచునే జటాలున గలియంబడి యాతనితో బెనగులాడి రొట్లో యాకాగితమును లాగుకొని లోనికి వెడలిపోయెను.

ఏమియు జేయఁజాలక పాపమా గోవిందు వెడలి పోయెను.

కామేశ్వరరావా కాగితము లోనికి బట్టుకొనిపోయి తనగదిలో గూర్చుండి యాకాగిత మేమైయుండునాయని విప్పి చూచెను. అందిట్లున్నది.

ప్రాణేశ్వరా !

నమస్కారములు. గోవిందుచే మీరుబంపించిన యుత్తరముజూచితిని. పరమేశ్వరానుగ్రహమున రెండుమూఁడు దినములలో మనవ్యవహారమంతయు దుదముట్టినచో జాలమంచిదే. మనమదృష్టవంతులమే. మనకంతకన్న గావలసిన దేము న్నది. హత్యాపరాధకులు మీరేయని మాఁయన్న మిమ్ము మానించి కడచినరేయి కాకినాడ వెడలి D. S. P గారితో మాటాడి క్రొత్తడిటెక్టివును రప్పించి రహస్యముగా బనిచేయించుచున్నాఁడు. ఆక్రొత్తడిటెక్టివుగారు మీరు నేరస్థులని- అనేకవిధముల సమర్థించి చూపి మిమ్ము గలిసి మాటాడి తరువాత నిర్బంధింప సంకల్పించుకొని యున్నాఁడు. కానిండు. ఎవ్వరెట్లనుమానించినను భయము లేదు. మీరుమాత్రము బట్టుదలవిడచి లోకాపవాదు గడింపకుఁడు. మీధైర్యమే మీకు సహాయంబగుగాక. మీచాకచక్యమే మీకు విజయముగూర్చుగాక. మీరు నాకిచ్చిన వాగ్దానమును బురస్కరిం

చుకొని- పెండ్లిగాకున్నను- ప్రాణేశ్వరాయని సంభోధించిన నాస్వాతంత్ర్యమునకు క్షమింపుడు. ఇట్లు,

మీహృదయేశ్వరి
పార్వతి.

ఇట్లున్న యుత్తరము జదువుటతోడనే గామేశ్వరరావుబుఱ్ఱ చితుకగొట్టుకొని యేడ్చెను. వేయితేళ్లుగుట్టినట్లు బాధపడుచుండెను. ఆతని విచారము బొంగిపొరలనారంభించెను. కట్టా! ఆతని విచారమున కంతును, దరియునున్నదా?

“అయ్యో! ఈదుర్మార్గురా లెంత ఘోరకృత్యమున కొడిగట్టినది. తానింకను సంసారసౌఖ్యము లేమియు నెరుంగని గోలయే. ఈమె కీదుర్మార్గునియం దిట్టి నిష్కల్మష ప్రేమ గుదురుట కేమికారణము? వయసువచ్చిన కన్యగాన నీగజదొంగయే యామెమెడలు విరచి దుర్బోధచేసి యుండును. ఆతం డాయభిప్రాయముతోడనే నేదియో పని గల్పించుకొని నెలదినముల నుండి యిక్కడ నివాస మేర్పరచుకొని యుండెను. ఆదురితాత్ముని దురుద్దేశ మెఱుంగక భావమరది గదా యని యింటం జేర్చినందులకు చల్లగా గొంప నట్టేట ముంచినాడు. ఇంటిగుట్టు లంకకు జేటనినటుల యీరాక్షసి వానికి గుట్టునిచ్చి వానికి చేలోపయి- తన్నుగన్నవారిని- తన యన్నదమ్ములను- తాతను- గూడ బలవంతముగా జంపించి యామాస్తితో- తన చిత్తమువచ్చిన పురుషునితో

గులుక దలంచిన నీదుర్మార్గురాలిని యుప్పుపాతర వేసినను బాపములేదు. మాసర్వనాశనమున కీమహాత్మురాలే- ఈకండ్లుదెఱవని కన్యయే- కారణమని యెన్నఁ డనుకొనలేదు. ఓరా ! ఈలేఖలోని విషయము లెంత గంభీరముగా నున్నవి ?

ఈదుర్మార్గురాలికి పరమేశ్వరానుగ్రహము గావలయునఁట. ఇట్టి సంసారఘాతుకులకు- ఇట్టి కుటుంబనాశన కారకులకు- భగవంతుఁడుగూడ చేదోడగుచున్నచో బ్రపంచము లాగునా ?

రెండుమూఁడు దినములలో నీవ్యవహార మంతయు ముదముట్టినచో జాల మంచిదేనఁట. ఈవ్యవహారమనఁగా నేవ్యవహారము ? సుభద్ర హంతకురాలని నిరూపించి యురి కంబ మెక్కించుట. ఆవెనుక నన్నును- నాభార్యను గూడ సంహరించుట- అనుమాట. దొరతనమువారంత కండ్లు మూసికొని యున్నారని యీమురితాత్ముల యభిమతము గాఁబోలు. శిరీషకుసుమ కోమలశరీరముగల యబల లిట్టి ఘోరకృత్యము లొనర్చుటకు దగుదురా ? సర్వమునకును దెగించినవారును- రాక్షసాంగనలును- చేసిన చేయఁగలరేమో గాని- సంసార స్త్రీలు- అందున సంతానవతి- ఇట్టి దురంతము లొనర్పగలదా ? పోసి చేసినదనుకొందము. భర్తనెందులకు జంపివైచును. సంసారులలో నిట్టి దుర్గుణవతియు

న్నను- భర్తను లోపుజేసుకొని- తన మనోరథములన్నియు దీర్చుకొని- యటుపిమ్మట- అవసరమైనచో- ఆతనిజీవిత మువలన దనసుఖజీవితమున కడ్డువచ్చుచున్నదని తోఁచి నచో- అప్పుడు జంపునుగాని యీలోపున జంపదు. రాజా రావు నిరూపించినంతమాత్రమున బైయధికారు లీవిషయ ములు జక్కింపకుండ సుభద్రను శిక్షింపఁగడగుదురా ?

ఈమె దుష్టాత్మురాలు గానిచో- మాయందభిమాన మున్నదైనచో- నిక్కమునకు రాజారావు హంతకుఁడు గానిచో- నేను కాకినాడవెడలినట్లు D. S. P. తో మాటా డి డిటెక్టివును నియమించినట్లు- ఈజెష్ఠ యాతనికేల నెఱుంగఁజేయును. ఆమె పొంచుండి- మావిస్రంభసంభావణ మాలించి- యాసంభాషణ మాతని కేల నెఱుంగఁజేయును?

ఎవ్వరెట్లనుమానించినను భయములేదఁట. అబ్బ ! ఎంతగుండెదిట్టతనము. పాపముబ్రద్దలవకమానదనుకొనలేదు గాఁబోలును ? అనఁగా నేనింకొక డిటెక్టివు నేర్పరచినను- ఒకటిరెండు దినములలో- మాచావు- సుభద్రయురి- ఆదురి తాత్మురాలి యభిమతానుసారముగా జరిగిపోయినచో- నూ తన డిటెక్టివు చేయునదేమున్నది. అంతటితో నావ్యవహార మంతమయిపోవలసినదే. వారి యడియాసలన్నియు దీరవల సినదే. మేమెల్లరమును నిర్ధూమధామ మయిపోవలసినదే. అబ్బ ! ముండా ! ఎంత దురూహతో నుంటివి ?

"మీరుమాత్రము పట్టుదలవిడచి లోకాపవాదుగడిం పకుఁడు." అనఁగా మాయాడావిడికి భయపడి తానొనరింప వలసిన పనులయందశ్రద్ధవహించినచో- మానూతనడిటెక్టి వు తనశక్తిసామర్థ్యములు జూపినచో- వారిగుట్టు వెల్లడియ గును. వారురికంబమెక్క వలసివచ్చును. అప్పుడు వారిశ్రమ కుదగిన ఫలము లోకాపవాదముకంటె వేరేమున్నది?

అబ్బ! ఇఁకభరింపజాలను......ఆదుష్టురాలిని చూడఁ జాలను......చెల్లియని బిలువఁజాలను......ఆమెదోష మిట్టి దని తెలిసినపిమ్మటగూడ నామెను క్షమింపఁజాలను....... ఘోరా! ఈవిశాలప్రపంచమున నెట్టివిచిత్రమానవి యుద్భవిం చినది. తన్నుగన్నవారి గొంతుక పరపరగోయించినదే. ఇట్టి దుష్కార్యమున కామెమనస్సెట్లొప్పినదో?... అన్నగారిని నమాంతముగా నరికించివైచినదే. ఇంతటిధాకిని- ఇంతటిఘో రపిశాచి- ఇంతటిఘోరభయంకరనారీపిశాచి- ఇంతటికూ్రర దానవి......నిజముగా రాక్షసిగణములోనైనను నుండదు. అట్టిది మాదురదృష్టవశమున మాకుటుంబమున నుద్భవించి నది. దీని విద్యావివేకములుగాంచి దీనివలన వంగడమున కెన లేని సద్యశఃప్రాప్తి యౌదవునని మురియుచుండ...

అయ్యయ్యో...మాసంతోషమంతయు సమసిపోయిన దే...మాయానంద మడుగంటిపోయినదే...మాప్రమోదము భస్మమైపోయినదే...

కానిమ్ము. ఇట్టిమిష్టులను గూర్చి విచారించుటకంటె శిక్షించుటవలన మనంబున కమితశాంతియొదవును.

ఇట్లనుకొని తడాలున లేచి యున్మత్తునివిధంబున బార్వతియున్నగదిలోనికి బోయెను. పార్వతియున్న గది తలుపులు జేరవైచియున్నవి గాని లోన గడియవేసి యుండలేదు.

తలుపులు దడాలున దోయుటచే గలిగిన ధ్వనికి బార్వతి యుట్టె వెనుదిరిగి చూచెను. ఎట్టయెదుట కామేశ్వరరావు. ఆతఁ డామెనుగాంచి క్రోధకంపితకంఠస్వరముతో:—

"ఈగదియందీవేమిచేయుచున్నావు?" అని ప్రశ్నించెను.

"జుమిాలియానవల జదువుచున్నాను. ఎందులకు?"

"ఆమెసాహసములు నీకలవడునా?

"ఆ సాహసములు నాకెందులకు? పరిశోధనావిధానము జూచుచుంటిని."

"దొంగముండలకు దొంగపుస్తకములే గావలయును. దానికేమి? నీకు రాజారావు వ్రాసినయుత్తరమేది?"

"రాజారావువ్రాసిన యుత్తరమా?"

"అగును. నీవలపుకాఁడువ్రాసిన యుత్తరము."

"దానితో నీకేమిపనియున్నది?"

"నీవు దానికి వ్రాసిన జవాబు నాకుదొరికినది. అందుచే నాయుత్తరముగూడ జూడవలయునని."

"నీకాయుత్తర మెట్లువచ్చినది."

"గోవిందునిచెంతనుండి దీసికొంటిని."

"బలాత్కారముగనా ?"

"అగును."

"అదిదౌర్జన్యము గాదా ?"

"నీకంటె దౌర్జన్యముజేయువారీ పృథ్విలో లేరు. కల్పితనవలలో గథానాయకురాలైన జులియెట్టాగూడ కొంతకాలము నీ శుశ్రూషజేయవలసినది. అట్లయైన నామెకాబలవన్మరణము తటస్థింపకుండ నుండును."

"నీయభిప్రాయము నేను జులియెట్టా వంటిదాననని యా ?"

"ఎంతమాట. ఈవిశాలప్రపంచమున నీకు నీవేసాటిగాని నీతో బోల్పంబడుట కొరులెవ్వరును లేరు. అట్టియెడ జులియెట్టాతో బోల్చి నిన్ను చిన్నబుత్తునా ?"

"నీయభిప్రాయమేమియో నాకవగతమగుటలేదు."

"నేను సంస్కృతమున మాటాడుటలేదే."

"నీవు మిగుల గృత్రిమముగా మాటాలాడుచున్నావు"

"ఇందు గృత్రిమమేమియులేదు. నీవువ్రాసినయుత్తరమువలన ద్రోహులెవ్వరో దెలిసినదని చెప్పుటకై నీదర్శనమపేక్షించి యిందువచ్చితిని."

"సోదరా! ఇదేమిపాపము. నీవు నన్ను మిగుల న న్యాయముగా మాటలనుచున్నావు. సోదరి నేడ్పించుట క్షే మంకరముగాదు."

"ఆసంగతి నాకుదెలియును. నిన్నును నీవలపుకానిని బట్టి బంధింపకున్న- అదియు ద్వరలోగాకున్న- మాకు నిజ ముగా క్షేమముగాదు. మీరుబంధింపఁబడినచో జావగామి గిలినవారైనను జీవించుట కవకాశములుండును. అట్లుగాదేని మాకేరికిని క్షేమముగాదను మాటవాస్తవము. అందుచే నిన్ని ప్పుడీ యుత్తరక్షణమున నీగదియందే ప్రస్తుతము బంధించు చున్నాను. తరువాత శ్యామలరావును బ్రేరేపించి రాజా రావును బంధింపఁజేసి తరువాత న్యాయస్థానమున మీరు గలుపాత్ములని- దుష్టులని- హంతకులని- ఋజువుజేసెదను. మిమ్మురికంబముపైనుండి వ్రేలాడజేయుదును. ఆనాఁడుగాని నాహృదయశాంతిగాదు. ఆనాఁడుగాని నేను మాతాపితృ ఋణమునుండి విముక్తుండనగుట కవకాశములేదు. అప్పుడు గాని మృతులైనవారి యాత్మకు శాంతిగలుగదు. అప్పుడు గాని నేను పురుషులలో- కాదు-కాదు- మానవులలో గణిం పఁబడుట కవకాశములేదు.

వజ్రమునుగోయుటకు వజ్రమేకావలయు ననునటుల యీాదీనదృష్టులడంచుటకు- ఉరికంబముపై వ్రేలాడునప్పటి మీాదీనదృష్టు లగత్యము. నాకన్నీటిపరివాహ మాపుటకు నడ్డకట్టిన మీానెత్తురగత్యము.

మీ హాహాకారములు, ప్రజల ఓహోహోరవము లు, దిక్కులు పిక్కటిల్లుచుండ- దుష్టులకుదగిన శాస్తియైనదని లోకులనుకొనుచుండ- పైకెంతపిచ్చివానివలెనున్నను- కార్యముపట్ల పట్టుదలవహించి- చెల్లెలనియైన సంశయింప కురికం బమెక్కించె బహద్దరుకామేశ్వరరావని దొరతనమువారు కీర్తించుచుండ- నాకెనలేని యశంబొదవును. అని దడాలున తలుపుబంధించి వెడలిపోయెను. పార్వతి కొరకువారిపోయెను.



# మూఁడవ ప్రకరణము.



## రాముఁడు, భీముఁడు.

నాఁటిమధ్యాహ్న మొంటిగంటయైనది. కామేశ్వర రావెచ్చటెచ్చటనో దిరిగితిరిగి గృహమునకువచ్చెను. సరిగా నాసమయమునకే యిరువురు పెద్దమనుజులు వచ్చి కామేశ్వ రరావును గాంచి:—

"అయ్యా! నమస్కారములు" అనిరి.

కామే—అయ్యా! తమరెవ్వరు?

"మావృత్తాంతము తరువాతజెప్పెదము. మీతోఁగొం చెము జరూరుగా మాటాడదలంచి వచ్చితిమి. కొంచెము రహస్యము. సమయమీఁగోరెదము."

కామే—సమయమిచ్చుటకు నాకేమియు నభ్యంతర ములేదుగాని నేనిప్పుడు శత్రుమధ్యమునందుంటినని మీరె ఱింగియేయుందురు. కడుపుజింపుకొనిన కాళ్ళపైబడునన్నట్లు నాబంధుమిత్రులే నాప్రాణాపహరణప్రయత్నము లొనర్చు చున్నారు. వారికి పెక్కుమందిసహాయముకలరు. అందుచే మిమ్మొర్రిఁగించినగాని మీతో రహస్యస్థలంబునకు రాజాల నందులకు క్షమింపుడు.

"మెట్టాంకాయలు, సీరొంకాయలు, బెండకాయలు, పచ్చిమిరపకాయలు" అని యీయెండవేళ నొకకూరగాయ లకావటివాఁ డరచుచుండెను.

"అయ్యా! మీరట్టి కట్టుదిట్టములో నుండవలసినదే. కాని మీరు ప్రతివారిననుమానించుట భావ్యముగాదు. మీ హితులమని మేము బొంకి మీరుసమయమిచ్చి చాటునకు వచ్చినపిమ్మట మిమ్ముబంధించిన నేమిచేయగలరు? ఏమైన నదృష్టమునకు విడచి కార్యసాధనకు గడంగు టుత్తమము.

"బాబూ! కొండారపొంకాయలు లేతదవ్వాలు. నిం డుకావిడి." అని యనుచు నాకావటివాఁడు లోనికివచ్చుచుం డ కామేశ్వరరావు గాంచి:—

"మాకిప్పు డేకూరయు వలదుపొమ్ము" అనెను.

"సీరువంకాయలు తొలికోతకాయలు. పువ్వైనను పీడలేను."

"నీకుగాదు చెప్పుచుంట ! నాల్గుదినములనుండి భోజనమైనను సరిగాలేని నాకు కూరలెందుకు పొమ్ము."

"పోనీ బాబూ ! పోనీ ! సరుకుమంచిదుంటే యమ్మకమేగాదా ?" అని యనుచు కావటివాఁడా యెదుటియింటికి మరలెను.

కామే—అందుకే నేనెవ్వరికిని సమయ మీయఁదలఁచుకొనలేదు.

"అట్లయినచో మీకు జాలకష్టమున్నది. అయిదునిమిషములు చాలును."

కామే—అట్లయిన రండు.

అని వారిరువుర లోనికి దోడ్కొనిపోయెను. ఎదుటియింటికి కావడిబట్టుకొని పోయినవాఁ డిదియంతయు జూచుచునేయుండెను. వారట్లు వెడలి లోనతలుపువేసికొనిన చప్పుడు విని కావడితోఁ జటాలున వెనుకకు దిరిగి లోనికి వెడలి వారు లోన గడియవేసుకొనిన తలుపులీవల బంధించి చటాలున రెండవగుమ్మముగూడ వెలుపలబంధించి చడిచప్పుడుగాకుండ నీవలకువచ్చి పార్వతినిబంధింపఁబడియున్న గదిచెంతకరిగి యామెనీవలకు దీసి:—

అమ్మా ! చాలవఱకు మనపనిముగిసినది. నిజముగా మనలో భగవంతుఁడున్నాఁడు. మనశాత్రవులలో ముఖ్యులగువారిని బంధించితిని. ఇచ్చట మనయునికి మిగులఁ బ్రి

మాదము. త్వరితగతి సుఖప్రదంబగు స్థలంబునకు బోదము రమ్ము.

పార్వ—గోవిందూ! నీహృదయనైర్మల్యమున కేనెంతేని సంతసించుచుంటిని. నీవింతటి విశ్వాసపాత్రుండవని యెఱుంగ కానాఁడెల్లు నిన్ను నిందించితిని. నీసత్ప్రవర్తన గని నిన్ను నిందించినందులకు నాలోనేనే విచారించుచున్నాను. నీతో మాటాడుటకు సిగ్గుబడుచున్నాను.

గోవిం—అమ్మాయీ! సిగ్గుబడుటకును- విచారించుటకును- ఇది సమయముగాదు. నీపెద్దవదినె మీాయమ్మవోలె హాంతకుల చేతులలో బడిపోయినది. ఇప్పుడాదురాత్ముల యునికి యించుమించుగా దెలిసినది. వారినాయకుల నిర్వ్వర నిప్పుడె చటనే బంధించితిని.

పార్వ—ఆదురాత్ములే నీవు బంధించినవారని యెట్లెఱింగితివి?

గోవిం—లాలా వారిని మాకుజూపించెను. వారు మిగుల గౌరవనీయులట్లు శృంగారించుకొని యెచ్చటికో బయలుదేరిరి. లాలావలన వారినిగసిపెట్టి- నేను కూరగాయలవాఁడనై- బాబుగారు పెట్టెలకు తాళాలు, బందులుగట్టువారై- బయలుదేరి వారిని వెంటాడితిమి. ఈయింటియందు దవ్వాలగదిలో వారిని బంధించితిమి. బాబుగారు పోలీసునకీవార్త నెఱింగించి వారిని దీసికొనివచ్చుటకై వెడలిరి. వారును వచ్చుచుం

చురు. పోలీసువా రరుదెంచునప్పటికి మనమిక్కడనుండరాదు. పోదమురమ్ము.

పార్వ—మాయన్నగా రెచ్చట?

గోవిం—మీయన్నగారును—ఆదురాత్ములును మంతనములాడుచుండిరి. అందుచే ముప్పురను బంధించితిని.

పార్వ—మాయన్నగారు దస్యులతో మంతనములాడుచుండిరా? ఎంతదురదృష్టము.

గోవిం—మీదురదృష్టదేవత మిమ్మింతతో విడచిపెట్టునట్లులేదు. ఇంకను మిమ్ము గష్టములు జుట్టుముట్టు సూచనలు గాన్పించుచున్నవి. వాటినన్నిటినిగూడ బాబుగా రెదుర్కొనుటకై బూనుకొనియున్నారు. ఇఁక మనమిందాలసించుటవలన నెంతేని ప్రమాదముగలదు రమ్ము.

పార్వ—నేనిట్లు యథారూపమున వచ్చినచో నను మానాస్పదము గాదా?

గోవిం—నేనాసంగతి నెఱుంగనా? ఇదిగో! ఈగుడ్డలును- మీఁసములును- నీరూపు క్షణములో మార్పు జేయును. వెంటనే రమ్ము.

పార్వతి యాబట్టలతో లోనికిబోయి మిక్కిలి చుఱుకుగా నలంకరించుకొని చిటికలో నీవలకు వచ్చినూచెను. ఎదుట బిళ్ళబంట్రోతుండెను. ఆమె యిటునటుజూచి యా బిళ్ళబంట్రోతునుగాంచి:—

"నీవెవ్వఁడవు ? ఇచ్చటి గోవిందుఁడేడి" అని ప్రశ్నించెను.

"చిత్తము నేనే యేలినవారిడలాయతును. మీరు జమాబందీకి బయలుదేరవచ్చును"

అని చిఱునగవుతో వాఁడనియెను.

పార్వ—గోవిందూ! నీవేనా! ఎంతచాతుర్యముగా వేషమును మార్చుకొంటివి ? చాల సంతోషమైనది. ఇంక పోవుదమా ?

గోవిం—రండు.

అని యీమెను దీసికొనివెడలి యొకబండిపై నెక్కించి యాబండికి వెనుక దానునడచుచుండెను.

బండి పదిగజముల దూరమగునప్పటికి పోలీసువారెదురైరి. వారి కేడెనిమిది గజములదూరములో—

"పెట్టెలకు తాళాలు బందులుకడతాము" అని కేకవేయుచు నొకఁడు వచ్చుచుండెను. బండి వెనుకనడచుచున్న డలాయ తిరిగాంచి:—

తే. గీ. బోనులోఁబడ్డ నిర్దోషి । మూషికమును
వేగ దిననెంచి బావురు । పిల్లిబోయి
బోనులోఁబడె మూషికం । బు చెఱవీడె
కలదె యిటువంటి చిత్రమె । క్కడనునైన.

"అయ్యా! మీపెట్టె కిందాక తాళమొకటియే యిచ్చితిని. ఇదిగో రెండోతాళము" అని తాళమిచ్చి తాళములుకట్టువాఁడు వెడలిపోయెను.

డలాయతా తాళమందుకొని దానిలో జొప్పింపఁబడియున్న కాగిత మీవలకుదీసిచూచెను. అందిట్లున్నది.

"సుభద్రితో నీమెను జేర్పుము. వీలైన నేఁడు, లేకున్న రేపు నే నటకువచ్చెదను. శ్యామల విలాసోద్యానవనములో బంధింపబడినదఁట. ఆమెను విడిపించుప్రియత్నములో నుండెద. వీరిరువురను బురుషవేషములలో నుండుట కేర్పాటు చేయుము.

అనియుండెను. చాలాసంతోషించి యాచీటి పార్వతికి జూపించి యామెకుగూడ నానందముగూర్చి బండిత్రోలించుకొని వెడలిపోయెను.

తరువాత పోలీసువారి కందిన చీటిప్రికార మాయింటికి వెడలి కామేశ్వరరావు బంధింపఁబడియున్న గదిచెంతకు జేరిరి. అప్పుడు వారి కాగదిలోనుండి యీక్రింది సంభాషణ వినిపించినది.

"మామాట వింటివేని బాగుపడెదవు?"

"మాయమ్మను విడిచివత్తురు సరియేగాని రాజారావు సంగతి దేల్చుడు"

"అది మాకగత్యము లేదు."

"అదేమిమాట. ఆతఁడు దొరుకకున్న మాకు క్షేమ మేది?"

"అతనిని జంపినచో బదివేలిత్తునని మాయజమాని యే జెప్పెను.

"మఱెందులకు జంపితిరిగారు"

"ఆతఁడు సామాన్యముగా లొంగునేమోయని చూచితిమి. లొంగలేదు. ఒకటిరెండుదినములలో జంపెదము. లేదా మీకొఱ్ఱ్తడిపెట్టి వుగారతని నురికంబ మెక్కించున ట్లేర్పాటులొనరింతుము."

"ఆతనిని మీరు జంపినవెనుకగాని- మీయేర్పాటుల వలన నాతఁ డురికంబమెక్కినపిమ్మట గాని మీషరతు లంగీకరింతును. నాభార్యనుగూడ విడిపింతురా?

"అది మాయజమానిచిత్తము. మీయమ్మను విడిపించుటకు మాత్రమే మైనువేలు గావలయును.

నాభార్యనుగూడ విడిపించుఁడు. మొత్తము బదివేలిచ్చెదను."

"ఆమాట తరువాతజూచుకొందము. మేమువచ్చి తడవైనది. ముందు మూఁడువేలిమ్ము. రేపురాత్రి నీతల్లిని దోడ్కొనివచ్చినపిమ్మట మిగిలినరెండువేలిత్తువుగాని"

"మీరననట్లు దీసికొనిరాకున్న రెంటికిఁజెడవలయునా?

"నీయనుమానములే నీకొంపగూల్చుచున్నవి. రాము

భీములమగు మేమిరువురమును దొంగలమే గాని యసత్య వర్తనులముగాము. తప్పక దోడ్పాటొనర్తుము."

"ఏమి మీరేనా రాముడును, భీముడును నని ప్రఖ్యాతిగనిన దొంగలు.

"అగును"

"అట్లయిన మీయజమాని రాజారా వనుమాటయే."

"మాయజమాని యెవ్వరైనను నీకు నష్టము లేదు."

"మాతమ్ముని శిరస్సు లాలాయింట బడవైచినవారు మీరేనా?"

"అగును."

"అట్లయిన చంపినవారును మీరేనా?"

"నిస్సందేహముగా"

"మీరీ పాపకార్యములన్నియు జేయుటలో మీయభిప్రాయమేమి?"

"మాయజమానిక్షేమమునకై"

"మిమ్మిప్పుడు పోలీసువారి కప్పగించిన నేమిచేయుదురు?"

"నీవాప్రయత్న మొనరింపదలచినచో ముందు నిన్ను జంపివైతుము."

"ఛీ! తులువలారా! నన్ను చంపుట మీతరముగాదు. ఇందేయుండుడు. మీపొగరడగించెద.

ఇట్లనియాతఁడు ద్వారమును సమీపింపఁబోయెను.

ముందున కడుగిడినచో ముప్పుదప్పదు. ఇదిగో! దీనిని జూచి కదలుము నీచుఁడా! నీవాండ్రను జంపినటుల- నిన్ను జంపుట కొకనిముసముజాలదు. నిష్కారణముగా జెడకుము. నీయునికివలన మాకేమియు బ్రమాదములేదని యింతవఱకు నిన్ను మన్నింపలేదుగాని లేకున్న నీవుగూడ మీతమ్మునితోబాటు గావలసినదే. నిన్నుగూడ జంపి- నీద్రవ్యమును మేము నిరాఘాటముగా ననుభవింపగలము. సుమారిరువది వత్సరములనుండి యీ పీఠికాపురమునను-దీనికిచుట్టుప్రక్కల గూడ నిరాఘాటముగా నజమాయిషీచేయుచున్నాము. పోలీసువారు మాచుట్టు ప్రదక్షిణమొనరించిరే గాని పట్టగలిగిరా? అప్పటిపోలీసువారుగారా యిప్పటివారు. కాళిదాసు బంధింపబడినను మాకు భయములేదు. ఇంకొకనివశపఱచుకొనుచుంటిమి. పోలీసువారిరహస్యములు మాకుదెలియును. వారక్కడ బయలుదేరినచో- మేమది కర్ణపిశాచమువలన గ్రహించి తూనీగలట్లెగిరిపోదుము. గోచిపాతరాయఁడవు నీవు మమ్ము బట్టింపఁగలవా? నీవు మాషరతుల కంగీకరింపలేదు గాన- నీక్షణమే చచ్చుటకు సిద్ధముగమ్ము. నీద్రవ్యమును- నీపార్వతియును మాకు లభించినచో మాకుఁజాలును. ఇఁక వటవటవాగక నోరుమూసికొమ్ము.

"లోపలమాటాడువారెవ్వరు తలుపుదీయుఁడు." అని వెలుపలనున్న పోలీసువారనిరి.

"అయ్యా! ఎవరో ధర్మాత్ములు. సమయమునకువచ్చితిరి. ఈదురితాత్ములు దురుద్దేశముతో వచ్చి నాకు మిత్రులట్లనటించి యిప్పుడు నన్ను మర్దింపదలచుకొని మీఁదబడుచున్నారు. రక్షింపుఁడు. రక్షింపుడు."

"లోన తలుపుబిగింపబడియున్నది తీయుఁడు." అని పోలీసువారనిరి.

లోపలనుండి యేవిధమగు జవాబునులేదుగాని పెనుగులాడుచున్నట్లుమాత్రము గడబిడలు వినంబడుచుండెను. తలుపు లెంతగుంజినను విడునట్లు గనంబడుటలేదు.

"మర్యాదగా దలుపులుతీయుదురా? బలవంతముగా దలుపులుతీయించి లోనికి చొరఁబడుమందురా?"

"మీకుఁ బ్రాణములపై నాశకలదేని గృహంబులకుబొండు. లేదేని తలుపు వుతక లెత్తించుఁడు. ఎట్లైనను మాకు సమ్మతమే.

ఇంతలో నిరువురుభటులు గునుపముల సహాయమున తలుపులువిడదీసి బిలబిలలాడుచు లోపలబ్రవేశించిరి.

"ఢాం" మని పిస్తోలుధ్వనియయ్యెను. ఆగదియంతయు బొగతోనిండిపోయెను. పట్టపగలింట బిస్తోలు ప్రేలినదేమా

యని ప్రజలెల్లరును బిలబిలలాడుచు లోనికివచ్చిరి. ఇంతలో పొగయుబోయినది.

అప్పుడాగదియందొక పోలీసుభటుఁడు చచ్చిపడియుండెను. కామేశ్వరరావు బంధింపబడియుండెను. రాముఁడును భీముఁడును నెచ్చటను గానరారు. వారేమైపోయిరో యెవరికిని దెలియదు.

# నాలుగవ ప్రకరణము.

## ఇం దేదిసత్యము ?

సాయంకాలము నాల్గుగంటలు కావచ్చినది. ఇంతవఱకా దస్యుదళనాయకులగు రామునికొఱకును, భీమునికొఱకును బోలీసువారు చాలవఱకు వెదకిరి గాని వారిజాడమాత్రమావంతయు గాన్పింపలేదు. అందుచే బోలీసుభటులు నెత్తినిచెంగువైచుకొని స్టేషనును వెడలిపోయిరి. లక్ష్మణసింగుగారుమాత్రము కారాకిళ్ళీ నములుచు గూర్చుండి వచ్చిన భటులను జూచి వికటహాసమొనర్చుచు—

" నేను జెప్పినట్లైనదా ? అదియొక దొంగయుత్తరము. దానిని నిజమని నమ్మి కామేశ్వరరావు గృహమున కరిగిరి. అచ్చట జరిగిన సమాచారమేమి ?" అనిరి.

మీయట్టివా రధికారులయినపిమ్మ టపజయముకంటె వేరెద్ది లభించును? కూశా రావయ్యాబాబూ! అని పిలచి నప్పుడు వచ్చిన నెంత ముద్దుగానుండును? ఎటువంటిజయము లభించును? మీకు పనిపట్ల బద్ధకము- చెడినతరువాత ము కోపము. అందున మీరిప్పుడు కేజనుకు స్థాండుగాని కోప మును దెచ్చుకొందురు. మీకీ సర్కిలుకు వచ్చినతరువాత చేతికి దొరకిన నేరములుగూడ- చిటికలో దప్పిపోవుచున్నవి? మిమ్మనిన నేమిలాభము?" అని నారాయణస్వామి యనెను.

ఎందుకోయి! ఇప్పుడీ లెక్చరు? మనకు పదిడబ్బులు కిట్టని వ్యాపారములో కష్టపడుటయనిన నాకు తలనొప్పి. ఆ వెధవ లుపనాయకులని వాఁడెవఁడో వుత్తరములో వ్రాయ నేవ్రాసినాఁడు. వాళ్ళని పట్టుటవలన లాభములేదని చూశా ను. డబ్బువచ్చేపని చూపించు- కారాకిళ్ళీ దగిలించి- పింహా వుబిల్లవోలె చురుకుగాఁ బనిచేయుదును.

సరే. అయితే వినండి. దొంగలు చాల తెలివితేటల యినవారు. పిస్తోలు బేల్చిరి. నెం 636 రు కా దెబ్బతగిలి వెంటనే మరణించెను. ఎట్లో చిటికలో వారు దప్పించుకొని పోయిరి. తరువాత నాయూప్రాంతములన్నియు వెదకి "వీరె టుబోయియుందురా యని యాలోచించుచు గోటుజేబులో జేతులుంచుకొంటిని. నాచేతి కీయుత్తరము దొరకినది. ఇది చూడుడు. మీ కారాకిళ్ళీకి పనిదగులు నేమో? అనియిచ్చెను.

లక్ష్మణసింగు దానినందుకొని యిట్లు చదివెను.

మీ రెంతకష్టపడినను యీవ్యవహారమున రెండుమూఁడువేలకంటె యెక్కువ బహుమానము దొరతనమువారివలనను బడయఁజాలరు. అముష్టిద్రవ్యములో మూఁడువందలవాటాలు. అది మీకేమిలాభము? సరిగా బదునైదువేల రూప్యముల బహుమానము మీకుగావలసియున్నచో- కామేశ్వరరావును మాస్వాధీనమొనర్పుఁడు. సుభద్ర దోషియని యేవో నిదర్శనములు జూపి యురిదీయింపుఁడు. మీకిష్టమైనచోఁ గుక్కుటేశ్వరాలయముచెంతనున్న బైరాగితో గలిసి "విలాసోద్యానవనము"నకు రండు. ఆపేరు చెప్పినచో మిమ్మాతఁడు గుర్తించును. మీరాతనిని బట్టబ్రయత్నించినచో బిస్తోలు మీబుర్రపై బేలును. ఆపైన మీయిష్టము. "రా"

"మంచి "జాబ్బేయి." [Job.] మెల్లిగా యీబహుమానంకొడితిమా వుద్యోగా లూడిపోయినా స్వేచ్ఛగా బ్రదుకవచ్చును. ఏమంటావుస్వామీ!" అని సింగుగా రనియెను.

ఈయుత్తరమువలన సుభద్ర నిర్దోషురాలని యెట్టిమూఢాత్మునకైనను గన్పట్టుచున్నది. ఆమె నిర్దోషురాలుగావుననే యురిదీయుఁపుమని మనలఁగోరినాఁడు. ఏవో కల్లబొల్లిదృష్టాంతములు రెండుజూపి పైయధికారులు గిక్కురుమనకుండఁ జేయవచ్చును. అంతకును గాకున్నచో దెల్లదేవతను పూనింప

జేయవచ్చునని కొందు. కాని యది మిగుల దార్జన్యము. పిల్ల లున్నవా రిటువంటి దార్జన్యమున కొడిగట్టినచో స్వరూప నాశనమై పోదురు. అట్టివారి వంగడము నిర్వంశమైపోవును. హిందువులమై బుట్టినందుల కామాతృపు పాపభీతికి లొంగకు న్న పుట్టగతులుండవు. అయ్యయ్యో! మాతృస్థన్యమైనను విడని కుమారమాధవరావు మాతృదేవత నన్యాయముగా నేను మ్రింగజాలను. ఆపని నావల్లగాదు.

సింగు — నీకు మంచీచెడ్డా తెలియదు. ఈహంతకులకు వ్యతిరిక్తముగా నీవు బనిచేయదలచినచో బిస్తోలు శిరస్సుపై బేలునేమోయను భయమైనను నీకు గలుగుటలేదా? అం తపని జరిగినచో నీపిల్లలకింక దిక్కెవ్వరు? ఈదిక్కుమాలిన దినములలో సంపన్నగృహస్థులుగూడ బిక్షవేయుట మాను కొనిరి. అనాథశరణాలయములో బిల్లలుజేరినను - నీభార్యకు ముష్టితప్పదు. మనము జేయుపనులన్నియు న్యాయబద్ధములై యున్నవనుకొంటివా? నిజము జెప్పవలసివచ్చినచో నౌకరీ చేయుట - అందునను బోలీసుశాఖలో బనిచేయుట మిగుల పాపము.

నారా — ఏమైననుసరే. పరమేశ్వరునిపై భారము వైచి న్యాయమార్గముననే బోదునుగాని దుష్పథంబున కే ననుమతింపను. మీరన్యాయమున కొడిగట్టినచో మీసంగతి దొరతనమువారికి రిపోర్టిచ్చెదను. ఒడలమ్ముకొనినందులకే

విచారించుచుండ ధర్మముగూడ విక్రయించుకొనుటను నేను సమ్మతింపను.

సింగు—ఈవ్యవహారమ మడ్డదిడ్డముగానున్నది గాని సాక్షీగాలేదు. ఇందు నేరస్థుడు దొరుకుట దుర్లభము. ఈయుత్తరము వ్రాసినవాఁడు "రా" యని పొడియక్షరమే సంతకముగానుంచినాఁడు. దొంగల కుపనాయకుండగు రాముఁడో- కాక కామేశ్వరరావు మొదలయిన వారను సూచించుచున్నట్లు రాజారావో- అయియుండవలయును. రాముఁడైనచో సుభద్ర నుద్దీయించుట- కామేశ్వరరావును వప్పగించుట గోరియూరకొనఁడు. శ్యామలమాట మరువఁడు. ఆమె జీవించియున్నను ఆస్థి వారికిదక్కుట కవకాశము లేదు. పార్వతిని గూడ వారపహరింపదలచుకొనిరి గాన శ్యామలనుగూడ నపహరించుటకో- జంపుటకో వారు నిశ్చయించుకొనవలయును. రాజారావే ద్రోహియైనచో శ్యామలకు భయపడవలసిన పనిలేదు. చచ్చినవారికొఱ కిదివఱకే యేడ్చుచున్న శ్యామల- కడకు మిగిలినయన్నగారినిగూడ జంపుకొనుట కనుమతింపదు. అందుచే యీ "రా" రాజారావనియే నానమ్మకము.

నారా—బాబూ! మీకారాకిళ్ళీలఖర్చు నేనిచ్చుకొందును. మీబుద్ధితోఁబాటు మాబుద్ధిగూడ పాడుచేయకుఁడు. శ్యామల యిదివఱకే అత్తగారగుకాంతమ్మవోలె హంతకుల హస్తములలోబడియున్నది. శ్యామలను వారిష్టమువచ్చినట్లు

వారుచేసుకొనఁగలరు. చంపిన చంపగలరు. పెంచినపెంప గలరు? అట్టివారామె నేలగోరుదురు? రాజారావు హంతకుఁడు గాఁడనుట కొక నిదర్శనము దొరకినది. అదియేమందువా కామేశ్వరరావా దుష్టులతో రహస్యముగా మాటాడునప్పుడు రాజారావును జంపుఁడనిగోర "ఆతనిని జంపినచోఁ బదివేలిత్తునని మాయజమానియేజెప్పెను" అని వారనిరి. ఆవాక్యమునకర్థమేమో యూహింపుము. రాజారావు వారికి విరోధియైయుంటచేత నేగదా యాతని మరణము వారాకాంక్షించియుండిరి. వారికొకయజమాని యున్నటుల వారిమాటలవలనదేలుచున్నది. ఆయజమాని యెవ్వరో గనిపెట్టవలయును. మనచేతులలోఁబడ్డ సుభద్రి కాశీవాసుకుటుంబముల ఁశాత్రవుల కు జిక్కిపోయినది. అందుచే బోలీసువారి నాతఁడు నమ్మక మారురూపులు ధరించి పనిచేయుచున్నాఁడు. వీరు లంచమునకాసించి వ్యవహారము పాడుచేయఁ దలఁచుకొన్నారు. ఇంతకును- అందఱును శ్రీవైష్ణవులేయైన యోగినిగారి వేవిళ్ళ కేమికారణ మనినటుల- ఎవరికివారే హంతకులుగారని నిరూపించుకొనుచున్నచో- నీయనర్థములకన్నిటికిని నాయకులెవ్వరు? ఈసమస్యయే తేలదయ్యె. చచ్చినవారు దోషులు గాదుగదా? రాజారావు, సుభద్రి, పార్వతి, కామేశ్వరరావులు హంతకులుగారని చెప్పుచుకొంటిమిగదా? మన దృష్టిలోబడనివారును- ఆయింటికి సంబంధ మున్నవారును

యిరువురుమాత్రమే యుండిరి. ఒకఁడు వారినౌకరగు గోవిం దుఁడు- రెండు కామేశ్వరరావు భార్యయగు శ్యామల. వీరిని గూడ మనము సంశయింపవలసినదే- నేరస్థులైనను గాకున్న ను సంశయించుట కభ్యంతరము లేదుగదా?

సింగు—ఏమయ్యా! నీ తెలివితేట లింతవిస్తీర్ణమైనవని నేనెఱుంగను. దుష్టాత్ముల చేతులలోఁబడి ప్రాణములుగోల్పో వుటకో ఆజన్మకాలమును వారి చెఱసాలలో బాధింపఁబడుటకో సిద్ధముగానున్న శ్యామల హంతకురాలని సంశయింతువా? ఎట్టియాధారమును లేని గోవిందుని సంశయింతువా? అట్లు యిన కుమారమాధవుఁడు గూడ హంతకుఁడేమో యాలో చింపుము.

నార—వెక్కిరింపులేటికి? మీ యభిప్రాయమేమి? ఆబైరాగిని ప్రాణములకు దెగించి బట్టుకొందమా?

సింగు—పట్టుకొమ్ము" అని మాట చెప్పవచ్చును గాని- పట్టుకొనుట మిగులదుస్సాధ్యము.

నార—ఎంతదుస్సాధ్యమైనను నాతనిని బట్టితీరవల యును. ఆతఁడు విలాసోద్యానవనవాసియనియు, హంతకుఁడో, హంతకానుచరుఁడో యనియు దేలినదిగదా? వారిలో నెవ్వరు పట్టుబడినను "గోటలోపాగా" వేసితిమనుమాటయే.

సింగు—ఆఁ. మీదయవలన నిప్పటికి నెం 636 రు కోటలోపాగా వేసినాఁడు. ఇంకమనము తరువాయి.

నార — మీకంతభయముకూడదండి- పోలీసు వారికిని వైద్యులకును పిఱికితనముగాని- భయముగాని పనికిరావండి- అట్టివక్కఱకు రావు. ధైర్యసాహసేంలక్ష్మి యని కార్యసాధనకు గడంగవలయు.

సింగు — "బ్రిదికియుండిన సుఖములు బడయవచ్చు." అన్నట్లుగా బ్రదికియుంటే యేసుఖమైనా యున్నది. ఈదిక్కుమాలినవ్యవహారమింతటంతట తేలదు. ఓ నెల్లాళ్ళులీవుతీసేస్తా.

నారా — మీదృష్టియుంతా వేరుగావుంది. మీయిష్టమువచ్చినట్లు చేసుకోండి. మిమ్ములను సవరించుటకు నాకు తీరికలేదు. నేనుబోయి యీబైరాగిసంగతి గనుగొనివచ్చెదను.

అని నారాయణస్వామి నలుపురుభటులను వెంటబెట్టుకొనిపోయెను.

పాఠకమహాశయులారా! మనమాబైరాగిని జూడబోవుదమా? సింగుగారి సంగతియింకను జూతమా? ఆఁ ఏమంటిరి ? బైరాగినే చూతమనుచున్నారా ? సరే. అట్లయిన నడువుడు.

కుక్కుటేశ్వరాలయములో నొకవైపున నొకబైరాగి క్రొత్తగావచ్చి ప్రవేశించెను. అతనిసంగతి యింకను బాగుగా గ్రామస్థులకు దెలియదు. ఆతఁడు జ్ఞానియో, యజ్ఞానియో మనము జెప్పజాలము. ఒడలినున్న విభూతియు, జడల

పోంకమును జూడ నిజమగు బైరాగియాయని కొందఱు కొంద ఱనుమానించుచుండిరి.

ఇంతలో నారాయణస్వామి తనశిష్యులతో నటకువ చ్చి యాబైరాగికి నమస్కరించి సమీపమున నిలువంబడి యుండెను.

ఆయతికది జపసమయము కాకుంటచే వెంటనే యా తని నాశీర్వదించి కూర్చుండుమని స్థలముజూపి వచ్చినపని యేమనియడిగెను.

"నేనిక్కడ పోలీసుశాఖలో బనిచేయుచుంటిని. ఒక విషమవ్యవహారములోఁ జిక్కుకొని దారితెన్నులు తెలియక కొట్టుకొనుచున్నాను. మీరు బ్రహ్మస్వరూపులు. ఆగతానా గతవిజ్ఞానమయులు. ఆవిషయమై మిమ్ము బ్రశ్నించి త్రోవదె లిసికొందమని వచ్చితిని. క్షమించి ప్రశ్నించుటకు సెలవా?" అని యడిగెను.

యతి— మీకు నావలన సమాధానము గావలసిన ప్రశ్న నొకకాగితముపై వ్రాసియిుండు. దానితో నొకతెల్లకా గితముగూడ నిండు. ఒకగంటపోయినతరువాత గాన్పించుదు. మీకు సమధానము వచ్చును.

నార— చిత్తము.

అని యట్లు వ్రాసి యొకతెల్లకాగితముగూడ నిచ్చి- నేనిప్పు డటకును వెడలవలసిన పనిలేదు. ఇచ్చటనే

యుందును. సాధ్యమైనంత త్వరలో నా ప్రశ్నకు సమాధాన మిచ్చిన సంతోషించెదను. అనెను.

యతి—మీరెన్ని ప్రశ్నలు వ్రాసిరి ?

నారా—ఒకటే.

యతి—ఆ ప్రశ్నలో భాగములున్నవా ?

నారా—అనఁగా ?

యతి—“ఇచ్చటికి కొంక యూరెంతదూరముండును ? అచ్చటకు నేవెడలినచో జయముగలుగునా ?” అనునది నీ వొకప్రశ్న క్రింద నిత్తువు. అట్లుండరాదు ? అవియే భాగములు ఇట్టివేమైన నున్నవా ?

నారా—వున్నవి.

యతి—ఎన్ని ?

నారా—మూఁడు.

యతి—మూఁడైదులు పదునైదు రూపాయలిమ్ము. ఈచీటి పీఠముమీఁద బెట్టి సమాధానము దేవి నడుగుదును. ఒకగంటలో నీసమాధానములు రావచ్చును.

నారా—అంతద్రివ్యము మేమిచ్చుకొనఁగలమా ?

యతి—ఇచ్చుకొనక తప్పదు.

నారా—విలాసోద్యానవనవాసిని మీరెఱుంగుదురా ?

యతి—సరె. అర్థమైనది. మీరటకు వెడలుదురా ? మీప్రశ్నలకు సమాధానములు గావలయునా ?

నారా—రెండును గావలయును.

యతి—ఆరెంటికిని సమాధానము మీరేయెఱుంగుదురు. వేరె నన్నడుగు టెందులకు ?

నారా—నే నేమెఱుంగుదును.

యతి—మీరేమెఱుంగుదురో తెల్పెదను దేవళము లోనికి రండు.

అని యాతనిని లోనికి దోడ్కొనిపోయి యొకచో గూర్చుండఁబెట్టి తానును చెంతఁగూర్చుండి—

అయ్యా ! తమరు నన్నెఱుంగరు. మీయనుచరు లెట్లో నన్నుగుర్తించి— అర్ధోక్తిలో— "నాయనుచరులా ? నాకనుచరులెవ్వరు? ఇదేమివిరుద్ధమగుసంగతి" అని నారాయణస్వామి భయపరికంపితచిత్తంబుతో ననియెను.

అయ్యా ! త్వరపడకుఁడు, నావాక్యంబులన్నియు బూర్ణముగానాలించుఁడు. వారట్లు నన్నుగుర్తించి నీకెఱిఁగించిరి. నీగుట్టు వెల్లడికాకుండ నుండుటకై నన్ను బంధింప నిటువిచ్చేసితివి. అంతమాత్రమున నీనిర్దోషిత్వము స్థిరపడునను కొనకుము. అప్రస్తుతవిషయంబులఁ బట్టుకొని బుర్రచితుకగొట్టుకొనుటకు నేను రాజారావును గానని యెఱుంగుము. విలాసోద్యానవనమున కధికారివని నేనెఱింగితిని. నీవే హంతకుఁడవని రాజారావనుమానించియు బుద్ధిలేమి మఱల నపమార్గమునఁ బడిపోయినాఁడు. నీవింక నాచేతులనుండి తప్పించుకొని పోవజాలవు.

నీవు హంతకుఁడవనుటకు ప్రబలనిదర్శనము లున్నవి. కావున నిన్ను దొరతనమువారి పేరిట నిర్బంధించుచున్నాను.

ఇట్లనుచు నాబైరాగి హఠంబుగా వానిపైఁబడి మృగరాజు మృగమునోడిసిబట్టినట్లు బట్టి వెంటనే నిగళబద్ధుంగా వించివైచెను.

అయ్యా! మీరుమిగుల ఘోరన్యాయముగా నన్ను బంధించివైచినారు. ఈవిషయమున నేను నిర్దోషినని మనవిమొనర్చుకొనుచున్నాను. నాసమాధానములు గూడ మీరువిని నాసమాధానములు మీకు తృప్తికొసంగనిచో నప్పుడు బంధించుటుత్తమము. అంతేగాని యుద్యోగములోనుండి- అంతో- ఇంతో- గౌరవముగా కాలక్షేపమొనర్చుచున్న నన్న న్యాయముగా బంధించుట మీకు బాడిగాదు. అదిగాక నన్ను బంధించుటకు మీకధికారము గూడలేదు. అని నారాయణ స్వామి యనెను.

ఓరీ! నీచహృదయూ! నేను డిటెక్టువును. నాయధికారపత్రమును నీకు తరువాతజూపెదను. రాజారా వీవిషయమున సరిగా బరిచేయఁడనియు- ఆతని బాంధవులలో నెవఁడైన హంతకుఁడైనచో దప్పించు నిర్దోషి నురికంబమెక్కించునేమో యని D. S P. గారు పరిశోధకునిమీఁద బరిశోధకునిగా నన్ను నియమించిరి. నేనిట కీవేషమునవచ్చి యారహస్యము గనుపెట్టితిని. రాజారావు బుద్ధిలేమి నీవుగ్రహించి యీవిషయమున నెంతమందినైన ననుమానించుట కనువగున ట్లొన

రించితివి. అతఁడుగూడ నెటుగాలిపించిన నటు దిరుగుచు చెక్రి
ముపోలె దిరిగినాఁడు. కాని యింటిదొంగ నీశ్వరుఁడైనను బట్ట
లేడనినటుల నిన్ను వారుగనిపెట్టలేకపోయిరి. రఘునాథరావు
గారు గతించిననాఁడు- వారికి విషప్రియోగము చేయబడిన
దని గృహములోని వారికంటె ముందు నీకుదెలిసినది. అది నీ
కాకలేఖవలన దెలిసినదని వారికిచెప్పి నమ్మించితివి. రాజా
రావి విషయమున సందేహించెనుగాని- నీకృత్రిమలేఖ గాం
చి యాతఁడు పప్పులోనడుగువైచినాఁడు. అప్పుడా కాలుగా
లుటచే గుప్పిగంతులు లంకించుకొనెనేగాని- సరిగా నిలువ
జాలక పోయినాఁడు. విషమాతనికి 9 గంటల కీయఁబడినది.
నీకుత్తరము 9-10 నిమిషములకందినది. ఎవరో విషమిచ్చిర
నుకొమ్ము. ఇచ్చినతరువాత నీయుత్తరము వ్రాయవలయును.
అనుచరులచే నీకిది యందజేయవలయును. ఇట్టియుత్తరము
రహస్యముగా వ్రాయవలయును గాని బహిరంగముగా వ్రా
యరు. రహస్యముగాను- తొందఱగాను వ్రాయుయుత్తర మం
తనిసిందాగానుండుట కవకాశములేదు. పదినిమిషములలో
నింతనిసిందాగా నుత్తరమువ్రాయుటెక్కడ? వారియనుచరు
నిచే బంపుటెక్కడ? నీకందుటెక్కడ? ఇదియంతయు సంశ
యాస్పదమగు విషయముగాదా? అది యటులుంచుము. పో
నీ! నీవానాఁడు హరకుమారబాబుగారి మీటింగులోనికి
వెడలితివా?

నారా—లేదు.

యతి—నీవు నిత్యము రాత్రి భోజన మెన్నిగంటలకో చరింతువు ?

నారా—ఎనిమిది గంటలకు.

యతి—ఆనాఁడేల 9-10 నిమిషములయినది ?

నారా—కొద్ది యాలస్యమైనది.

యతి—ఎందులకైనదో చెప్పవా?

నారా—క్షమింపుఁడు.

యతి—ఈచీటి యేమియోచూడుము. అని యొక కాగితమిచ్చెను.

నారా—అదియందుకొని యిట్లు చదివెను.

"ఈరేయి హరకుమారబాబు మీటింగులోనికి మగవారు వెడలెదరు. మనమనుకొనినపని యీనాఁడు ప్రారంభింతము. కాళిదాసున కీసంగతి తెలుపుము. రాత్రి మాధుకర వృత్తివేషమున దీపపుస్తంభముచెంత నిలువంబడుము. మీకు సమయమిచ్చెదను."

చిత్తము. ఒకస్త్రీ యీయుత్తరము వ్రాసినట్లర్థమగుచున్నది. ఇందేదియో గూఢార్థమున్నది. అది నేను గ్రహింపజాలను.

యతి—నేను చెప్పుదునా?

నారా—చెప్పుడు?

యతి — ఆయింటియందున్న యాఁడువారు ముగ్వురు. వాల్గవయాబిడ బాలిక, ఆముగ్వురిలో నొకస్త్రీ వృద్ధ. మిగిలిన కోడండ్రిరువురును యువతులు. వారిరువురిలో నెవ్వరో యొకరు నిన్ను గామించియుండిరి. ఎవ్వరో మాత్ర మింకను చెప్పజాలను. ఆమెనీకీయుత్తరము వ్రాసినది. నీవచ్చుటకీ మధుకర వేషమున వెడలియుంటివి. మీరిరువు రేదియో కుటిలాలోచనలోనుంటిరి. మీకిరువురకును రహస్యకూటమి యున్నట్లిందువలన రూఢియగుచున్నది. కాళిదాసు నీసహచారి. యాతని దుర్వృత్తి కాతఁడు మరణించినాఁడు. నీపాపమింకను పండబారలేదు గనుక నీవు జీవించితివి. ఇప్పుడు ఫలోన్ముఖమునకు వచ్చినది గావున బంధింపఁబడితివి. ఆనాఁడట్లు వెడలితివి గనుకనే నీభోజనమాలస్యమైనది. ఆనాఁడు మీరు ప్రారంభింపఁ దలఁచుకొనిన పని హత్యలే. అందుకు సందేహములేదు. ఆవిషయమే యాయువతి నీకెఱింగించినది. అది చెవిని వేసుకొని దొంగయుత్తరము వ్రాసికొని యింటికి వెడలి భోజనమొనరించి తగుదునమ్మా యని వెడలి యింతగత్తరపెంచి యీనేర మేరిపైనైన నెట్టివేయ బ్రయత్నించితివి. పైన పరమేశ్వరుఁడులేడా?

నారా — అయ్యా! ఇదియంతయు నసత్యకథనము. నేనావాఁడు 8½ గంటలవఱకు రాజేశ్వరియను వేశ్యాగృహముననున్నట్లు రుజువుచేయగలను. ఈయుత్తరము నాదిగాదు.

యతి— నీదిగాకున్న నీజేబునందేలయుండును ? అవు నా ! ఈచీటిచూడుము. అని యింకొకచీటి నాతనికిచ్చెను. అదియందుకొని యాతఁడిట్లుచదివెను.

పరిశోధకమహాశయా !

మీరు మమ్ము చాల చిత్రముగాగనిపెట్టితిరి. మమ్ము క్షమించితిరిగనుక మావిలాసోద్యానవనాధికారి నీ నాటి సాయంకాల మైదుగంటలకు మీచెంతకు మాయోపాయ మున బంపెదము. ఆతఁడు ''విలాసోద్యానవనవాసిని మీ రెఱుంగుదురా ? యని ప్రశ్నించును. అదిగుర్తుచూచుకొని మీరు బంధించుఁడు. ఈరహస్యము మేమెఱింగించి నట్లాతని కి తెలుపకుఁడు. మేమింకీప్రాంతములనుండక కలత్తాకుబో యెదము. మమ్ము గాపాడినందులకు మీకనేకవేల వందన ములు. "రాముడు; భీముఁడు."

అయ్యో ! ఆదురితాత్ము లీవిధముగా నన్నుసర్వనాశ న మొనరించిరి. అని యనెను.

యతి—అగును పాపము ! వారుమిగుల విశ్వాసఘా తకులని నీవు మొదట నెఱుంగవు.

నారా—అదిగాదయ్యా ! వారీవిధముగా నన్నురికం బమెక్కించి వారునిశ్చింతగా జీవింపదలంచి పన్నినపన్నాగ మిది. ఇంతవిరుద్ధముండునా ? మీరువారినేల బంధింపరైతిరి?

యతి—నేను విలాసోద్యానవనము గండ్లారజూచితిని. కడచినరేయి యచ్చటనేయుంటిని. నేనచ్చటకు వెడలినదియు-

తిరిగివచ్చినదియు గూడ నోరు తెఱుంగవు. ఇప్పుడు నీవుచిక్కి తివి. ఈ రేయి వారిని చిటికలో బట్టితీరెదను. వారినివిడచి పైతునని- కలకత్తా పోనిత్తునని నీవనుకొనకుము. ఇందున్న వ్యవహారమంతయు నాకు తెలిసిపోయినది. ఇప్పుడీయుత్తర మువ్రాసిన యువతినామ మెఱింగింతువా ?

నారా—భగవంతునిసాక్షిగా నేనేమియు నెఱుంగ ను. నన్నెందుకుబాధింతురు ?

యతి—ఇంకను నన్ను మాయచేయదలఁచుచో నె ఱ్ఱగాఁ గాలిన నినుపగునుపములు నీగుడ్లలో జొప్పించి నీచే నిజము జెప్పింతును.

నారా—అంతచిత్రవధ జేయసంకల్పించినచో నేనే మిచేయుదును ?

యతి—నిజమెఱింగింపుము. ఉరితప్పించి ద్వీపాంతర వాస శిక్ష వేయింతును.

నారా—నిజముగా మీపాదములాన నేనేమియు నె ఱుగను.

యతి—ముమ్మాటికి ?

నారా—ముమ్మాటికిని నేనేపాప మెఱుంగను.

యతి—అట్లయిన నేటిరాత్రి నీయనుచరులతో నీవు కాకినాడవెడలి బందెలోబడియుండుటకు సర్వసిద్ధముగా నుండుము.



# అయిదవ ప్రకరణము.



ఇందు మీకేదయిష్టము ?

నారాయణస్వామియును, బైరాగి (అనగా డిటెక్టివు. మనమింకట్లే బిలువవచ్చును.) యును మాటలాడు సమయముననే మాధవకోనేటియొడ్డున నున్న బిక్షుకుల చరిత్రమొకటి చదువరుల కెఱింగింపవలసియున్నది.

ఈకోనేటియొడ్డునఁ గాళ్లును, చేతులును లేనియొక బిక్షకుఁడు కూర్చుండుట కనువగునొకకఱ్ఱలతొట్టెపై గూర్చుండియుండెను. ఆతొట్టికి నాల్గువైపులను నాల్గుత్రాళ్ళను గట్టి వాటికొనలు నాల్గును నొకవెదురుకఱ్ఱకు గట్టిగాఁగట్టి దానిని భుజములపెట్టికొని యిరువురు మోయుచు నిండ్లవెంటవెడలి

"కాళ్ళుచేతులు లేవునారాయణా"

"కడుపుకన్నములేదు నారాయణా"

"చూసేటి ప్రభువులు నారాయణా"

"రాగిడబ్బివ్వండి నారాయణా"

అని కొంతసేపును:—

"బాబుగారు కాళ్లులేవు"

"అమ్మగారు చేతుల్లేవు"

ఒక్కడబ్బు - ఓబాబు"

"ఇన్నిబియ్యం ఓఅమ్మ"

"ఇస్తేని కోటిపున్నెం"

అని కొంతసేపును దిరిగితిరిగి వసూలయినంతవఱకును దండుకొని తెచ్చుకొని వారువారు నియమించుకొనిన ప్రకారము పంచుకొనుట యిట్టి భిక్షుకులకు రివాజయియున్నది.

ఈగట్టుమీఁద నున్నవారుగూడ నట్టివారేయైయుందురు. కాళ్లుచేతులు లేనివాని నేకారణముననో మోసినవారిరువురను దిట్టుచుండిరి.

కాళ్లును, చేతులును లేకున్నమూనె నీలోప మాతని నోరుదీర్చుటచే యాతఁడుగూడ మోసినవారినిరువురఁ దిట్టుచుండెను.

చినుకు చినుకు గాలివానయైనట్లా తిట్లాట కొట్లాటక్రింద మారినది. కుంటివాఁడు తిట్టుటయేగాని కొట్టలేడు. మోసినవారిద్దఱును బలవంతులైన కారణముపైఁ గలియబడిరి. అదిగాక కుంటివానిగొట్టుట కిద్దరెందులకు ? విస్తారము బలమెందులకు?

ఆబాటవెంబడిబడి బోవువారును, వచ్చువారునుగూడ వారి నడ్డుకొనరైరి. అడ్డుకొనినచో వారు తమ్ముగొట్టుదురని భయపడిరికాబోలు.

సరిగా నాసమయమున నిరువురు బలిష్ఠులగు పురుషులామార్గమునఁ బోవుచుండిరి. పాపమాసొట్టవాఁ డదిగాంచి, వారిరువురైనచో, యీయిరువుర నాటంకపరుపగలరను దై

ర్యముతో గాఁబో లాతెఁడా తొట్టిపైనుండి క్రిందబడి దొరలు చఁబోయి వారికాళ్ళపైబడి వారిమార్గమునకడ్డువచ్చి యాసా ట్టిచేతులతో వారికాళ్ళుబట్టుకొని—

బాబులారా! యీదీనుణ్ణిరచ్చించండి. రచ్చించండి. యీాళ్ళిద్దఱు గలిచి కుంటోణ్ణి చొట్టోణ్ణి నంపేత్తున్నారు బా బు రచ్చించండి" అని బొరుమనియేడ్చెను.

"ఏమిరాదుర్మార్గులారా! ఈయవధ్యుని గొట్టుటకు మీకు జేతులెట్లువచ్చినవిరా పాపాత్ములారా! లోకువగదా యని మీరు వానిని గొట్టితిరి. మేము మిమ్ముఁగొట్టిన నేమిచే యుదురురా?" అని యావచ్చినవారిలో నొకఁడనెను.

వారిరువురును వచ్చి క్రొత్తగావచ్చినవారి రెండుచే తులను బట్టుకొనుచు- మధ్యమధ్య గడ్డంబట్టుకొని బ్రతిమా లుచు- వచ్చినవారికి చిత్తవిభ్రాంతి గల్గునట్లు బ్రతిమలా డుచు:—

బాబూ! ఇనండి. తప్పంటే మమ్మల్నితన్నండి- ఓరి వాల్లతప్పంటే వార్నికుళ్ళ మొడండి. మీారుగొప్పోరు. ఈ మెదవ లెగనేడుగదండి. యీాణ్ణిమేమిద్దరం మోచిముట్టిత్తా మండి. ఒచ్చిందాంట్లో ఒంతుపీడికి- మూఁడొంతులు మాకి ద్దరికిని నిర్నయమండి. సూడండి బాబు ఎంతతిరిగితే- అంతలా బముందని మాకు తెల్దేటండి? యీాడికంటెమాకే ఓటామె క్కువగందాండి. ఈ మూల మాఓడికాలు- తల్చిగ్గొయ్యి యి

రుకట్టి- నడలేకపోయాడండి. అంచేతగంటే కుసిన్నళ్లే తిరిగా వండి. మేము దండిందంతా- సల్లగ కూకుంటాడు గనుక-ఈ డిదగ్గ రేవుంటదండి. ఈయాల పదాఱుదమ్మిడీలు- సూరేడు సోలల బియ్యముమాత్రిమే దొరికాయండి- ఈయేల సేనా తక్కువ దొరికాయని- అంచేత మొదటనుకున్నట్టు వా టాయియ్యనని పేసీపెట్టి తిడుతున్నాడండి. ఎక్కువొత్తే మా కెక్కు విత్తాడాండి? తక్కువొత్తే తక్కువియ్యడానికి ? ఎం తొచ్చినా మావాటాకంటె మాకెక్కువరాదుగదాండి. లేని పోని పేసీపెట్టితిడితే మేముపడుంటామాండి. తమరు నాయం సెప్పండి? యీమెదవకి మేమిచ్చున్నామాండి మొయ్యటా నికి. సెప్పండిబాబూ! సెప్పండి" అని యాయిద్దురును యి రువరనుబట్టి నలిపివేయుచుండిరి.

"ప్రిభువులు. యినండిబాబూ! మీరు ధర్మమూర్తు లు. నేనుచొట్టోణ్ణి, కుంటోణ్ణి కనక యేబాబేనా కనికరించి టోలీగవ్వలిత్తున్నారుగాని- అడ్డగాడిదల్లాగున్న యీాళ్ళను సూసి యివ్వడంలేదుగదాండి. అల్లాంటిది నాపొట్టేనూడిసే త్తారంట యీమెదవలిద్దరును. ఈయాలకేదో తెగతెంపు సెయ్యి బాబు. రేపోసోటకూకుండే అడుక్కుంటాను." అని యాసొట్టవాడనెను.

"ఒరేయి మీలోమీరు తగవులాడవలదు. ఆగట్టు పైకి నడువుడు. అక్కడ మీతగవు పరిష్కారముచేయుదును."

అని యావచ్చినవారనిరి.

"చిత్తం బాబూ! చిత్తము. ధర్మస్వరూపులు. రండి. బాబూ! రండి" అని పొట్టవాఁడనెను. బిచ్చగాండ్రు వచ్చిన వారిచేతులు విడువకయేనడచుట ప్రారంభించి వచ్చినవారు గూడ నడువబోవ కాళ్ళకేదో యడ్డున్నట్లయి క్రిందికిచూచు కొనిరి. ఇంకేమున్నది. ఇనుపరికాళ్ళకున్ను సంకెళ్లు బడిపోయి యున్నవి! ఆసంగతి వారుగ్రహించి:—

ఓరోరి తులువలారా! ఎవరురామీరు? బిచ్చగాండ్ర వలె నటించి మాకాళ్ళకు సంకెళ్ళదగిలించితిరా? పులితో జెలగాటలాడ సాహసించితిరా? ఇదిగో! పిస్తోలుతో మిమ్ముఁ గాల్చి:—

బాబూ! పిస్తోలుతో మమ్ముగాల్తురా? మేము దొంగలమా? దొంగవస్తువులుదెచ్చి మారాణ్వాడీకి విక్రయించితిమా? నరహత్యగావించి యాశిస్సునాయకుఁడగు మారాణ్వాడీ యింటఁబడవేసితిమా? మమ్మెందుకు గాల్చివైతురు బాబూ!"

ఇట్లనుచునే మిగులజాతుర్యముతో వారిసిరుప్రురఁ బడ వైచి మిగులగట్టముమీఁద హస్తములకుఁగూడ నిగళంబులు దగిలించివైచిరి. వెంటనే వారిజేబులు, మొలలుదడిమివైచి పిస్తోళ్ళు లాగివైచిరి. వారివారిమొలలో గుప్తముగా భద్రపరుపబడియున్న చిన్నకైజారులఁగూడ లాగుకొని:—

బాబులారా! ఈమారు శ్రీకృష్ణజన్మమందిరములో గృహప్రవేశ మొనరించుటకు దయచేయుఁడి. మీరెవరిని కొంపనట్టేట గట్టదలంచి మిగుల గృత్రిమముగా బలవంతరావును వధించి యాశిరస్సు మార్వాడీగృహంబునఁ బడవైచిరో యామార్వాడీ లాలాయే మీపాదములు స్వయముగా బట్టి సంకెళ్లు దగిలించినాఁడు. ఇంక మీరీజన్మలో విచ్చలవిడిగా దిరుగుటసంభవము. మీపాపము బూర్తిగా ఫలించినది. నేను రాజారావుననియు, యీతఁడు నాసేవకుఁడగు గోవిందుఁడనియు నెఱుంగుఁడు. కామేశ్వరరావింట మిమ్ము బంధించినవాఁడు వంకాయలమ్మువానియట్లు నటించి మిమ్మను సరించినవాఁడీ గోవిందుఁడే. మీకొఱకు బోలీసువారిని బంపించినవాఁడను నేనే. అప్పుడు మీయదృష్టము తిన్నగానుండి పారిపోయితిరి. అది తెలిసికొనియే యిచ్చటీవిధముగా గాసి మిమ్ము బట్టితిమి. ఇఁక మీకు నిష్కృతి లేదు. మీవిలాసోద్యానవననాయకుఁడెవ్వఁడో? అతఁడా రఘునాధరావుగారి కుటుంబముపై నింతటి యీర్ష్య వహించుట కేమికారణమో జెప్పివేయుఁడు. మీరిప్పుడైనను పశ్చాత్తాప పడి- సత్యమెఱిగించిన మిమ్మురినుండి తప్పించి- ద్వీపాంతరవాసశిక్ష విధింపఁజేసి మీప్రాణములు నిలిపెదము. కాము మేముగామని యసత్యములే యాడదొడంగితిరా యెట్టిఁగా గాలిన నినుపకమ్ములతో మీమొడలెల్లగాల్చి- మనుగుచున్న వేడిచమురు

వాల్కుపై జిల్కురించి- మిమ్ములచిత్రవధచేసి- మీచే నిజ
ముచెప్పింతుము. అప్పుడు మీరెంతయేడ్చినను మీరుక్ష
మింపఁబడరు. ఉరిదీసి నిమిషములో మీ ప్రాణములుదీయు
రు. పూర్వకాలములో నున్నట్లొకపీపాకు దిట్టముగా మేకులు
గొట్టించి యందు మిమ్ము బెట్టిగట్టిగా మూతబిగించి మిగుల
నెత్తైన స్థలమునుండి కిందికి దొర్లించి మిమ్ము హింసించి- హిం
సించి-చంపించెదను. ఇందుమీ కేది యిష్టము” అని రాజారా
వూరకొనెను.

# ఆఱవ ప్రకరణము.

## దొంగలచరిత్ర.

“అయ్యా! ఇంతవఱకువచ్చినపిమ్మటింక దాపరికమెం
దులకు? మేము మారువేషమున నున్నప్పుడిదివఱకెవ్వరును
బోల్చుకొనజాలకపోయిరి. ఈమార్వాడీ లాలాయే మాకొం
ప నీవిధముగా గూల్చినాఁడు. అదిగాక పాపమేనాటికిని బ్రద్ద
లుకాకమానదు. ఈసందర్భమున నున్న రహస్యమెల్ల మీ
కు బూర్తిగా నెఱింగించివైతుము. మమ్ము చిత్రవధచేయకుం
డ ద్వీపాంతరవాసశిక్ష విధింపజేయుటకు మీరుబాధ్యులు-
అట్లు మీరు వాగ్దానమిచ్చితిరిగాన యదార్థస్థితి నెఱింగించు
చుంటిమి వినుఁడు. ఇచ్చట నిలువంబడి చెప్పుకొనుట బా
గుండ దాచెఱువుగట్టున గూర్చుందము నడువుఁడు”

అని వారనగనే యెల్లరును నటకరిగిరి. అటగూర్చు
న్నపిమ్మట వారిలో నొకడిట్లనెను.

అయ్యా! దుర్ధముఁడును, కేశవుఁడు ననువారిరువురు
చావమరదులు. నక్కపల్లిప్రాంతమున మిగుల ప్రసిద్ధికెక్కిన
దొంగలు. నిజముగా వారు బరమేశ్వరునకుఁ గూడ భయప
డువారుగారు. ఒకనాఁడు మేము నక్కపల్లిలో జూదమాడి
యెనిమిదివేలుగెల్చికొని మాస్వగ్రామమగు రాజపాలెము
బోవుచుండ పైదొంగలు మమ్మడ్డుకొని చావమోది బలవంత
ముగా మాచెక్కలు విఱచికట్టి మాద్రవ్యముదోఁచికొని
మమ్మగూడ తమగూడెములోనికి దోడ్కొనిపోయి యొక
చో బంధించియుంచిరి.

మరికొన్ని నెలలకు రామచంద్రరావు అను వానిని
గూడ నట్లే బంధించితెచ్చి మాప్రక్కకొట్టులో బంధించి
యుంచిరి.

అతఁడు మిగుల తెలివితేటలైనవాఁడు. క్రమక్రమము
గా నెలదినములగునాఁటికి మంచిమాటలవలన మమ్ము తన
వారిగా నొనర్చుకొని యెట్లైన బారిపోవుటకు మార్గము
లాలోచింపమొదలుపెట్టెను. కాని యెంతమాత్రమును [illegible]లా
భకారిగాలేదు. మెల్లమెల్లగా నాదొంగలగుట్టెల్ల నారామ
చంద్రరావు తెలిసికొనియెను. వారిబసకు రెండుమైళ్ళదూర
మునఁగలయొకలోయలో నాణ్యములును, బంగారు[illegible]కాసులును

పాతు లేయఁబడియుండును. దాని సంగతి యాభావమరుదుల
కును- ఇంకనిద్దఱునువ్వురు దొంగలకును తెలియును. ఇట్లు
మూఁడేండ్లుగడచినవి. కేశవునకొక మొగపిల్లవాఁడు పది
యేండ్లవాఁడుగలఁడు. దుర్గమునకు బిల్లలు లేరు. ఇట్లుండ భగ
వంతుని దయవలన దుర్గముని భార్య గర్భముధరించెను. వాని
యానందమునకు మితిలేకుండెను. ఆవార్త వాఁడువినినప్పటి
నుండియు మమ్ము దయతో జూచుచుండెను. ఆదయనాధార
ముగా జూచుకొని పారిపోవుటకు మేము మువ్వురమును సం
కల్పించుకొని సమయమునకై నిరీక్షించియుంటిమి. ఎప్పటిక
ప్పుడే యారామచంద్రిరావుగారు మాకాశలుగొల్పుచుండిరి.
పారిపోవుట కవకాశము జిక్కినచో బోలీసునకీ గూడెము వ
ప్పగింతమనియు- మారుమూలలోయలోనున్నధనము- ము
వ్వురము సమానముగ బంచుకొందమనియు నేర్పరచుకొంటి
మి. ఇట్లుండ నొకసుమూర్తంబున దుర్గముని భార్య యొకాఁ
డుబిడ్డను గనియెను. ఆఁడుబిడ్డపుట్టినందులకా దుర్గముఁడించు
క విచారించెనుగాని కేశవుడుమాత్రిము తనకు గోడలుపుట్టిన
దని సంతసించెను. అందుకు దుర్గముఁడు సంతసించెను. పదు
నొకండవ దినంబున బాలసారె గనుకానాఁడు తనసేవకులను
అనుచరులను- స్వేచ్ఛగా త్రాగుడనియు- ఆఁడుడనియు-నా
జ్ఞాపించి మమ్ముగూడ వారితోగలిపివైచెను. రామచంద్రిరా
వాసందర్భముచూచుకొని- ఏదోచిత్రిమగు నాటగల్పించి-యాట

అని వారనగనే యెల్లరును నటకరిగిరి. అటగూర్చు న్నపిమ్మట వారిలో నొకడిట్లనెను.

అయ్యా! దుర్ధముఁడును, కేశవుఁడు నను వారిరువురు భావమరదులు. నక్కపల్లిప్రాంతమున మిగుల ప్రసిద్ధికెక్కిన దొంగలు. నిజముగా వారు బరమేశ్వరునకుఁ గూడ భయపడువారుగారు. ఒకనాఁను మేము నక్కపల్లిలో జూదమాడి యెనిమిదివేలుగెల్చికొని మాస్వగ్రామమగు రాజపాలెము బోవుచుండ పైదొంగలు మమ్మడ్డుకొని చావమోది బలవంతముగా మాతెక్కలు విఱిచికట్టి- మాద్రవ్యముదోఁచికొని మమ్ముగూడ తమగూడెములోనికి దోడ్కొనిపోయి యొకచో బంధించియుంచిరి.

మరికొన్ని నెలలకు రామచంద్రరావు అను వానిని గూడ నట్లే బంధించితెచ్చి మాప్రక్కకొట్టులో బంధించి యుంచిరి.

ఆతఁడు మిగుల తెలివితేటలైనవాఁడు. క్రమక్రమముగా నెలదినములగునాఁటికి మంచిమాటలవలన మమ్ము తనవారిగా నొనర్చుకొని యెట్లైన బారిపోవుటకు మార్గములాలోచింప మొదలుపెట్టెను. కాని యెంతమాత్రమును లాభకారిగా లేదు. మెల్లమెల్లగా నాదొంగలగుట్టెల్ల నారామచంద్రరావు తెలిసికొనియెను. వారిబసకు రెండుమైళ్ళదూరమునఁగలయొకలోయలో నాణ్యములును, బంగారుకాసులును

పాతులేయఁబడియుండును. దాని సంగతి యాబావమరుదుల
కును- ఇంకనిద్దఱుముఁవ్వురు దొంగలకును తెలియును. ఇట్లు
మూఁడేండ్లుగడచినవి. కేశవునకొక మొగపిల్లవాఁడు పది
యేండ్లవాఁడుగలఁడు. దుర్గమునకు బిల్లలులేరు. ఇట్లుండ భగ
వంతుని దయవలన దుర్గమునిభార్య గర్భముధరించెను. వాని
యానందమునకు మితిలేకుండెను. ఆవార్త వాఁడువినినప్పటి
నుండియు మమ్ము దయతో జూచుచుండెను. ఆదయనాధార
ముగా జూచుకొని పారిపోవుటకు మేము ముప్వురమును సం
కల్పించుకొని సమయమునకై నిరీక్షించియుంటిమి. ఎప్పటిక
ప్పుడే యారామచంద్రరావుగారు మాకాశలుగొల్పుచుండిరి.
పారిపోవుట కవకాశము జిక్కినచో బోలీసువకీ గూడెము వ
ప్పగింతమనియు- మారుమూలలోయలోనున్నధనము- ము
ప్వురము సమానముగ బంచుకొందమనియు నేర్పరచుకొంటి
మి. ఇట్లుండ నొకసుముహూర్తంబున దుర్గమునిభార్య యొకాఁ
డుబిడ్డను గనియెను. ఆఁడుబిడ్డపుట్టినందులకా దుర్గముఁడించు
క విచారించెనుగాని కేశవుడుమాత్రము తనకు గోడలుపుట్టిన
దని సంతసించెను. అందుకు దుర్గముఁడు సంతసించెను. పదు
నొకండవ దినంబున బాలసారె గనుకానాఁడు తనసేవకులను
అనుచరులను- స్వేచ్ఛగా త్రాగుడనియు- ఆఁడుడనియు-నా
జ్ఞాపించి మమ్ముగూడ వారితోగలిపివైచెను. రామచంద్రరా
వాసందర్భముఁజూచుకొని- ఏదోచిత్రమగు నాటగల్పించి-యాట

లో దొంగలెల్లరును మూఁడుదినములవఱకు గండ్లు తెఱువకుం డునట్లు దిట్టముగా దాగించుచు మాకు సాజ్ఞజేసెను. వెంట నే మాభీముఁడు తప్పించుకొని నక్కపిల్లి వెడలియున్న పోలీసు వారిని, చాలమంది గ్రామస్థులను వెంటబెట్టుకొని నిముష ములమీఁద నటకువచ్చెను.

దొంగలకేరికిని యొడలుదెలియుటలేదు. తాగి- మ త్తెక్కి- జోగుచు- తందానపదములు బాడుచుండిరి. ఆయు ధములతో బనిలేకుండగనే దస్యులకెల్ల సంకెళ్లుబడిపోయెను. ఈసందడిలో కేశవుని కొడుకగు నారాయణుఁడెటో రెండవ కంటివారెఱుంగకుండ బారిపోయెను. తక్కినవారెల్ల బంధిం పఁబడిపోయిరి. పదునొకండుదినములగుడ్డు దొంగలనాయకుని పుత్రికను రామచంద్రమూర్తి పెంచుకుందునని పోలీసువా రిని గోరి వారియనుమతి బడసెను. మాముప్పురకు విము క్తియైనది. పోలీసువారటనున్న యావదాస్థియు బట్టుకొని- ఆగూడెము నిర్ధూమధామమొనరించి పట్టుబడినవారినెల్ల దీ సికొనిపోయిరి.

మేమంతవఱకా చాటునఁ డాగియుండి వారందఱు వెడలినపిమ్మట మేమాలోయకు బోయి యాదవ్యరాశిగని పెట్టి యనుకొనినట్లు సరిగా మూఁడువాటాలు వేసికొంటిమి. ఒక్కొక్కరి కొక్కొక్క లక్షరూపాయాల యాస్తిలభించి నది. ఈగుట్టు వెల్లడిచేయకుండునట్లు మాలోమే మొడంబ

ఆమఁకొని విడిపోయితిమి. ఆతఁడు వారిస్వగ్రామము వెడలి యాపసిబిడ్డను తననిజతనయవలె నేలోపమును రానీయక పెంచుకొనుచుండెను.

మేమంతద్రవ్యమెన్నఁడును జూచియెఱుంగము. అందునమూర్ఖులము. అందుచే మరల జూదములో బ్రవేశించితిమి. ఆసమయమునఁ జుఱుకుబుట్టుటకై చుక్క ప్రారంభించితిమి. కనకమున్నందులకు కాంతగూడ నున్నచో బాగానుండునని యీపురమున జెరియొకదొమ్మరసానిని జాగ్రత బెట్టితిమి. ఓడకన్నివైపులను జిల్లులుపడినతరువాత నదియునుఁగుట కెంత గావలయును. ఇంచుక కష్టదెఱమఁకొని నడుచుటచే నాల్గుసంవత్సరములు నిలువద్రొక్కితిమి. అయిదవసంవత్సరారంభమునాఁటికి మా చెంత నర్ధరూపాయిడబ్బులు లేవు. దొమ్మరసానులు మా నెత్తివడచి లేచిపోయిరి. కాంత లేకున్న నిలువగలమేమోగాని- కల్లు లేకున్న నిలువగలమా? అందున మాకు మూర్గుణములుండి నాల్గవదిలేకున్న నిజముగా మేము శోభింపమను దుర్భ్రమతో మెలమెల్లఁగా దొంగతనము లారంభించి యందువిశేషప్రజ్ఞ గడించి విలాసోద్యానవనము మాకు ఆస్థానముగా నిర్ణయించుకొంటిమి. నాఁటినుండియు జూదమువిడిచితిమిగాని- కాంతను, కల్లును, కన్నమును విడువలేదు. మాకు చిఱుతరాబాల్యమునుండియు నలవాటులేకపోయినమూలమున కన్నములు వేయుటలో మాకు

నేర్పుగుదురలేదు. దారులుగొట్టుట ప్రారంభించితిమి. దారులుగొట్టి యెన్నివస్తువులు దీసికొనిపోయినను- మాయదారివర్తకులు మమ్ముబెదరించి- రూపాయకు దమ్మిడీయైన ముట్టజెప్పెడివారుగారు. ఆవిషయమున జరిగినచరిత్ర యొకటి లాలా మీ కెఱింగించియేయున్నాఁడు. ఆపాట్లుబడజాలక మేమొక చిత్రమైన పన్నుగడబన్నితిమి. మే మొకనాఁడీయూరనొక పెద్దమనుజుని జూచి చటాలున బోల్చుకొంటిమి. ఆతఁడు దొంగల కుపనాయకుండగు కేశవునికొడుకు నారాయణుఁడు. ఆతనినిగలిసి సంగతి తెలిసికొంటిమి. ఆతనిసంగతి చెప్పితిమి. ఆతనిమేనమామ కూతురున్నస్థల మెఱింగించితిమి. నీకుపకార మొనర్తుమని యొప్పించితిమి. మావిలాసోద్యానవననాయకునిగాఁ జేసుకొందుమని నచ్చచెప్పి- మాప్రయత్నములకు తోఁడుపడునట్లొనరించి- ఆతనిప్రాణస్నేహితుఁడగు కాళిదాసునుగూడ లోబరచుకొంటిమి. నీమేనమామకుమార్తెను నీకుగూర్తుమని చెప్పితిమి. ఇదియంతయు మేమాతని శ్రేయస్సుగోరి చెప్పినటులే నటించి విశ్వాసముగా బనిచేయుచుంటిమి. కాలహరణమొనర్ప కానాఁడే యాదుర్గమునిపుత్రికను గలుసుకొంటిమి.

రామచంద్రరావా మెను బండ్రెండువర్షములు పెంచి రెండువేలయేనూఱువందలు గట్నమిచ్చి ధనవంతుడగు రఘునాధరావుగారి ద్వితీయపుత్రుడగు బలవంతరావునకిచ్చి పా

ణిగ్రహణ మొనర్చెను. కథకడముట్ట వినుఁడుగాని కంగారుబ
డకుఁడు. ఆమెకొక కుమారుఁడు కుమారమాధవరావు పు
ట్టెను. మేమామెనుగలిసి- తొలుతభయపెట్టి- మామాట
వినుమని నిర్బంధించి- యావెనుక యామెనిజవృత్తాంతమెల్ల
నెఱుంగఁజెప్పితిమి. ఆవృత్తాంతమంతయు విని యామెమిగుల
విచారించినది. ఎప్పుడోపోయిన తల్లిదండ్రులఁగూర్చి యిప్పు
డు విచారించినది. తనబంధువులఁగూర్చి మిగుల కటకటంబడి
నది. తనదత్తతజనకుని దౌర్జన్యమున కెంతేని యలిగినది.
ఆనాఁడు మే మొనర్చిన ద్రోహమున కెంతేని గినిసినది.

బాబూ! ఆయిల్లాలు మిగుల మర్యాదగలకుటుంబ
ములో పెరిగినది. అంతకంటె మర్యాదగలకుటుంబములో
బడినది. ఆమెకామర్యాదలన్నియు నలవడినవేమోయని భ
యపడితిమి. ఆమె మా మాటలువిని మమ్ము దండించునేమో
యని భయపడితిమిగాని- బాబూ! నైజగుణమునకును- తప్పు
కంటికిని మందు లేదనినవాఁడు మందుఁడా? సుమతీశతకము
వ్రాసినవా డుత్తముండయా?

కం. కనకపుసింహాసనమున
శునకముగూర్చుండబెట్టి । శుభలగ్నమునం
దొనరగబట్టముగట్టిన
వెనుకటిగుణమేలమాను । వినురాసుమతీ.

అని వ్రాసిననాఁడే. అది యెంతటిసత్యవాక్యమో గ్ర
హింపుఁడు. ఆతఁడెటువంటి సుజ్ఞానియో యూహింపుఁడు.

పంచభక్ష్యపరమాన్నములు బోసిపెట్టినను- ఊఁకుక్క- పెంటపోగులు మూచూడకమానదు. ఆమె దొంగవాని పుత్రిక. ఆమెజన్మవాసన యామెకుబోయినదికాదు. ఆజన్మకాలమును శాంతయుతంబగు దపంబాచరించు మునులొక్కొక్కప్పుడు మానవాతీతమగు క్రోధముదాల్తురే. వెయ్యివేల వర్షములు శాంతముగానుండి- అనేకములగు పంటలొసంగి- యనేకవేల ప్రజలనాదరించి రక్షించిన- కొండ- ఉన్నట్లుండి యొక్కమారుగా బొంగి యగ్నిపర్వతమై- చుట్టుప్రక్కల స్వరూపనాశన మొనరించివైచును. బాబూ! ఇంకను బ్రకృతి నెవ్వరడ్డగలరు ?

ఆమె మాకోర్కెకనుమతించినది. తనయత్తవారితరపువారినెల్ల మిగుల చాకచక్యముగా సంహరించి యాస్తిరాస్తిగూడ చరాస్తిగా మార్చి- తరువాత బుట్టిల్లు బుగ్గిజేసి యాయాస్తిగూడ చేఁబట్టి- తనమేనత్తకుమారుండగు నారాయణు నుద్వాహమాడి తనతలిదండ్రుల కీర్త్యున్నతులు నిల్పెదనని ప్రతిజ్ఞపట్టినది. వారియాత్మకు శాంతిగూర్చెదనని ప్రతిన యొనర్చినది.

ఆతరువాత మేమాయిరువురను గల్పితిమి. ఒకరినొకరు కౌఁగలించుకొని యేడ్చిరి. ఒకరికొకరు ప్రతిజ్ఞలొనరించుకొనిరి. ఆతఁడామరునాఁడే మాద్వారా 'మార్ఫియా' అను విషమామె కందఁజేసెను.

మావ్యవహారములు సాఫుగాగాకుండా రాజారావొకఁడేదియో పనిగల్పించుకొని యిక్కడపీఠమువైచుకొని కూర్చుండెను. ఒకనాఁడు రాజారావు బలవంతరావును వెంటబెట్టుకొని కాకినాడవెడలెను. ఆనాఁడే హరకుమారబాబుగారి యుపన్యాసము.

మునుముందు రఘునాథరావును, జంపవలయుననియు అప్పుడు మాధవరావు విల్లువ్రాయుననియు- ఆవిల్లుసంగ్రహించి- ఆస్తికైంకర్యముజేయవచ్చుననియును మానాయకుఁడామెకు బ్రిబోధించెను.

ఆనాఁడామెకార్యమును ప్రారంభింపదలంచి నాయకునకుత్తరమువ్రాసి పాలలోవిషము గలిపినది. దైవయోగమున రఘునాథునకు దెబ్బలుగూడ తగిలినవి. కొందఱను తానుజంపి- కొందఱకు నేరస్తులుగా నొనర్చి దొరతనమువారిచే నుఱిదీయించి- తానునిర్దోషియట్లునటించి- లోకమును మోసపుచ్చి దాను జయలక్ష్మిని చేబట్టదలంచి యీనాటకమాడినది.

ఆమె మానాయకుని యనేకవిధముల బ్రార్థించి యీనేర మొక్కరపై స్థిరపడునట్లొనరింపుమని గోరినది. కాని యాతఁడు మందుఁడై కప్పలతక్కిడి జేసివైచెను. లేకున్నమాకిట్టి చిక్కు లుత్పన్నమగునా ?

ఆనాఁటినుండియు నడచిన సర్వవృత్తాంతమును మీ

రెఱింగియేయున్నారు. ఆనారాయణుఁడే నారాయణస్వామి యనుపేర నీగ్రామమున పోలీసుసబుయినస్పెక్టరుగా బని చేయుచున్నాఁడు.

మీరాశ్చర్యపడవలసిన బనిలేదు. లోక మిట్టివిపరీత సంస్థలెన్నియో జూచియున్నది.

ఇప్పుడు సుభద్ర మీచేతులలోనే యున్నది. దొర తనమువారితరపున మరి యిరువురు పరిశోధకులు వచ్చి యిట రహస్యముగా బనిచేయుచున్నారు. ఒకనిపేరు శ్యామలరావు. కామేశ్వరరావు ప్రత్యేకము కాకినాడవెడలి రాజారావే హంతకుఁడని నిరూపించి నిన్ను బట్టుట కొకడిటెక్టివును గోరి శ్యామలరావును దెప్పించెను. నీబాంధవులయిుట నేరమగుట చేతను_ నీవు మాయచేయుదువేమోయను భయముచేతను D. S. P. గారు ప్రత్యేకము నొకడిటెక్టివును బంపిరి. ఆతఁ డు బైరాగిగా గుక్కుటేశ్వరాలయములోనుండి బనిచేయుచు మమ్ము గనిపెట్టెను. మావిలాసోద్యానవనము పరీక్షించెను. కడకు మమ్ముబట్టెను. అప్పుడు మానాయకుని వారి పరమో సరించి మేము తప్పించుకొంటిమిగాని యిప్పుడు మీచేతికి జిక్కిపోతిమి. ఇఁక మాకు విడుదలదొరుకు టసంభవమని గ్రహించియే మీకీ వృత్తాంత మెఱింగించితిమి. నాఁటినుండియు నడచిన వృత్తాంతములు మీ రెఱుంగనే యెఱుంగుదురు. ప్ర త్యేకముగా మేము జెప్పవలసినదిలేదు. మీకింకను సంశయ

ములేమైన నున్నచో నడుగుఁడు. తెలిసినంతవఱకు సమాధానములిచ్చెదను. సంశయింపక- దాఁచికొనక- సర్వమెఱింగించితిమిగనుక- మా నాయకీనాయకు లిర్వురును బాధింపబడి యున్నారుగనుక- మమ్ము ద్వీపాంతరవాసశిక్షతో క్షమింపఁజేయు భారము మీది."

అని వారొక పెద్ద నిట్టూర్పువిడచి యూరకొనిరి.

రాజా—నేను D. S. P. గారితో మాటాడి వచ్చుచుండగా మార్వాడీతో మాటాడి పోవుచున్న నన్ను గనిపెట్టినవా రెవ్వరు?

రాము—వాఁడు మాభీముఁడు.

రాజా—బలవంతరావు శిరస్సప్పుడే వానియింట విడచితిరా?

రాము—అగును.

రాజా—సుభద్రను వేరేటికాపురమునకై మీరుగాని, మీ నాయకుఁడుగాని ప్రోత్సహించిరా?

రాము—ప్రోత్సహించితిమి. ముసలివారు పడనిచ్చిరి గారు.

రాజా—కామేశ్వరరా వామెను బలవంతపరచెనని వింటిని. అది యెంతవఱకు సత్యము.

రాము—ఆమాట సత్యమేగాని- యామె యాతని వశముఁగా లేదు.

రాజా—మాధవరావు వ్రాసిన విల్లెవ్వరియొద్దనున్నది?

రాము—విలాసోద్యానవనములో నొక చెట్టుతొఱ్ఱలో నున్నది.

రాజా—బలవంతరావును జంపిననాఁడు మీరామెను నలువురితోఁబాటు గట్టితిరిగాని వ్రేలాడదీయలేదేమి?

ఆమె వ్రేలాడదీయుమనియే కోరినది. ఎజమానురాలని సంశయించి మేమే మానితిమి.

రాజా—"మువ్వన్నెమేకము," "కాలసర్పము." అను బిరుదులు నాయకునివా? నాయకురాలివా?

రాము—నాయకురాలివే.

రాజా—మీనాయకురా లప్పటికి బంధింపఁబడియున్నదిగదా? ఈయుత్తరము లెట్లు వ్రాసినది.

రాము—అదియు గష్టమేనా? ఆమెప్రియుఁడు సబినస్పెక్టరు. ఆతని చెలికాఁడు పహరాజవాను. అట్టియెడ నిట్టివెన్నియుత్తరములు వ్రాయవచ్చునో యూహింపుము.

రాజా—మార్వాడీయింటిసమీపమున నాతో మాటాడిన వ్యక్తియెవ్వరు?

రాము—మా నాయకుఁడు.

రాజా—శ్యామలను దొంగ లెత్తుకొనిపోవుచుండిరని తెలిపినవా రెవ్వరు?

రాము—నేనే.

రాజా—అట్లు చెప్పితి వేమి?

రాము—సుభద్రను మే మపహరింపవలయునని పన్నుగడయది. అట్లాలోచించుటచేతనే నీవుంగర మిచ్చితివి. కాని సుభద్రను నీవంతకుముందే దాఁచియుంచుటచే మాయాశ నిరాశమైనది. గడుసుదనమునకు బోయి చేజిక్కిన శ్యామలను గూడ విడచుకొంటిమి. కాని మరుక్షణముననే తిరిగి బంధించివైచితిని.

రాజా—మంచిది, మిమ్ము నాశక్తివంచన లేకుండ రక్షింపఁబ్రయత్నింతును. రండు. కుక్కుటేశ్వరాలయములో నున్న బైరాగిని గలిసికొందము. మీమాటప్రకార మక్కడ మీ నాయకుఁడు బంధింపబడియుండునుగదా? మీకుట్రచే నాతఁడు బంధింపఁబడినట్లాతని కనుమానము దట్టకుండ బంధింపఁబడిన మీరుగూడ వానికండ్లబడుట మంచిది. మిమ్ము గూడ వానితో జేర్చి ప్రత్యక్షముగా వైరముజూపి చాటుగా నుపకారమొనర్తును. అగును శ్యామలయు గాంతమ్మయు నెటనుండిరి.

రాము—విలాసోద్యానవనమున.

రాజా--అట మీయనుచరు లెందఱుండిరి?

రాము—మాబ్రదుకు స్థిరపడినవెనుక యనుచరుల నేర్పరచుకొనదలంచి- ప్రస్తుతము మేమే కార్యక్రమమునకు గడంగితిమి.

ఆతరువాత వారేమియు మాటాడకుండ కుక్కుటేశ్వ రాలయమునకు వెడలి యట బైరాగిని గలిసికొని యొకరికొక రెత్తింగించుకొని సంతసించి తమ ప్రయత్నముకొనసాగినందు లకు సంతసించి యాముప్వురను మిగుల గట్టిదిట్టముగా బంధములలోనుంచి దగిన కాపుదలయుంచి యారేయియే విలాసోద్యానవనమున కరిగి శ్యాములను, కాంతమ్మను దోడితే నభిలాషతో సాయుధులై బయలుదేరిపోయిరి.

చదువరీ! మనముగూడ వారివెంట బోదమురమ్ము.

# ఏడవ ప్రకరణము.



విలాసోద్యానవనము.

"ఇంటిపేరు కస్తూరివారు, యింటిలో గబ్బిలపుపెంట" యనినటుల విలాసోద్యానవనమను గొప్ప పేరేగాని యది యొక తాటితోపు. అందే యొక కల్లుపాకవంటి తాటియాకు ల పాకగలదు. పగలాపాక రక్షణార్థమై రాముఁడో, భీముఁ డో, లేక వారియనుచరుఁడో నుండును. రేలందు సంచారము చేయుదురు. ఆపాకయందేమున్నదియో యేరికిని తెలియదు. ఆపాకలో నేమేని చిత్రము లుండకుండబోవునా? చూతము.

రాజారావును, బైరాగివేషమున వచ్చిన డిటెక్టివును, గోవిందును, లాలాయును గలిసి తిన్నగా నీవిలాసోద్యానవన మునకు వచ్చిరి. రెండవ డిటెక్టివుపేరు నరశింహాము. ఈతం డిదివఱకొక మారీయుద్యానవనము జూచియుంటినని చెప్పి నట్లు పాఠకులు చదివియేయున్నారు. ఏతత్కారణమున వారించుకంతయు దడుసుకొనకుండ నటకువచ్చిరి.

మునుముందు నరశింహామా తాటియాకులపాకలోనికి బోయెను. ఆవెనుక రాజారావు వెడలెను. తక్కినవా ఱిరువు రును వారి ననుసరించిరి.

నరసింహా మాముువ్వుర నొకచో నిలిపి:—

ఇదిగో! ఇదియే విలాసోద్యానవనము. దీని కీనామ మున్నట్లు గ్రామస్థు లెవ్వ రెఱుంగరు. ప్రస్తుత నివాసయో గ్యముగా నీహంతకు లీరహస్యస్థలంబును జూచుకొనిరి. వీరి యాశయములన్నియు దీనివెనుక వీరెచ్చటకు బోవసంక ల్పించుకొనియుండిరో మనకింకను దెలియదు. ఈపాకయం దేమియు మనకు గన్పడదు. ఇందొక గుప్తద్వారమున్నది. అది కనిపెట్టినచో లోననొక భూగృహములోనికి బోవచ్చును. నిన్నటిరేయి నేనందు బోయితిని. అందొక వృద్ధాంగన బంధిం పఁబడియున్నది. ప్రాయశః యామెయే నీసోదరి యత్తగారని భావింతును. ఆగూఢద్వార మేనెఱుంగుదును. దానిగుండ మీరుముువ్వురును లోనికి వెడలి యామెను దోడ్కొనిరండు.

ఉన్నచో చిరంజీవి శ్యామలనుగూడ దీసికొనిరండు. నే నీ ద్వారము చెంతనుండి వైరులెవ్వరైనఁ జనుదెంచుచుండిరేమో గనిపెట్టుచుండెదను. అట్టిసంశయ మేదియైనఁ గలిగినచో నే నీలవైతును. వెంటనే మీరు బయటకురండు. ఆలసించుటవలనఁ బ్రమాదముగలదు. వేగ లోనికిబోయి మీపనిమీరు జక్కపెట్టుకొనిరండు. అని నరసింహ మనెను.

అదిగాదు. మీరొకరూ రీరహస్యద్వారముగుండ లోనికిబోయి, మాయత్తగారిని జూచియుంటిరి గాన మావెంట మీరురండు. లాలా యీద్వారముఖంబున నుండును. గోవిందు పాకవెలుపల పహరా నిచ్చుచుండును. డజనుమందినైనను వారిరువు రాపగలరు. మీరంతయు నెఱుంగుదురు గనుక రక్షించి వెనుకవలసినపని యుండదు. వెంటనే యామెతో వెలుపల బడవచ్చును. రండు మనమిరువురము లోనికి బోవుదము. అని రాజారా వనియెను.

అట్లయిన నొకపనిచేయుఁడు. ముందీయిరువురను లోనికిబోయి చూచిరమ్మనుడు. మన మీవలనుందము. వీరే యామెను దోడ్కొనివత్తురు. తరువాత నగత్యమైనచో-చూడవలయునను ముచ్చటయున్నచో మనముబోయి చూచివత్తము. కాదందురా ?......

అట్లయిన మరియు మంచిది. సేవకులచే దీరు కార్యమైనచో యజమాని కష్టపడ నెందుకు" అని రాజారావని

లాలా గోవిందులతో నిట్లనియెను.

మీరు గుప్తద్వారముగుండ లోనికరిగి యందున్న కాంతమ్మగారి సేవలకు దోడ్పడుచుండుడు. మా శ్యామలగూడ నందున్న నామెను దోడ్కొనిరండు. వారుగాకింకెందు నెవ్వరున్నను బాధించి దీసికొనిరండు. మీకు లోగనిచో మమ్ము బిలువుడు" అని యనెను.

రాజారావుగా ! ఇటురమ్ము ఇదిగో నీ వీతాటిస్థంభము నకు జేరబడి- యీక్రింద కనంబడుచున్న పలక నీపాదబల మున ముందునకుం దోయుము-" అనియెను.

రాజారావట్లు గావింప నాపలక యించుక జరిగెను. వెంటనే నరశింహము చేతితో నందున్న మీటనొక్కి సులువుగా మనుజులు దూరుట కనువగుమార్గమును జూపించి దానిగుండ లాలాగోవిందులను లోనకుబంపి మీటవదలెను. అది గుభాలున బడిపోయెను.

రాజారావుగారూ ! మీరింక సేవలకురండు. లోని వారు బిలువగనే మరల మీటదీయుదము. అని నరశింహ మనగనే రాజారావు మామూలుగా సేవలకు రాబోయి కాలిపట్టు వదలెను. పట్టువదలుటతోడనే యాతలుపు గుభాలున జరిగి రెండవకాలు నందు నొక్కివైచెను.

"అయ్యయ్యో ! కాలు నొక్కివేయుచున్నది. నరసింహముగారూ ! చటాలున నీతలుపు దప్పించుడు. త్వరపడు

డు. త్వరపడకున్న కాలు తెగిపోవునట్లున్నది రండు. రండు"
అని మిగుల దీనముగా రాజారావు బిలచెను.

కేవల దేహబలము నమ్ముకొని- బుద్ధిబలము లేని నీవెట్టి
పరిశోధనకు గడంగితివయ్యా! నేనుమాత్రి మిప్పుడా మీకు
తప్పింపగలనా? ఇంతపన్నాగము మేము బన్నినగాని నీవు
చిక్కితివిగావు. నీయనుచరులు పాతాళగృహమున బంధింపఁ
బడిరి. నీవిట బంధింపఁబడితివి. నీవెంత యార్చినను నీసేవకుల
కువినబడదు. నీసేవకు లెంతగింజుకొనినను బైటఁ బడఁజాలరు.

మా నాయకుని, మాయుపనాయకులను బంధించితి
నని విఱ్ఱవీగకుము. వారీపాటికి తప్పించుకొని వచ్చుచుందురు.

నే నీవిలాసోద్యానవనరక్షకుఁడను. ఊర కిరువురు
ముప్పురతో నింతటి దుష్కరకార్యమును సాధింప యత్నించు
టకు మాయజమాను లంత తెలివిమాలినవారనియే భావిం
చితివా?

మీలాలా మాయుపనాయకుల పాదములకు నిగళం
బులు దగిలించుచుండ గ్రహింపనే లేదనుకుంటివా? మిమ్మిం
తవఱకు తేదలచియే వారట్లేమియు నెఱుంగనట్లు నటించి
మీకు లొంగిరి.

మీరల్పజ్ఞానులుగాన నంతమాత్రముననే చంకలు
గుద్దుకొనిరి. మమ్ము చాల బాధించితివి. నీవెంత తెలివిలేని
వాడవైనను- పట్టుదల గలవాడవగుట మాకేకుమేలయితివి.

అందుచేతనే నిన్నిట్లు బంధించి చంపదలంచితిమి. నీవు మ
మ్మనేకవిధంబుల చిత్రవధ జేయింపవలయునని దలంచితివిగాని
నీకోర్కె దీరలేదు. ఇప్పుడు నిన్ని స్తంభమునకు వెడరెక్కలు
విఱచికట్టి- నీనడుమునకుఁజుట్టు నొక గజమావరించునట్లున్న
నినుపచట్రము బెట్టి నీపాదముల మొదలు మొలవఱకు- నూని
వస్త్రంబులంగట్టి యుంటింతును. మీరు వాక్సూరులుగాన మా
టలతో సరిబుచ్చితిరి. మేము నీవలె వాగాడంబరము గల
వారముగాము. క్రియాశూరులము. ఇదిగో జూడుము. మేము
చెప్పినంతపనియు చేతుము. దిగువభాగమంతయు గాలి బొబ్బ
లెక్కినతరువాత నాబాధ నీవు రేపటివఱ కనుభవించినవెను
కపైభాగముగూడ నదేవిధముగానంటింతును. బాలికా! మమ్ము
బాధింపయత్నింతువా? నీవీ కార్యమునఁ జొరకుమని నిన్ను
హెచ్చరింప వినకుంటచే నీకిట్టి దుర్గతిబట్టినది. చచ్చుచుంటి
విగాన దైవప్రార్థన జేసికొమ్ము"

అని రెక్కలు వెనుకకు విఱచికట్టి నూనివస్త్రములు
దెచ్చి మొలకు గట్టుచుండెను. విషణ్ణవదనముతో:—

ఓయీ! మేము నీకృత్రిమము గనిపెట్టజాలక పోయి
తిమి. అందులకు దగినఫల మనుభవింప సిద్ధముగా నుంటిని.
నాబుద్ధిలేమి కిశిక్ష నేననుభవింపవలసినదే. ఇఁక బ్రదుకుదు
ననునాశ నాకు లేదు. ఎట్లను జచ్చుచుంటినిగాన నాకడసారి
కోర్కెదీర్పుము. అట్లుదీర్చెదవేని నేను నిశ్చింతతో జత్తును"
అని రాజారావనియెను.

"సరే. అడుగవలసినదడుగుము" అని కట్లు కట్టుచు నే నరశింహామనెను.

రాజా—నీవు హంతకులలోనివాఁడవే గనుక రాముఁడును భీముఁడును మాకెఱిఁగించినదొంగల చరిత్రి సత్యమైన దేనా?

నర—కధయంతయు సత్యమేగాని కొన్నిమార్పులున్నవి.

రాజా—ఆమార్పు లేమియో చెప్పుదువా?

నర—మాయజమానియాజ్ఞ లేదు చెప్పను.

రాజా—చచ్చుచున్న నాకెఱిఁగించినచో మీకేమి ప్రమాదము?

నర—నీవు చచ్చినతరువాతనైన- నీబూడిదకైన- తద్రహస్య మెఱింగింపము.

రాజా—పోనిమ్ము. సుభద్రి మీనాయకురాలగునో కాదో చెప్పఁగలవా?

నర—ఆమెయే మానాయకురాలైన మీచేతులలో నింతకాలముండునా?

రాజా—అట్లయిన మాశ్యామలయా మీనాయకురాలు?

నర—నీయెట్టయెదుటామెనుగూడ గాల్చివైతుము. అంతటితో నీసందియము దీరును.



నరసింహాము విడచిన యగ్గిపుల్ల కిరసఁనూనమీఁదఁబడి భగ్గుఁమఁడి...

............... ఆమంట లంతకంతకు సమీపించుచుండెను.

(చూ. 221 పేజి)

రాజా—పార్వతి దోషురాలా?

నర—కాదు.

రాజా—పోనీ నారాయణస్వామి మీనాయకుఁడేనా?

నర—కాదు. దోషులని వారి నిరువురను నరిదీయింపు మేమాయెత్తు నెత్తితిమి.

రాజా—మీ నాయికానాయకుల పేరు లెఱింగించి నన్ను గాల్చివేయుము. నీకు పుణ్యముండును.

నర—దొంగ-దొంగపేరు లేగాని నిజము గుపేరు లెఱింగింపఁడని నీవెఱుంగవా? ఇఁక నన్నుఁ బ్రశ్నింపకుము. మా యుపనాయకులు వచ్చెడివేళ గావచ్చినది. వారు వచ్చువఱకు నీవు గాలుచుండవలయును. నీవు గాలుచుండఁగా వారు చూచి రేని నాకెనలేని బహుమానమిత్తురు. ఇఁక లేనిపోని యడియాసలకుఁబోవక- నిశ్చింతగా భగవంతుని బ్రార్థింపుము. నేను మానాయకులకంటె మంచివాఁడనుగనుక నీకింత సమయమిచ్చితిని. కానిమ్ము. తరువాత శరీరబాధతో దైవ ప్రార్థన జేయఁజాలవు.

ఇట్లని పెద్ద యినుపచట్రము దెచ్చి యాతనినడుము చుట్టును దగిలించి, యావెనుక నొక కఱ్ఱముక్కకు గొన్ని గుడ్డలు చుట్టి యది నూనెలోదడిపి యది యంటించుచు:—

ఏమి రాజారావూ! నీదైవప్రార్థనమైనదా? నీచెల్లెలి మామగారు గతించిననాఁటిరాత్రి నీలాంబరధారులమై యా

యుంటి పరిహారిగోడదాటుచు "రాజా! రెండుమూఁడు దిన ములలో నీమరణశాసనము తయారుజేసుకొమ్మ" అని హె చ్చరించితిని. నీవు వింటివిగావు. సరే. ఇప్పుడైన దైవప్రార్థన ముగిసినదా? లేదా?

"ఢాం. ఢాం".

అని రెండు పిస్తోలులు వరుసగా పేలినధ్వనియును, ఆదెబ్బలుతిన్నవారార్చిన యార్పులును భూనభోంతరాళ ములు బద్దలయినట్లు వినంబడియెను.

రాజా! ఈయకాలపరిశయమేమో చూచివచ్చి నీ పనిబట్టెద. భగవంతుఁడింకొక యైదునిమిషములు నీకు గడు వొసంగినాఁడు."

ఇట్లని చేతిలోనున్న "కాగడా" బట్టుకొని వెలుగు చున్న యగ్గిపుల్లలు బారవైచి దబాలున బాకవెలుపలకు బోయెను.

అదృష్టమున్నవా డంభోధిమధ్య నిరాధారుఁడై బడి నను మెట్లో బ్రదికి బయటబడును. దురదృష్టవంతుఁ డరి కాలుదడియని నీళ్ళలోబడియు గ్రుక్కెఁడు ప్రాణమును విడ చివైచును. సర్వశక్తిమంతుఁడైన పరమేశ్వరుని నియామక మెవ్వరెఱుంగుదురు. నరశింహామువిడచిన యగ్గిపుల్ల కిరసన నూనెమీదబడి "భగ్గున" మండి యటనున్నగుడ్డ యంటు కొని రాజారావువైపు రాజొచ్చెను. ఆమంట లంతకంతకును

సమీపించుచుండెను. కదలుట కవకాశములేని రాజారావు కన్నీరు విడచుచుండెను.

# ఎనిమిదవ ప్రకరణము.

ఈనీలాంబరుఁ డెవ్వఁడు.

నరసింహము మీఁదకువచ్చి కాగడావెలుగున నిటునటు పరిశోధించుచుండెను. వెలుపలనంతయు గాఢాంధకారమే. చీకటిలోనున్న వారాదీపము వెలుగున దనకు గన్పింతురా? కాని చీఁకటిలోనున్నవారికి తాను విధిగా కన్పడితీరును. ఈ సంగతి యాతండుఁ డూహించుకొనలేదుగాఁబోలు.

ఆతఁడట్లు చూచుచుండఁగనే మిగుల సమీపమున "ఢాం" మని పిస్తోలుప్రేలెను. "హా" యని నరసింహము నేల వ్రాలెను.

"బావా! చీఁకటిలో గొట్టుటచే భీముఁడు గలించెను గాని రాముని పిక్కకు దెబ్బతగిలి క్రిందఁబడినాఁడు. ఇక్కడీదొంగడిటెక్టివు నరసింహముగూడ దెబ్బతిని, క్రిందఁబడి నాఁడు. ఈతనికిని తొడలకు దిగువభాగముననే దెబ్బతగిలి నది. రమ్ము. రమ్ము. లోనికిపోయి మనవాండ్రను విడిపింతము రమ్ము.

అని యిరువురుయువకులు బిలబిలలాడుచు లోనికి జొరబడిరి.

సరిగా యాక్షణముననే రాజారావు శరీరముపైనున్న నూనెగుడ్డ లంటుకొనుట ప్రారంభించెను. లోనికివచ్చిన యిద్దరదిగాంచి చిటికెలో సంగతి గ్రహించి యచ్చటనున్న యిసుక గబగబ చేతులతోనెత్తి యాతనిపైఁ బోయుచుండిరి.

రాజారావు దేహస్మృతిలేక యఱ్ఱెత్తుచుండెను.

నిముషములో రాజారావు నాభివఱకు నిసుక గుట్ట యేర్పడిపోయెను.

భగవదనుగ్రహమువలన రాజారావకాలమృత్యువాత నుండి రక్షింపఁబడెను.

తరువాత నాయిసుక దీసివైచి- యావెనుక నూని గుడ్డలువిప్పి- యినుపచట్రము దొలగించి యాతనినొక సమున్నత స్థలంబునఁ బరుండబెట్టి వెలుపలకువచ్చిరి.

వీరికి సహాయులుగావచ్చిన పోలీసువారు దెబ్బలుతిని పడిపోయిన యాముగ్వురను బాకసమీపమునకు జేర్చిరి. యీయిరువురును వెడలి వారిని బరీక్షించిరి. వారనుకొనినట్లు భీముఁడీలోకమును విడచిపోయెను. రాముఁడును నరశింహమును జావలేదుగాని కాళ్ళపై దెబ్బలు తగులుటచే నశ్లె బడియుండిరి."

వారిని జాగ్రత్తగా చూచుచుండుడని వారికిజెప్పి వారిలో నిర్వురను దీసికొని రాజారావు చెంతకు వచ్చిరి. రాజారావున కప్పుడే స్పృహవచ్చెను. కండ్లుదెఱచి చూచెను.

"కొంచెము మంచినీళ్ళున్నవేమో జూడుడు." అని రాజారావనెను.

వెంటనే వారాప్రాంతమెల్ల వెదకి కట్టకడపట కొక కుండలోనున్న నీళ్ళు దాహమిచ్చిరి. ఆదాహముత్రాగి యించుక తెప్పిరిలి యొకక్షణ మూరకుండి కూర్చుని—

"మీరీ యాపత్కాలమున నిక్కడి కెట్లువచ్చిరి" అని రాజారావనెను.

మీరు మమ్మట గాపుంచి యిటువచ్చిరి. వారు బంధములలో నుందురుగదాయని తలంచి మేమావలకు బోయి గోడవెనుక నక్కితిమి. మాకోర్కె ఫలించినది. అందొకఁడు రెండవవానితో నిట్లనియెను.

"ఓరీ! మన నరశింహము రాజారావును జంపితీరును. మిగిలినవారిని బంధించుటో- వధించుటో జరిపితీరును. నిజముగు నేరస్తులే యనుకొని సుభద్రానారాయణస్వాముల నురితీయుదురు. ఇంతటితో నీకథ యీవిధముగా ముగియును. తరువాత మన నాయికానాయకులను గలిసికొని సుఖముగా బ్రదుకవచ్చును."

ఇట్లు చెప్పుకొనుచునే సంకెళ్లు విప్పుకొని యీవల బడిరి. అప్పుడే మీరుచెప్పిన పోలీసువారు వచ్చిరి. "మా వెంటరండు" అని వారిని హెచ్చరించి వారిని వెన్నాడితిమి. అట్లు వెన్నాడుచునే మాపిస్తోళ్ళ లోడింగుజేసితిమి. అలవాటు లేనికారణమున నించు కాలస్యమైనది. ఎట్లో లోడింగుచేసి కొట్టితిమి. భీముఁడు భీమనాద మొనరించి గతించెను. రాము నకు జట్టు విరిగెను. నూతనడిటెక్టివు నరశింహామా యలికిడి విని కాగడాతో నీవలకు వచ్చి మాచే దెబ్బతిని భూదేవికి సాష్టాంగనమస్కార మాచరించెను. మేము లోనికి వచ్చి చూడ మంట లప్పుడే నిన్ను ముట్టుకొన బ్రారంభించెను. వాని నార్పితిమి.

ఇంతకును దైవము మాపట్ల నున్నాఁడు గనుక నీవు జీవించితివి. నిముష మాలస్యమైనచో మాప్రయత్న మడవి గాచిన వెన్నెలయయిపోవును. పరమేశ్వరుఁడే లేనిచో బా పాత్ములకు జయము లభించితీరవలసినదే. బావా! నీయ నుజ్ఞ లేకుండ నేనొక కార్యమాచరించితిని క్షమింపు. "నిజ మగు నేరస్తులే యనుకొని సుభద్రానారాయణస్వాముల నురితీయుదురు" అను దొంగవార లనుకొనుటచే మాచిన్న వదిన కీవ్యవహారమున జోక్యము లేదని యామెకుగూడ బురుష వేషమువైచి దీసికొనివచ్చితిని. అందుకు క్షమింపుము. నీవెంట వచ్చిన లాలాగోవిందు లేరి? అని పార్వతి యడిగెను.

చదువరీ! రిచ్చపడకుము. గోవిందుఁడు కూరగాయ లమ్మువాఁడై పార్వతిని దప్పించిన విషయమును సుభద్రియు నికి తెలియక- దొంగలును పోలీసువారును గూడ తహతహ బడుచుండుటయును—"సుభద్రితో నీమెను జేర్పుము." అని పెట్టెలకు తాళములు గట్టువానివేషమున రాజారావు గోవిందున కిచ్చిన యుత్తరముసంగతియును నింతలోననే మరచిపోదువా? అట్లు మరచిపోవనియే యాసంగతి ప్రత్యే కించి చెప్పలేదు.

జీవితేశ్వరీ! నిన్నిప్పుడు జీవితేశ్వరీ యని నోరార బిల్చుకొనుటకు నాకు సంపూర్ణమగు హక్కుగలదు. పోకుం డ నీవు నిల్పుకొనిన నాప్రాణములకు నీవే యధీశ్వరివి. ఆ నరశింహహంతకుని నిక్కమగు డిటెక్టివనియే నమ్మితిని. నమ్మి మోసపోయితిని. లాలాగోవిందుల నిర్బరను పాతాళగృహ మున కనిపితిని. అందుండి తప్పించుకొనునప్పుడే నాకాలాము రలో బడినది. అది యాధారముగా గొని యాదుర్మార్గు డింత జేసినాఁడు. పాతాళగృహములో నీపెద్దవదినెయు, మీయమ్మ గారును నిర్బంధింపఁబడియున్న మాట వాస్తవము. ఈకథ కంతకును నాయకు లెవ్వరో యిప్పుడు మీకెల్లరకును దేలి పోయియుండవచ్చును. ఈయొక్కక్షణము దాటినచో నాబల వన్మరణము- సుభద్రియురి జరిగిపోవును. నీగతి యేమగునో యెవ్వరు చెప్పఁగలరు? మీయంబయు, మీవదినెయు జచ్చిన

వారిలోనే జమకదా ? అనుకొన్న ట్లీవిధముగానే జరిగినచో యీతీసివేతలో మిగిలినవారు లాభప్రాప్తికై నిరీక్షించియుండిరని తేలుచున్నదిగదా ?

ఆవిషయమై మనము తరువాత నాలోచింతము. మును ముందు మనవాండ్రను దప్పింపవలయును. దెబ్బలుతిన్నవారు మరల పారిపోవుట కవకాశము లేదుగదా ?

"అట్టి యాశ వారికిం కీజన్మమున లేదు" అని సుభద్ర యనెను.

సరే. దీనిని తెఱచువిధాన మాహాతకునివలన నెఱింగితిని. ఈమాగు జాగ్రతగాఁ దెఱుతమురండు.

అని యించుక శ్రద్ధతో గమనించి వెనుకటియట్లే దానిని దెఱచి యది మరల పడిపోకుండునట్లు త్రాళ్ళతో బిగించి యాముగ్గురును లోనికి దిగిరి.

ఆలోపల పాడువడిన గదులు మూఁడుమాత్ర మున్నవి. వానికి తాళములు బిగింపబడి యుండలేదు. లాలాగోవిందు లిరువురు బిచ్చివారివోలె బచారుసేయుచు వచ్చినవారిని జూచి:—

బాబూ ! బ్రిదికి బయట బడితివా ? పైనజరిగిన యల్లరియంతయు జెవులార వింటిమి. కాని యేమిచేయఁగలము? మేము పైకివచ్చుట కాధారము లేదు. యిక్కడ బడి యుంటిమి. కాంతమ్మగారు జీవచ్ఛవమై యొకచో బడియున్నా

రు. శ్యామలాంబగారొక గదిలో వాలఖిల్యపక్షివలె తల క్రిందుగా వ్రేలాడుచుండిరి. ఆమెను విడిపించితిమి. ఆ యిల్లాలత్తగారి సమక్షమున గూర్చుండి వెక్కివెక్కి యేడ్చుచున్నది. దయచేయుఁడు."

అని యామువ్వుర నాగదిలోనికి దోడ్కొనిపోయిరి. ఒకరినిచూచి యొకరు బారుమని యేడ్చిరి. స్త్రీలదుఃఖమునకు బరిమితి లేకుండెను. రాజారావు, లాలా, గోవిందు లానల్వుర నెట్లో కృత్యాద్యవస్థ మీఁద నూరడిలజేసి వెంటనే వారిని వెంటఁబెట్టుకొని పైకివచ్చి గోవిందుని, యొకరక్షకభటుని యటగాపుంచి దెబ్బలుతిని పడినవారిని, చచ్చినభీమునిగూడ గ్రామములోనికి దోడితే భటులకాజ్ఞాపించి తక్కినవారెల్ల నర్ధరాత్రి మీరునప్పటికి పిఠాపురముచేరి యొకరహస్యస్థలంబున విడిసిరి.

సరిగా నాక్షణముననే యొకనీలాంబరధారుఁ డాయింటిచుట్టు బ్రదక్షిణమాచరించుచు నెట్లైన లోనికిబోవలయునని విశ్వప్రయత్న మొనర్చుచు నెట్టకేల కొకతలు పించుకనొత్తిగింపఁగలిగెను కాని యాద్వారము తనపుట్టి మునిగిపోయినట్లు "కిట్టు" మని శబ్దము జేసెను.

ఆపత్సమయములో నున్న కారణమున నాయింటిలోని వారెవ్వరును నిద్రించుట లేనికారణమున నాశబ్దమెల్లరును వినఁగలిగిరి. వెంటనే రాజారావు శ్యామలకును, సుభద్రా

పార్వతులకును నాజ్ఞయొసర్చి సిద్ధముగనుండుడని హెచ్చ రించి పిస్తోలుచేఁబట్టి వీధిలోనికి రాదొడంగెను. ఆయలికిడిగని పెట్టి నీలాంబరధరుఁడు పలాయనసూత్రమవలంభించెను. అది చూచి రాజారావు వెన్నంటెను. ఇంతవఱకు బురుషవేషమున నేయున్న పార్వతిగూడ వానిననుసరించెను. అనువ్వురును నొకరివెనుక నొకరు బరుగిడుచుండిరి.

కొంతదూర మరుగునప్పటి కేదియో యుత్సవమెదుర గుటచే నానీలాంబరుఁడు ముందుబోవుట కవకాశము లేక యిం కొకవైపు మరలి చటాలున నొకమొండిగోడదూకి లోనఁబడి యెను. మొదటివానికంటె మిక్కిలి చురుకుఁగా రాజారావు గూడ నాగోడదూకి లోనబడి యిటునటుజూచెను. చదువరీ! ఆయిల్లెవ్వరిదో గ్రహించితివా?

ఆయిల్లే రఘునాధరావుగారిది. ఆయింటియం దిప్పుడె వ్వరున్నారు? మాధవరావు, రఘునాధరావు, బలవంతరావు లు మృతినొందిరిగదా? కాంతమ్మ, శ్యామల, పార్వతి, సు భద్ర, యామెకుమారుఁడగు కుమారమాధవరావు యింత కొకక్షణము క్రిందటనేగదా యింకొక రహస్యస్థలంబున విడి సియున్నారని చెప్పితిమి. ఇంక కామేశ్వరరావొక్కఁడుమా త్రమే యాగృహమునం దొంటరియై యున్నాఁడు. మనహిం దూలాపరికారమాయావదాస్తికిని యాతఁడే హక్కుదా రుఁడై యున్నాఁడు. కుమారమాధవరావు మైనరు.

రాజారావట్లు చూచుచుండగా నానీలాంబరుఁ డా యింటిలోనికి బోయినట్లు గన్పడెను. వెంటనే తనయనుమానము దీర్చికొనుటకై రాజారావు ముందున కరిగిచూచెను. ఆ సమీపమునందున్న గదినుండి మిణుకుమిణుకుమనుచు దీపపు కాంతి తలుపుసందునుండి కన్పడుచుండెను.

ఆగదియందున్న దీపమాక్షణముననే యారిపోయెను. ఇఁకనేమి యానీలాంబరుఁ డాయింటఁబ్రవేశించి దివ్వెనార్పివైచెనను యనుమానమును ధృఢపఱచుకొని తలుపు గుభాలున గెంటెను. ఆతోపుతో గడియయూడిపోయి తలుపులు విడిపోయెను.

## తొమ్మిదవ ప్రకరణము.

### గాజులచేయి యెవ్వరిది?

"ఎవరువారు?"

"మీరెవ్వరు?"

"కటికచీఁకటిలో నాయింటఁ బ్రవేశించి పైపెచ్చు నేనెవ్వరనని యడుగుచున్నావా? దుర్మదాంధా! నీవు హంతకుడవా? హంతకునకు సహాయుఁడవా?

"నీవు కామేశ్వరరావువా?"

"ఔను, మరి నీవో?"

"నేనపరాధరహస్యపరిశోధకుఁడను."

"శ్యామలరావువా?"

"కాదు. రాజారావును."

"మహాత్మా! నిన్నుజూడవలయుననియే నేనాశించి యుంటిని. నీవు దొరికితివి. ఇఁకీనాఁడు నాచేతులనుండి తప్పించుకొనిపోలేవు. నిన్ను జంపినందులకు నాభార్య నన్ను నిందించినను సరియే. తొలుత నీవు చచ్చినగాని నాభార్య నాకులభింపదు."

"నీభార్య నీకు లభించినజాలునా? కన్నతల్లి గంగపాలై పోయినను సరియేనా?"

"నీవు చచ్చినచో మాయమ్మ,మాచెల్లెలు, మామరదలు, మాకుఱ్ఱవాఁడు, నాభార్య వీరందఱును బైటబడుదురు. నీవే యీకథకంతకును నాయకుఁడవు."

"కామేశ్వరరావూ! ప్రబలమాయోపాయమున నీ రాజారావు నిందుదెచ్చితిని. మీవాండ్రయునికి గనిపెట్టితినిగాని వీఁడుండఁగా వారిని విడిపించుటకష్టము. కలియబడి కత్తితోఁబొడిచివేయుము. సంశయింపకుము. నాపేరు శ్యామలరావు. నేనెన్నియో మాఱువేషములు వేసి వీని నిందుదెచ్చితిని. తరువాత తక్కినసంగతులు చెప్పెదను. ప్రస్తుతము పనిగానిమ్ము."

"ఓమహాత్మా! శ్యామలరావూ! చాకచక్యమున్న మగ

వాఁడవేని నాయెదుటకువచ్చి నేను హంతకుఁడని నిరూపించి నీచేతులతో నన్ను జంపుము.” అని రాజారావనియెను.

“ఆశ్యామలరావుD. S. P. గారిచే నిర్ణయింపఁబడిన నూతన కెక్టివు. నేను స్వయముగా కాకినాడవెడలి వారిని దర్శించి గోరుటచేదారగారీతని నిందురహస్యముగా బంపించిరి. ఆతఁడిందువచ్చి విశేషశ్రమతో నిన్ను గనిపెట్టెను. నీవింక పారిపోజాలవు. నిన్ను బలవంతముగాబట్టి చంపకమానను. ఇట్లనుచు కామేశ్వరరావు దీపమును వెలిగించి వెంటనే వానిపై గలియబడెను.

ఎట్లయినను ఘోటకబ్రహ్మచారియగు రాజారావు కామేశ్వరరావుకంటె బలవంతుఁడగుట కామేశ్వరరావును వెంటనే క్రిందఁబడవైచెను.

కామేశ్వరరావెంతబలహీనుఁడైనను రాజారావునకు లొంగుటలేదు. ఇరువురును బెనుగులాడుచునే యుండిరి.

దురాత్మా! నిన్నింకదాటిపోనిత్తునా? నారహస్యస్థలము నుండి నిన్నింతవఱకు దరుముకొనివచ్చి యూరకపోనిత్తు నను కొంటివా? ప్రత్యక్షముగా గనపడిన హంతకుని విడచుటకు నేనంత బుద్ధిలేనివాఁడననుకొంటివా? నీకు సంకెళ్లువైచి- నీపైనున్న నేరములన్నియు ఋజువుజేసి న్యాయస్థానమున నీకురిశిక్ష విధింపజేయకున్న నన్ను రాజారావని బిలువకుము.

ఇట్లనుచునే యాతనికి సంకెలలు దగిలింపబోయెను.

"అన్నా నన్నుఁజూచియైనను నీ బావను క్షమింపవా?" ఇట్లనుచు దడాలున శ్యామల వచ్చి రాజారావు పాదములపై వ్రాలెను.

"చెల్లీ! ఇప్పట్లహంతకులు మన తండ్రిగారైనను నిర్దాక్షిణ్యముగా నురికంబ మెక్కింతును. అట్టియెడ బావయని యీతని క్షమింతునా? ధర్మముముందు బాంధవ్యము నా కెంతమాత్రమును గాన్పించదు." అని రాజారావనియెను.

"నాప్రార్థన చెల్లింపవా?"

"చెల్లింపను."

"నీవు నాపసుపుగుంకుమ చెడగొట్టి—నన్నధోగతిపాలు జేయ సంకల్పించుకొంటివి గాన మన బాంధవ్యమునకు జలాంజలి యొసంగి నేను నిన్నెదుర్కొనుచున్నాను. ఏది యెట్లున్నను—నాసతీధర్మమును నేను బాలించుకొని—నాపతిని నేను రక్షించుకొనుట నాకు ధర్మము. నీవు వానిని విడువకున్న నిన్నీకత్తితో బొడిచివైతును."

ఇట్లనుచు శ్యామల కత్తిబట్టి రాజారావుపై కురుకబోయెను.

చటాలున వారి కిరువురకును మధ్యనింకొక వ్యక్తియడ్డము వచ్చి శ్యామల వక్షస్థలమునకు బిస్తోలు గురిచూపి:-

"వదినా! నీభర్తను గాపాడుటకై నీ వెట్టిధర్మమును దలంచి యీకౄరకృత్యమునకు సంసిద్ధురాల వైతివో—

అక్కో—ఆధర్మమునే దలంచి—నాభర్తయగు రాజారావును రక్షించుకొనుటకై నిన్నడ్డుకొనుచున్నాను. కాలు కదపితివా నీవే ముందు గడతేరుదువు. మాటాడక కత్తి వాల్చుము." అని పార్వతియనెను.

"పార్వతీ! నీయన్నగారి బలవన్మరణమున కీవంకీకరింతువా?"

వదినా! నీయన్నగారినే నీచేతులార చంపనుంటివే. అది ధర్మమా?"

"ఆతఁడు నాకొంప నమాంతముగా గూల్పదలచెను"

"మీయన్న తలచెను గాని—మాయన్న చేసిన దురంతములకు లెక్కయున్నదా?

"అగుగాక—నే నుండఁగా నాభర్తపై నీగవాల నీయను"

'"త్రాఁచుబామును రక్షింపరాదు. తన్ను గన్నతండ్రిని జంపి—తల్లి ననేకగతుల నేడ్పించి—మూలవిరాట్టగు తాతగారిని బోగొట్టి—తమ్ముని బలవంతముగా జంపిన పాపాత్ముని రక్షింతువా? నీవింత విశ్వాసముతో నుంటివి గదా? నీయం దాతని కావిశ్వాసమున్నదా? ఉన్నచో నిన్ను నిర్బంధింపఁగలఁడా?"

"మరదలా! నీమాటలు నాకు వినఁబడవు? నామగని నేరక్షించుకొనక మానను."

"అట్టి యుద్దేశము నీకున్న నీయాయుర్దాయ మింతతో సరి" అని పార్వతియనెను.

"మీనల్వురకును నేటితో యాయుర్దాయము సరి" ఇట్లనుచు నొక భీకరాకారుఁడగు నీలాంబరధారుఁ డటకు వచ్చెను.

ఆతనిని గాంచి శ్యామల పార్వతు లిరువురును బారి పోయిరి. రాజారావు కామేశ్వరరావును విడచి యాతనిపైఁ బడి చేతనున్న పిస్తో లమాంతముగా లాగుకొని యాపిస్తోలు పిడితో బలవంతముగా ముక్కుపై గొట్టెను. పాపమంత బలవంతుఁడును నాదెబ్బతో గిరగిర దిరిగి పడిపోయెను.

ఆతఁడు బడిన యుత్తరక్షణముననే మరల గామేశ్వరరావుతో గలియబడియెను. ఇంతలో నింకొక నీలాంబరధారుఁడు ప్రక్కఁగా బ్రివేశించి "రాజూ! చచ్చితివి" అనిచేతనున్న కత్తిసూటిచూచి విసరివైచెను. హెచ్చరిక వినుటతో డనే రాజారావు జటికిలబడియెను. ఆదెబ్బతో రాజారావు నడచివేయుదమని ముందునకు వ్రాలుచున్న కామేశ్వరావు ప్రక్కలో నాకత్తి పిడివఱకును దూరిపోయెను. హాహాకారములతో గామేశ్వరరావు పడిపోయెను. అది గనిన వెంటనే యానీలాంబరుఁడు పారిపో జొచ్చెను. వానిని రాజారావు వెన్నంటెను.

ఒకరు ముందును, రెండవవారు వెనుకను మిగుల పట్టు

దలతో బరుగిడుచుండిరి. ఇంకను చీఁకటి మిగుల దట్టముగా నున్నది. కాని తెల్లవాఱుట కింకెంతకాలమో లేదు. ఆ చీఁకటికి తోడు నాఁడు పొగమంచు గూడ సమృద్ధిగా లేచెను.

తెల్లవారినచో శనివారము. ఆనాఁడు పశువులసంతే యగునని పాఠకమహాశయు లెఱుంగుటయే గాక క్రిందటి శనివారమునాఁడే రఘునాధరావుగా రిఁట దురంతములు జరుగుటకు ప్రారంభమనియు నెఱింగియే యుండిరి.

నాఁటిసంతకై తూర్పునుండి పశువులు విస్తారముగా వచ్చుచుండెను. ఈ త్రోవనైనచో దొరకిపోవుట కవకాశములు దొరకునని యో యేమో పల్లమునకుఁ దిగి చేలగట్లుబట్టి పారిపోవుటకై సంకల్పించుకొని యాముందు పారిపోవువ్యక్తి పల్లమునకు దిగబోయి బోర్లపడిపోయెను.

వెన్నాడిన రాజారావదిగాంచి:—

"దొంగా దొరకితివి." అని చేయి బట్టుకొనెను.

దురాత్మా! ప్రాణములతో నీకు దొరకను. ఇట్లనుచు నే కత్తితో గఃభీముని గుండెలలో బొడుచుకొనియెను.

రాజారావా కత్తి నెట్లయినను బట్టుకొనవలయునను కొని యత్నించి చేయి విసరెనుగాని యాచేయి కత్తిపైబడక యాదొంగచేతి మణికట్టుపైఁబడి యాచేతినున్న యొకటి రెండుగాజులు చిట్లిపోయెను.



# పదియవ ప్రకరణము.



## కాలసర్ప మెవ్వరు ?

క్రమక్రమముగాఁ బొగమంచు విడిపోవుచున్నది. కొద్దికొద్దిగా మనుజులను గుర్తించుటకు దగిన యవకాశము గలుగుచున్నది.

రాజారావా గాజులు చిట్లిపోయిన చేయి నట్లే విడువకుండఁ బట్టుకొని "ఈగాజుల చేయి యెవ్వరిదా ?" యని యాలోచించుచు—ఆవచ్చియు రాని వెలుతురులో నావ్యక్తి వదనమును నిరీక్షించిచూచెను.

ఆవెలుతురులో నావ్యక్తి యెట్లు గాన్పించుచున్నది ?

శిరస్సున కొకకుచ్చు తలపాగయున్నది. ఆకస్మికముగా గ్రిందఁబడుటచే నా"పాగ" యించుక సడలియున్నది. ఫాలమునఁ జక్కగా దీర్చి దిద్దిన నిలువునామ మున్నది. ఒడలినిండ నీలి "లుంగీ" ధరింపఁబడియున్నది. పాదములకు రబ్బరుజోడున్నది. నూనూగుమీసమూ వదనమండలమున కొక శోభగూర్చుచున్నది.

"ఈమీసములు 'కత్తెరదెబ్బ' తినకుండ నున్నచో నీవదనమింకను శోభాయమానముగా నుండి యుండును." అని యాతఁ డనుకొనియెను.

చేతులనున్న గాజులు రాజారావు మనస్సు నూరక కలచివైచుచుండెను.

"వేషమును బట్టి పురుషుఁడా ? గాజులనుబట్టి కాంతయా ?" అని యాతఁ డాలోచించెను. ఆతఁ డీసమస్యను పూర్తిచేయఁజాలకపోయెను.

తన సంశయవిచ్ఛేదము గాకుంటచే నిక నూరకుండ జాలక తలపాగదీసి పారవైచెను. వెంటనే కేశదామము విడివడి భూమిపైబడెను.

ఏమి? పురుషున కింత "జుట్టు" ఉండునా ? ఉండకుండదు. నిక్కమున కీవ్యక్తి స్త్రీయే. సందేహము లేదు. ఈమీసములు కృత్రిమములే. ఇట్లనుచునే చటాలున మీసములపై జేయివైచెను.

"అయ్యో ! నీకు బున్నెముండును. నాగుట్టు వెల్లడిచేయకుము. ఈకథారంభము నుండియు నాకున్నమార్పు నశించిపోవుటచేతనే నేను మీకు జిక్కి బలవంతముగా—అభిమానధననౌట నాకు నేనే ప్రాణములను గోల్పోవుచున్నాను. నాచావుతో మీశత్రుసంహారమైనది. మీరు నన్నింకవమానము పాలుసేయక—అనఁగా మీరైనను నాపాపిష్టి వదనమును జూడక—నారూపు మాపివేయుఁడు." అనుచునే యాతనిచేయి బట్టుకొనియెను.

"...నీవిన్ని విధములగా దింకొక యిన్నివిధముల గోరినను నీగోర్కె చెల్లింపఁబడుట కవకాశము లేదు. నీశవమునైనను న్యాయస్థానము చెంత నల్వురును జూచి...ఛి...ఛీ

యని నల్వురను నీపై నుమియవలయును. అప్పుడుగాని నా హృదయమునకు శాంతి చేకురదు. అప్పుడుగాని హంతను బట్టితిననుకీర్తి నాకురాదు. నీవు పదిమంది కంటఁబడక తప్పదు. నీశవమునకైన నమర్యాద జరుగక తప్పదు." అని రాజారా వనియెను.

"...అయ్యో ! నీవట్లనుట భావ్యముగాదు. నీవిదివఱ కెంతయో నన్నుఁ బ్రేమించితివి. నేను దోషినని యెఱుంగక నీవు నన్ననేక విధముల రక్షించితివి. అట్లు నీవు రక్షించుట కనువగు మార్గములన్నియు నేనే గల్పించితిని. రక్షించుటకు నీకవకాశ మొసంగి —ఆరూపమున నేను నిర్దోషి నని నీవను కొనునట్లు చేసితిని. నీవు నన్నుఁ బ్రేమించిన ట్లీలోకమున నిం కెవ్వరిని నీవు బ్రేమింపలేదు. అట్టి నీప్రేమను—నీవే దిగ మ్రింగి—నన్నవమానపఱుప సంకల్పించుట నీకు తగదు. శరణాగతరక్షణ మవశ్యకర్తవ్యము. నాపై నీకంత—చచ్చు టకు సిద్ధముగా నున్న నాపై నీకంత- కక్ష దగదు."

నీపై నాకెట్టికక్షయును లేదు. నాప్రతిజ్ఞ నేను నిర్వ ర్తించుకొనక తప్పదు. నీశవమునైనను బట్టి దొరతనమువారి వశ మొనర్తు నని D. S. P. దొరగారి చెంత ప్రతిజ్ఞ పట్టితిని. అది చెల్లించుకొనక తప్పదు. నీవు దోషివని తెలియనంత కాలము నిన్ను నేను బ్రేమించియుందును. తెలిసియు బ్రే మించుట కంత తెలివిహీనుఁడను గాను"

ఇట్లనుచు వామిా సములు లాగివేయబోవ:—

"బా—వా—న—న్ను—గా—పా--డ--వా?"

"ఆఁ ఆఁ...ఏ...మి...?...నీ...వు...పా...ర్వ...తి...వా?"

"ఔను...రక్షించుము."

"హా! ఎంతకష్టము! ఎవ్వరిని నాప్రాణాధిక్యముగా నెంచుకొంటినో—నాజన్మ కెవ్వరిని పరమావధిగా నెంచుకొంటినో—ఎవ్వరితో నాకీప్రపంచమున్నట్లు భావించితినో ఎవ్వరు కనపడకున్న జగమెల్ల సర్వశూన్యమైనట్లు భావించుకొంటినో—అట్టి—ప్రేమైకస్వరూపిణి—పా—ర్వ—తి—

"బావా! విచారింపకుము. విచారించుట నినుబోలు ప్రాజ్ఞునకు లక్షణముగాదు. నాయొనర్చిన దుర్మార్గముల కంతులేదు. ఒకప్పుడు నీప్రేమకు నేనధికారిణి నైతిని. ఇప్పుడాప్రేమ నేను తిరిగి వాంఛించుటలేదు గాని—నీకు నాయెడలఁ గలప్రేమను బురస్కరించుకొని—నామర్యాద గాపాడుమని సిన్ననేక విధములగా పాదద్వయంబంటి వేడుచున్నాను."

అబలా!...లేదు...అట్లుచేయుట కవకాశ మెంతమాత్రమును లేదు...నీ—మ—ర్యా—ద—గాపాడుట కెంతమాత్రమును వీలులేదు...నీ...ప్రేమకును...నీ—దుర్మార్గములకును...తగిన ప్రతిఫలము నీకు జూపింతును. అంతకంటె

నే జేయునది—చేయఁగలిగినది—ఇంకేమియు లేదు." అని రాజారా వనియెను.

"ఎట్లు"

"మన మొండొరులము ప్రేమించుకొంటిమిగనుక - నాప్రేమస్థానమవగు నీ కేరూపమున నైననేమి ప్రాణములు విడుచుంటివిగాన- నీ మొదటిగుణములనే దలఁచుకొనుచు - నేనామరణాంతమును- బ్రహ్మచారినై నీయాత్మకు శాంతిగూర్తును. ఇది నీవు నాయెడల జూపినప్రేమకు బ్రతిఫలము. నీ దుర్మార్గములకు దగిన ప్రతిఫల మేమియో నీకెఱింగించియే యున్నాను." అని రాజారావనియెను.

"బావా! నీప్రేమస్వరూపిణి- అవమానము పాలయి పోవ- ఆమె శవముపై బ్రజలెల్ల నుమియుచుండ నీవు కండ్లార గాంచి- సహింపఁగలవా?"

"సహించుట కష్టమే...

"అట్టి కష్టమున కేల గుఱియయ్యెదవు?

"సత్యదీక్షకొఱకు"

ఇట్లనుచునే బలవంతముగా మీసములు లాగివైచెను. ఇప్పటికి వెలుగుకూడ బాగుగా వచ్చెను. ఆవెలుఁగున నావదనమును దేఱిజూచి—

"హా! నీవేనా!" అని రాజారా వఱచెను.

"అగును. విచారింపకుము. నేను పార్వతినని యను

కానిమైననాదుర్మార్గమును వెల్లడింపవను నాసక్తిమెయి నిన్ని ట్లు కడసారిమోసగించితిని. నీసత్యవర్తనమున కెంతేని సంత సించితిని. ఇంతవఱకు నీవిచ్చిన టిలిగ్రాములొకటియు సితా పురమువిడచి బయటికి బోకుండ నేర్పాటులుగావించితిని. అం దుచేతనే బంధుగులెవ్వరును రాలేదు. ఈమారు రావలసిన బంధుగులెవరైన నున్నచో తంతినిచ్చి రప్పించుకొమ్ము. ఈ కత్తిపోటువలన నా బాధ నిమిషనిమిషమునకును హెచ్చు చున్నది. ఈకత్తి బెఱికివైచి నాబాధానివారణ జేయుము.

ఇదిగో! నీ కెఱింగింపవలసిన విషయములు రెండు మూఁడున్నవి. చెప్పుచుంటిని వినుము. నేను నీపెదతండ్రికి మార్తెను గాను. అందుచే నీకు సోదరినిగూడగాను. నేను పం ండ్రెండుదినముల బిడ్డనైయున్నప్పుడు- నీపెదతండ్రి- నాజననీ జనకులను- వారి సహాయులతోసహా- పోలీసుపరముగావిం చి- నన్నుమాత్రమాతఁడు కన్నపుత్రికవలె బోషించెను. నాజనకుఁడు పోలీసుపరమైనతరువాత- గూడెములోని యా స్తి దొరతనమువారిపరము జేసి నిగూఢముగానున్నద్రవ్యము- తనకప్పుడు సహాయమొనరించిన రామునకును- భీమునకును బంచెను. రాముఁడును- భీముఁడును నీకెఱిగించిన దొంగల చరిత్రమంతయు సత్యమైనదేగాని- అందు గొన్ని మార్పులు న్నవి. ఆమార్పులే నీకెఱింగించుచుంటి వినుము. దొంగవాని పుత్రిని బెంచినవానిపేరు రామచంద్రరావని వారుచెప్పిరి.

నాతోడికోడలు తండ్రిపేరు రామచంద్రరావుగనుక నీకు న
మ్మికగుదురుట కై వారట్లు చెప్పిరి. నేను దొంగలనాయకుం
డగు దుర్దమునిపుత్రిని. నాతలిదండ్రులు నాకుంచినపేరు
"కాలసర్పము."

రామచంద్రరావునకు బదులు నారాయణరావనియు
సుభద్రకు బదులు శ్యామలయనియు- నారాయణస్వామికి
బదులు- లక్ష్మణసింగని- మార్చుకొంటినేని నాసహాయులు
నీకు చెప్పిన కథయంతయు సత్యము.

రాజా—సరేగాని నీవు దుర్దమునిపుత్రివగుదువో కావో
సత్యమును గ్రహించితివా ?

శ్యామ—నాకు నమ్మిక గుదురునట్లుగానే వారు
చెప్పిరి. నేను పుట్టిన మూడవదినంబున నొకసర్పము నేను
న్న మంచముపైకివచ్చి బుసకొట్టుట ప్రారంభించినదట. అ
ప్పుడు నాజనకుండమ్మొకో దానినేయ యాయమ్ము నాయీ
దాడను చీరుకొనిపోయి యాపన్నగమును బరిమార్చినదట.
ఇదిగో! ఆయానవాలిప్పటికిని యున్నది చూడుము. అదిగా
క లక్ష్మణసింగు ప్రాయమువచ్చినతరువాత మావాండ్రగూ
డెము ధ్వంసమైనది. ఆతండెట్లో పారిపోయి నారాయణుండను
పేరు మార్చుకొని లక్ష్మణసింగని బిలిపించుకొనుచు- అదృ
ష్టమున్నవాండుగాన కష్టపడి చదివి సర్కిలుయినస్పెక్టరైనాం
డు మేము గలుసుకొనిననాండు యీచరిత్ర మామూలచూ
డముగా నాకెఱింగించినాడు.

రాజా—శ్యామలా! సుమారిఱువదివర్షములు మిగుల గౌరవనీయమైన కుటుంబములో మసలితివిగదా? గౌరవముగా బ్రతుకుటలోగల సుఖము- నీచతగా బ్రదుకుటలోగల హైన్యము నెఱుంగుదువుగదా? చాలవఱకు జనువుకొని ప్రపంచజ్ఞానము సంపాదించితివిగదా? ఇట్టి నీచకార్యమున కేల నొడంబడితివి. కాకిమై కలకాలము జీవించుటకంటె- హంసవై యాఱుఘడియలు జీవించుట యుత్తమమను సత్యవాక్కు నీవు వినలేదా?

శ్యామ—ఏవాక్యమున కావాక్యమే సత్యవాక్కు.
"తలిదండ్రుల ఘనకీర్తిని
వెలయింపగ జేయువాఁడె విమలసుతుండౌ."

అని బుధులాడలేదా? అది సత్యవాక్యము గాదా? నేను "దుర్గముని" పుత్రినిగానా? వీరాధివీర- విజయగండరగండ- దోర్దండమండిత- పురుషకేసరబిరుదాంకితుండగు దుర్గమునకీయాంధ్రదేశమునం దెంతపేరుండెడిదో నీపెదతండ్రియెఱుఁగును. ఆతని యాదువా రెఱుంగుదురు. ఆపేరు మాసిపోవుటకు నీపెదతండ్రియే కారణము. ఆమహానుభావుని సంతానమునైన నే నాతని కీర్త్యున్నతులు నిలుపవలదా? ఆతనికి బుత్రసంతానము లేనిలోపమును నేను దీర్పవలదా? ఆయాశయముతోఁడనే నేనీకార్యమునకు బూనుకొంటిని. నానిజచరిత్ర నాకు తెలిసిననాఁటనుండియు నా

మఱి చెలించిపోయినది. అట్లు చెలించిపోవుట స్వాభావిక మని యనగలవా? జన్మించిననాఁడో, యెప్పుడో చోరహస్తగతమైన బాలుఁడు. ఏపాతికవర్షములకో తిరిగి కాన్పింప ఆమెకు పాలు చేపువచ్చునను పెద్దలవాక్యమును త్రోసివేయగలవా? నాజననీజనకుల కష్టోదంతమును వినినప్పుడు- అంతవఱకతినిర్మలముగా నున్న నామనము- ఆక్షణములో మాఱి "కళవళ" పడుట కేమి కారణము? నేను వారికుమార్తె నగుటయే. అందుచే నేనాదార్భాగ్యులకు లొంగిపోయితిని. నాబుద్ధి యెప్పుడు మాఱినదో నాఁడే నాసత్ప్రవర్తనమునకు జలాంజలి యైనది. నాజ్ఞానవల్లి వెఱ్ఱిలతలు వైచినది. నావివేకారణ్యమునకుఁ గుఠారమైనది.........ఇఁక చెప్పవలసిన దేమున్నది?

దానితో నాదుష్టత్రయమునకు లొంగిపోయితిని. లక్ష్మణసింగును చేఁబట్టవలచితిని. వారి యభీష్టమునకు వ్యతిరిక్తముగా నేనేమాత్రము నడచిన ట్లనుమానము గలిగినను నాసర్వస్వమును దోఁచికొని నన్ను "బుక్కాఫకీరుని" చేయుమని మాటయిచ్చితిని. ఆనాఁడే వారు నాకు "మార్ఫియా" నొసంగిరి. ఇది జరిగినమూఁడవనాఁడు శనివారము. ఆనాఁటి రేయి మామగారు ఫలాహార మేమియు జేయవలదనియు- పాలుమాత్రముదాహమునుబుచ్చుకొందుననియు నాతో జెప్పిరి. ఆయవకాశమును బురస్కరించుకొని కథాకథనములోనికి దిగితిని.

రాజా—నీకాయాసము వృద్ధియగుచున్నది. నీవింక నొకటిరెండుగంటలుగూడ జీవింతువని తోపదు. నీదోషము సర్వము నొప్పుకొని పరమేశ్వరుని శిక్షనుండి కొంత తప్పించుకొమ్ము. నీవు తొలుత రఘునాధరావుగారి నేలచంపుటకై యత్నించితివి?

శ్యామ—ఈకుటుంబమునకు జెందిన యావదాస్తియు మాధవరావుగారి స్వార్జితము. మాధవరావుగారు జబ్బుగానుండిరి. ఆయనముందు గతించినచో నీయాస్తి మిగిలిన కుటుంబమునకు బిత్రియమైపోవును. అప్పుడీసంపద కట్టకడపటకు మిగులు నాకులభింపనీయక- ఏవారసుడో తన్నుకొనిపోవుదురు. అప్పుడీ ప్రయాస వ్యర్థముగదా? రఘునాధరావుగారు ముందుబోయినచో మాధవరావుగారు విల్లువ్రాయుదురు. ఆసమయమును గనిపెట్టి యావిల్లు సంగ్రహించి తక్కినచర్య నడిపింతమనుకొంటిని. అట్లేజరిగినది. విల్లుచిక్కినది. తరువాత బలవంతరావును జంపించి యాశిరస్సు నారాయణస్వామియింట బడవేయుమని చేసన- వారికి వారి పూర్వవైరములను బురస్కరించుకొని యాదురాత్ముడు- మాంర్వాడియింట బడవైచిరి. మాపతనమున కిది యొకముఖ్యకారణము.

రాజా—పాలలో విషముగలిపినదానవు నారాయణస్వామికేల యుత్తరమువ్రాసితివి. ఊరకొనినచో- ఇతరులకీ ఘోరము తెలియకుండ నుండునేమోగదా?

శ్యామ—దానికొక విశేషకారణమున్నది గాని లేక
పోలేదు. అడావుడిలో- అన్ని పాలలోను విషముగల్పితిని.
మాధవరావుగారికి పాలేయాధారము. ఆయనగూడ- ఆపాలే
గ్రోలినచో- విల్లువ్రాయకుండ మరణింతురు. అది నాయా
శయ వినాశనమునకు కారణము గాదా? ఆపాలు విషాక్తము
లని దెలిసినచో-మాధవరావు త్రాగఁడు. అందులకై యట్లుచే
సితిని. అదియునుగాక నీవు తొలుత- అనుమానించినట్లు- ఆ
యుత్తరమును నమ్మక- నీవు నారాయణస్వామిమీఁద చర్య
నడపినచో- ఋజువుచేయలేక- వాఁడుచిక్కులఁబడును. న్యా
యమునకు నీకు పరిశోధనలో బ్రవేశమేయున్న నీవు త్రొ
క్కవలసినమార్గమదియే. అందులకే యట్టిలేఖ వ్రాసితిని.

రాజా—మార్ఫియా సుభద్రట్రంకులో నేల బెట్టితివి?

శ్యామ—నీవు సుభద్ర ననుమానించితివి. మార్ఫి
యాగూడ నామె చెంత దొరికినచో- ఆమె నేరస్థురాలని రూ
ఢిపరచి- ఆమె నుఱిస్థంభ మెక్కింతువు. అప్పుడు కుమారమా
ధవరావును కోర్టువారు పెదతండ్రి కిచ్చెదరు. మాపరమయిన
మాచంటిబిడ్డ నెట్లో గడతేర్చి యేబాలరోగముచేతనో జచ్చి
నట్లు బ్రకటింతును. కాంతమ్మయు, పార్వతియు నారహస్యస్థ
లంబున నిర్బంధింపఁబడియుందురు. ఇంతవఱకు జరిగినచో మా
భార్యాభర్త లిద్దరమే మిగులుదుము. అప్పు డావిల్లుప్రకార
ము మాధవరావుగారి సంపదకంతకును నాభర్త యధికారి

యగును. అది స్థిరపడనిచ్చి ఒక్కమాత్రితో నాభర్తను మ్రిందించినచో- నాసంకల్పప్రికార మాయావదాస్తియు నాకు వశమగును. అప్పుడు నేను వైధవ్యదుఃఖ మనుభవించుచున్నదానివలె నీపెదతండ్రిదగ్గఱకు [అనఁగాఁ బుట్టినింటికి] జేరి- ఈవంశమును నిర్మూలించినట్లే- మీావంశముగూడ నిర్మూలించి- ఆయాస్తిగూడ చేబట్టుకొని- నాసంకల్పప్రికారముగా- స్వేచ్ఛగా- జీవింపదలంచితిని కాని పనితొందరలో కొన్ని పొరబాటులు చేయుటచే నాకీయవస్థ వచ్చినది. నాకు చాలనాయాసముగా నున్నది. నన్నిఁక పలుకరింపక యీకత్తి లాగివేయుము.

రాజా—అట్లే చేయుదునుగాని- ఆకారణము లేవియో చెప్పగలవా?

శ్యామ—ఇఁక నేదాఁచుకొనుటెందులకు? చెప్పుచుంటిని వినుము.

I. ఇదివరకు చెప్పినట్లు నామరది శిరస్సు మార్చాడీయింట బడవేయుట.

II. కాళిదాసు తెలివితక్కువచే వానిగుట్టు బట్టబయలయిపోవుట. సుభద్రను నీవు మాకు చిక్కకుండజేయుట.

III. రాముడును, భీముఁడును నాభర్తను గలుసుకొని "మీాయమ్మను విడిపింతుము. ఐదువేలి"మ్మని గోరుట.

IV. నేను శ్యామలరావునై నాభర్త సంకల్పప్రికార

ముగా డిటెక్టివునై బనిచేయ సంకల్పించుకొని రంగస్థలము న కురికియు జంకి వెనుకంజ వేయుట.

V. మారుమాటాడకుండ తప్పించుకొని రావలసిన నాభటులు, నరసింహముసంగతి సుభద్రా పార్వతులకు వినఁబడునట్లు మాటాడుకొనుట.

VI. నరసింహము వెంటనె నిన్నుగాల్చివేయక పిస్తో లుధ్వని విని యేమియో తెలిసికొనుటకై కాగడతో నీవలకు వచ్చుట.

VII. వెంటనే ముఖాచ్ఛాదనముతో నేను వచ్చి మిమ్మెల్ల నాయుదుకుగదులలో జంపివేయక నేను సద్దోషినని మీరు గ్రహించుటకై నాకు నేనే బాధింపఁబడియుండుట.

VIII. మిమ్మెందఱ నొక్కమారు జంపవలయు నని మీరహస్యమును గనిపెట్టి వచ్చిన లక్ష్మణశింగున కోరిమి లేకుండుట.

IX. నీవు నాభర్తతోఁ దగవులాడునప్పుడు వచ్చిన సింగు పరధ్యానమున నుండి పిస్తోలు నీవు లాగుకొనుచుండ మందమతియట్లూరకుండుట.

X. పార్వతి చిన్నపిల్లగదా యని చంపక విడుచుట.

ఈపది కారణములును నావినాశనమునకు గారణము లైనవి. అదిగాక భగవంతుఁడు న్యాయపక్షపాతియైనాఁడు. నీపైకి విసరిన నాకత్తి-నిన్ను విడచి-నాభర్తప్రాణములను దీసి

నది. లేనిపోని అడియాసలకు బోయి యెంతగత్తరమైన జేసితి
ని. నీకెన్ని యనుమానములైన బుట్టించితిని. రాముని బ్రేరే
పించి-నాభర్త యట్లలంకరించి సుభద్ర లోంగునేమోయని
చూచితిని. అదియు నిరర్థకమైనది. అది నిరర్థకమైనను-నాభ
ర్తనేరస్థుఁడని నిర్ణయించి- ఉరికంబమెక్కింతువేమో యను
కొంటిని. కాని నీముందు నాయుక్తి నీళ్లుగారిపోయినది.
"నూఱుగొడ్డులను దిన్న రాఁబందున కొక్క-గాలివాన"యు
న్నట్లు నాపనియైనది.

అ-న్నా!...నే-నీ-బా-ధ-స-హిం-పఁ-జా-ల-కు-న్నా
ను-చె-ప్ప-వ- ల-సి-న-దె-ల్ల-చెప్పి-తి-ని-దా-చు-కొ-న-లే
దు-అ-న్న-ట్లు-మ-ర-చి-తి-ని-మా-ధ-వ-రా-వు-వ్రా-సి-న
వి-ల్లు-నే-నే-దొం-గి-లి-నా-కా-లి-జో-డు-లో-భ-ద్ర-ప-
ఱ-చి-అ-ట-చే-వి-గిం-చి-తి-ని-కు-డి-కా-లి-జో-డు-లో-ను
న్న-ది-తీసికొ-మ్ము. నే-ను-మొ-ద-టి-నుం-డి-యు-గు-ణ-
మం-తు-రా-ల-న-ని-అంద-ఱ-కు-ను-తె-లి-యు-ను. అం-దు-
చే- నే-ని-ట్టి-నీ-చ-ము-న-కొ-డి-గ-ట్టు-దు-న-ని-ఎ-వ్వ-ర-
ను-కొ-న-జా-ల-క-పో-యి-రి. ఆ-య భి-ప్రా-య-ము-తో
డ-నే-తా-త-నా-కు-ప్ర-త్యే-క-ము-భా-గ-మి- చ్చె- ను.
అ-ట్టి-తా-త-ను-జం-పి-న-పా-ప-ము-నా-కిం-త-టం-త-ట-
దీ-ర-దు. అ-బ్బ-అ-బ్బ.....బా-ధ-దు-ర్భ-ర-ము-క-త్తి-
తీ-యు-ము-తీయు-ము................

రాజారావు వెంటనే యాకత్తి దీసివైచెను. ఆయుత్త రక్షణముననే శ్యామల ప్రాణవాయువు లనంతవాయువునఁ గలిసిపోయెను. శ్యామల కట్టెమాత్రము—ఆకటికి నేలను బడి యుండెను.

సరిగా నీసమయమునఁ గొందఱు పోలీసువారితో—పార్వతియు-నేఁబదియేండ్ల పురుషుఁడును నామార్గముగుండ ముందునకు బోవుచుండిరి. వారెల్ల రొక్కుమ్మడిగా రాజారావును గాంచి చటాలున నాగి వానిని సమీపించిరి.

బావా! ఇంతకాలమునకు హంతకుఁడు దొరికినాఁడు. ఇదివఱకు మన మనుమానించిన వారెవ్వరును హంతకులు గారు. హంతకుఁడు ప్రాణాపాయస్థితియందు దాసుపత్రిలో నున్నాఁడు. నాపెద్దన్నగారుకూడ నట్టి స్థితిలోనే యుండిరి. ఇంతకును కారకుఁడు పోలీసు సర్కిలినస్పెక్టరు లక్ష్మణసింగు" అని పార్వతియనెను.

# పదునొకండవ ప్రకరణము.



తరువాత.

తండ్రీ! క్షమింపుము. ఈదౌర్భాగ్యుఁడు నీతమ్ముని కుమారుం డనిపించుకొనుటకు దగిన గుణగణములు గలవాఁడు గాఁడు. మీయాజ్ఞగొనక—స్వతంత్రించి—యిచ్చట డిటెక్టివుగా బనిచేసి—నీదత్తపుత్రికను—శ్యామలను—నా

పొట్టఁబెట్టుకొంటిని. నిన్ను జూచుటకు లజ్జించుచున్నాను. రక్షింపుము రక్షింపుము.

అని బాలునికంటె నికృష్టముగా రాజారావు వేఁడుచుఁ బెదతండ్రియగు నారాయణరావు కాళ్ళపైఁ బడెను.

పార్వతి వెంటవచ్చిన యేఁబదియేండ్లపురుషుఁడే నారాయణరావని పాఠకమహాశయులు గ్రహియింతురు గాక.

నారాయణరావా రాజారావు లేవనెత్తి:—

నాయనా! సమయమునకు నే నిక్కడ లేకుంటచే నిట్టి యనర్థము లుత్పన్నమైనవి. ఈపార్వతి యిచ్చట నడచిన వృత్తాంత మామూలచూడముగా నెఱింగించినది. ఆచరిత్ర వినగనే హంతయెవ్వరో నేను గ్రహించితిని. నాయంతసూక్ష్మముగా గ్రహించుటకు నీకవకాశము లేదు. నీవనినట్లా శ్యామల నాదత్తపుత్రియే కాని—అది దొంగల నాయకుండగు దుర్గముని కూతురు. పండ్రెండుదినముల పసిబిడ్డగదా యని కనికరించి—పెంచి—పెద్దదానిని జేసినందుల కిట్టి యనర్థము వచ్చినది. ఆమెయే హంతకురాలు దానిని బెంచి కులమునకు పచ్చదెచ్చితిని. దాని జన్మరహస్యము దానికి తెలియదనుకుంటిని. ఎట్లో తెలిసినది. దుర్మార్గమున కొడిగట్టినది. కుమారా! జన్మవాసన యెట్లు నశించును? దాని మొదటిగుణంబులు నమ్ముటచే నీవామె ననుమానింపఁజాలవైతివి. పులిపిల్లను బెంచినచో—పెంచిన ప్రేమతో నది

మనలను జంపకుండ విడచునా? ఎట్లయిననేమి? భగవంతుఁడు పాపులకు దగిన శిక్షవిధించినాఁడు. నీవు మొదటనిచ్చిన టెలిగ్రాము నాకందకుండ లక్ష్మణసింగు మాయజేసియుండును. నీవింతవఱకు రాకుండుట కేమికారణమాయని సందేహించుచు నేనును బయలుదేఱి వచ్చితిని. కుమారా! అదుష్టురాలి మరణమునుగూర్చి నేను విచారించుటలేదుగాని - నీవు వధించితివేమో యని సంశయించుచున్నాను....

జనకా! ఎంతమాట. ఆమె యిచ్చటనుండి పల్లమునకు బరుగెత్తుటలో కాలుజాఱి బడినది. ఆపడుటలో - ఆమె కత్తియే - ఆమె వక్షస్థలమునఁ గుచ్చుకొనిపోయినది. ఇఁక లాభములేదని - నిజచరిత్రమెల్ల నెఱిఁగించి - కత్తిదీయుమని గోరుటచే దీసితిని. కత్తిదీయగనే గతించినది. అని రాజారావనియెను.

నాయనా! సంతోషము. మనమిక్కడ నిలువవలసిన పనిలేదు. ఈశవమును వైద్యాలయమునకు బంపి మనముగూడ - పోదమురమ్ము. అని నారాయణరావనియెను.

అంతయు యథాప్రకారముగా జరిగెను. వీరు వైద్యాలయముకరుగునప్పటికి కామేశ్వరరావు, లక్ష్మణసింగు లిర్వురుగూడ నీలోకమును విడచిపోయిరి. క్రమముగు పంచాయితీ జరిగినపిమ్మట వైద్యుని సర్టిఫికెట్టులతో నెవరియిండ్లకు వారు

పోయిరి. రాజ్యారా వెల్లవిషయంబులును దొరతనమువారికి రిపోర్టుయిచ్చివైచెను.

# ఉపసంహారము.

పాఠకమహాశయా! కంఠ్గారగాంచినవారుగూడ కథ యేమో లేక- కలయేమో యని సంశయించునట్లుగా నీకథ ముగిసినది. ఇంక నొకటి రెండు చెప్పవలసినముక్కలు చెప్పి తెర దింపెదను. ఈయల్లరకు మూలకారకులందఱు గతించిరిగనుకను- మిగిలినరాముడు పిస్తోలుదెబ్బతిన్నవాడు గనుకను దొరతనమువారు వానిని "అండమానుదీవులు" సేవింప బంపివైచిరి.

మాధవరావు వ్రాసినవిల్లు- అమలులోనికి వచ్చెను. మాధవరావు సుభద్ర ననేకగతుల సంశయించినను- బలవంతరావునకుమాంత్రము కామేశ్వరరావుతో సమముగనే వ్రాసెను. శ్యామలకు బదివేలదనమిచ్చెను. పార్వతికి పాతికవేలు వ్రాసెను.

కాని యీవిల్లు యిప్పుడేమిలాభము? శ్యామలాకామేశ్వరరావు లిరువురును గతించిపోయిరి. ఆయాస్తికిగూడ కుమారమాధవరావే వారసుడయ్యెను.

క్రమక్రమముగా నందజీవిచారములును తగ్గిపోయెను. సుభద్ర బుద్ధిమంతురాలై, అత్తగారగు కాంతమ్మతో ముచ్చటించి యొక శుభముహూర్తంబున పార్వతిని రాజారావున కిచ్చి యెట్లో పరిణయమైనదనిపించెను. పార్వతికి తాతగారిచ్చిన ద్రవ్య మిచ్చివైచెను. తరువాత రాజారావుచేసిన యుపకారమునకు సంతసించి- శ్యామలా కామేశ్వరరావులకు తాతగారొసంగినయాస్తి రాజారావునకు కట్నముగా నొసంగివైచెను. మిగిలినయాస్తికి కుమారమాధవరావు హక్కుదారుడు గనుక- ఆతఁడు మూఁడుమాసముల పసిగుడ్డుగాన- రాజారావే సంరక్షకుఁడుగానుండి యాయాస్తి వృద్ధిజేయుట కేర్పాటు గావింపఁబడెను. దుర్మార్గురాలగు శ్యామల చావుతో నాయింటిశని విరగఁడైపోయెను.

తన వలపులగనియగు పార్వతిని పెండ్లియాడి రాజారావు బ్రహ్మానందభరితుఁడయిపోయెను. దానికితోడ మిక్కిలి యైశ్వర్యవంతుఁడై పోయెను.

దుష్టశిక్షణ, శిష్టరక్షణుండగు భగవంతుఁడు నిష్పక్షపాతమనస్కుండు గదా?

న్యాయపక్షపాతియగు రాజారావును దొరతనమువారుగూడ విశేషముగా సత్కరించి యాతనినున్నతపదవికి దెచ్చిరి. నిర్దోషియగు నారాయణస్వామి యుద్యోగములో బ్రవేశించి సర్కిలినస్పెక్టరయ్యెను.

అన్యాయముగాఁ జెఱలోఁబడిన గోవిందుడుగూడ ధర్మతత్పరుఁడైన రాజారావును సేవించుటలో తన జీవితమును సుఖముగా గడుపుచుండెను. గోవిందు తనపూర్వపుయజమానిని మరచిపోవునట్లుగా రాజారావు చూచుచుండెను.

రాజారావును పిఠాపురమునందే యుండవలసినదనియు- పార్వతిని విడచి- యిట్టిస్థితిలో జీవింపజాలననియు- కాంతమ్మగోరుట- తన పెదతండ్రియగు నారాయణరావు- అనుజ్ఞపై రాజారావు పిఠాపురనివాసియైపోయెను.

సత్యదీక్షగలవారికి తొలుత కష్టములు సంప్రాప్తించును. అంతమాత్రమున నధైర్యపడక యాకష్టముల నెదుర్కొని పనిచేసినచో రాజారావు, నారాయణస్వామి, గోవిందుల యట్లు తుదకు జయించి కీర్త్యున్నతుల నిల్పుకొందురు. అదియన్యాయమార్గమైనచో- శ్యామలాలక్ష్మణసింగులవలె దుర్మరణమందుదురు. ఇంతకన్న చెప్పవలసిన దేమున్నది?

సమాప్తము.



# తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 8 | బునర్జీజితము | బుఃర్జీవితము |
| 16 | 4 | శ్రిద్ద | శ్రిద్ధ |
| 23 | 29 | సహాయలు | సహాయులు |
| 26 | 21 | మరతమను | మరతుమను |
| 43 | 19 | మిగిన | మిగిలిన |
| 44 | 1 | జేపి | జేసి |
| 51 | 13 | ప్రేమ–మ | ప్రేమ–మరి |
| 58 | 10 | కారణమునవచ్చి | కారణమునవో వచ్చి |
| 88 | 3 | అవి భర్త | అవి భక్త |
| 94 | 12 | భగవదేచ్ప | భగవదేచ్ఛ |
| 99 | 10 | కటెంగించినవో | కతెంగించినవో |
| 116 | 21 | ఎంకాల | ఎంతకాల |
| 125 | 20 | విరోధియెవ్వ | విరోధులెవ్వ |
| 141 | 21 | సెం 198 రు | సెం 206 రు |
| 154 | 14 | ఈసాల్గు | ఈవాల్గు |
| 157 | 21 | వాద్వానము | వాగ్దానము |
| 177 | 18 | పింహాభ్రుబిల్ల | సింహాభ్రుబిల్ల |
| 178 | 16 | గావలసియున్నచో | గావలసియున్నచో |
| 182 | 7 | ఆజవ్మ | ఆజన్మ |
| 190 | 18 | వాక్యలే | వాక్యయే |
| 196 | 1 | తపస్ని శ్చే | తపస్విన్లే |
| 198 | 19 | కాము | కాని |
| 216 | 7 | మిాయుత | మూయుత |

# భరతసంగ్రహము

పద్యకావ్యము- తాత్పర్యముతోసహా.

వేదులసీతారామశాస్త్రి ప్రణీతము.   వెల రు 1-0-0.

ఇందు 1. భావాధ్యాయము—శాస్త్రోపనయనము, అభినయలక్షణము, సభాలక్షణము, పాత్రలక్షణము, నటలక్షణము, సభానాయకలక్షణము, శిరోభేదములు, నేత్రభేదములు, గ్రీవాభేదములు, హస్తద్వాదశప్రాణములు, అసంయుతహస్తములు, సంయుతహస్తములు, ప్రస్తారహస్తములు, నట్టోద్ధిష్టములు, యితరహస్తములు వాటికి స్థాననిరూపణములు మొదలగునవి అభినయము నేర్చుకొనువారికిని, నేర్పువారికిని మిక్కిలి యుపయోగకారి. మేజువాణీలలో ముందుకూర్చుండ వేసుక పదువారీ గ్రంథమును తప్పక జదివిన హస్తములలోపములను సులభముగా గ్రహింపగలిగి పరిహసింపగలుగుదురు.

## జ్యోతిష గ్రంథములు.

### జాతకమార్తాండము.

ప్రథమభాగము.

[ఆకెళ్ళ వేంకటశాస్త్రిగారిచే రచియింపఁబడినది.]

ఈగ్రంథము నూతనముగా జ్యోతిషము నేర్చుకొను వారికి మిక్కిలి యుపయోగకరము. గ్రంథము దగ్గరనున్న

యెడల యెవరిజాతకము వారు చూచుకొనవచ్చును. ఎవరి జాతకము వారు పూర్తిగా వ్రాసికొనవచ్చును. దీనినిబట్టి ఎవరికి కావలసినయంశములు వారు వేరువేరుగాను ప్రతిసంవత్సరములోను జరుగు సంగతులు ఎప్పటికప్పుడు సులభముగా తెలిసికొనవచ్చును. ఈగ్రంథములో అనేకమైన అనుభవ జాతకములు చక్రములతోను ఉదాహరణములతోను బోధనపూర్వకముగాను శాస్త్రసమ్మతముగాను వ్రాయబడినది. ఈగ్రంథము సులభముగాను శాస్త్రసమ్మతముగాను లేదని వాదించినవారీ ప్రపంచమున లేరనిరే చెప్పవచ్చును.

వెల రు 2—0—0.

రెండవభాగము.

ఇది అచ్చుపూర్తియై సిద్ధముగానున్నది. ఇది 320 పేజీలుగల గ్రంథము. దీనియందు లగ్నస్ఫుటము గ్రహస్ఫుటము భావస్ఫుటము షోడశవర్గు అష్టకవర్గు షడ్బలములు తాత్పర్యముతోను విశేషాంశములతోను సుమారు 1000 శ్లోకములు ద్వాదశభావఫలములును మహాదశాంతర్దశాఫలములు మొదలగు ననేకసంగతులు మిక్కిలి అత్యద్భుతముగా వ్రాయబడినది. దీని వెల పోష్టుఖర్చులుగాక రు 2-0-0 అగును. కావలసినవారికి వి. పి. గా పంపెదము. ఆలస్యమయినయెడల ప్రతులుదొరకవు.

# రోషనార

కర్త: కొప్పరపు సుబ్బారావుగారు.

ఏరాజును మహారాష్ట్రమంత తన గర్భంబున గని ధన్యమయ్యెనో- ఏమహారాజునకు ఛత్రాధిపత్యము నిలుపుటకు తగిన తావయ్యెనో- ఏసామ్రాజ్యభామిని పేరు వినినంతనే మొగలాయీ సామ్రాజ్య మూర్తులు గాగిరదో- ఏమహామహుని కీర్తి కిరీటములు పిక్కటిల్ల పగతురకు పక్కలోని బల్లెమయ్యెనో- ఏమహాత్ముడు యేకపత్నీవ్రతమును నిత్యము జరపెనో ఏరాజు దురంతరములోనరుచు ముష్కరులకు గంటకుడై నెగడెనో- అట్టిశివాజీ చరిత్ర మీరోషనార. అతిసౌందర్యవతురాలై అనేకమంది తన కరిగాపులై తనయుండనుండ శివాజీ నేకోరి, మోహాములకను బడయజాలక నానాబాధలనుభవించి పంతగించి కాలినడకనే మహాటవులలో నడకసాగించి, శివాజీతో యుద్ధంబునకు దలపడి, తన మనోభీష్టము నెరవేరకునికి మహారాష్ట్రదేశమంతే మరణశయ్యనెక్కి, గుక్కెడు ప్రాణము తనను వీడుచున్నను గూడా శివాజీయందుండు ప్రేమ వీడజాలక, కడకు ప్రాణను వీడెనో అట్టి వీరనారి రోషనారచరిత్రమున్న గలిపి నాటకరూపముగా వ్రాయబడిన నాణ్యముగని ఈరోషనార. ఎందరెందరో రాజులు పరిపాలించి అందలేని కీర్తి చంద్రికను తానేకయుద్ధములలో జయమొంది సంపాదించి యుందిమించిన దీశివాజీచరిత్రమే. అనేక నాటకకంపెనీలవారిచే నాడబడి ఎన్నో మార్పులచే ప్రత్తిపుఁబడి పత్రికులైపోయిన వీరోషనారయే.

దీనివెల రు 1—0—0.

---

వలయువారు:—సన్ లైట్ బుక్ డిపో, రాజమండ్రి.

# కాలసర్పము

(అపరాధపరిశోధకనవల)





పబ్లిషర్సు:

సన్‌లైటు బుక్కుడిపో,

రాజమండ్రి